# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక



సంపుటి ౬ : : ౨. ౩. ౪ సంచికలు

సంపుటి ౬ : అక్టోబరు ౧౯౪౧ - జూన్ ౧౯౪౨ : ౨.౩.౪ సంచికలు



" ప్రతిభ " : జూలై మొదలు జూన్ ఆఖరుకు సంపుటి. చందా మూడు రూపాయలు.

# నా తొలి రచన §

## (మద్రాసు రేడియోవారి తృతీయ కవి సమ్మేళనము.)

### శ్రీ తెలికిచర్ల వెంకటరత్నం

కవుల కావ్యాలు చదివీ వినీ ఎంత ఆనందిస్తామో వారి చరిత్ర తెలుసుకోవలెనని అంత అభిలషిస్తాము. కవుల చరిత్ర అంటే ప్రధానముగా వారి కావ్య రచనకూ కవితాజీవితానికీ సంబంధించిన దన్నమాట. వారి కవిత్వము ఎలా మొలకలెత్తినదో, ఏ పరిస్థితులలో, ఏ పద్ధతులతో ఆరంభించినదో తెలుసుకోవలెనని మనకందరికీ కుతూహలముగా ఉంటుంది గదా.

అందువల్ల ఇక్కడ సమావిష్టులైన కవిమిత్రుల నందరినీ ఒక ప్రశ్న అడుగుదాము. అయ్యా, తమ మొదటి రచన ఏది! అది ఏరీతిగా అవతరించిందో దయచేసి చెప్పండి! ఆఁ. నమస్కారమండి శ్రీ వెంకటపార్వతీశ కవులూ! మొదట మీరు సెలవిస్తారా?

### శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు

ఒక సుముహూర్తమున మా ఒండొరుల శక్తి సమ్మేళనమైనది. హృదయసమ్మేళనము ఐనది. షడ్జస్వరమును పంచమస్వరమును గలసి శ్రుతి సమ్మేళన మాయినట్లైనది.

ఆ మధుర క్షణమునందు మా హృదయవల్లకి వివిధ స్వరములతో వివిధ గీతములతో నిత్య నూతన గతులలో విశ్వగానము ఆలపించుటకు సంకల్పించినది.

ఎందుకని?

పూవుల మెత్తదనమును, తేనెల తియ్యదనమును, తెమ్మెరల కమ్మదనమును, వెన్నెలల చల్లదనమును, చుక్కల చక్కదనమును వెలయించి, ప్రకృతి హృదయమును పులకింప జేయవలయునని. భక్తిజ్ఞాన దీపికలచే బాహ్యాంతరములను ప్రకాశింప జేసి, సుఖదుఃఖాదిక ద్వంద్వ భావపూరితమగు భువనమంతటినీ నఖిల జీవానంద సంధాయకమగు బృందావనముగా జేసి దైవ ప్రణయ భావ సంకీర్తనము చేయవలెనని.

సమశ్రుతి సమన్వితమగు ఆ సంకీర్తనాలాపములో షడ్జస్వరము పంచమమున లీనమయ్యెనా! పంచమస్వరము షడ్జమున లీనమయ్యెనా అను ప్రశ్నమున కవకాశ మెక్కడ?

అట్టి అవకాశము లేని సామరస్యమునందే, అపురూపమగునట్టి ఐక్యభావములోనే మా తొలికవిత అవతరించినది.

అప్పుడే,

‘ఎంచగా రాని శబ్దప్రపంచమందు
నేను వేరు రూపంబుల వెలయు నీదు
విమల పదముల నాత్మ భావించుచుండు
మనికియును మాకు దెల్పుము మక్షరంబ.’

అని ప్రార్థన మయినది. ఆ ప్రార్థనానంతరము ఏకాగ్రచిత్తముతోడి తన్మయావస్థలో—

‘అమృత సురభిళ మృదు లతాంతములతోడ
నమృత పరిపక్వ ఫల గుళుచ్ఛములతోడ
నమృత రసమాధురీమూర్తి వైన నిన్ను
గంటిమో తల్లి సుకవితా కల్పవల్లి.’

అను ఆనందరసమయోక్తులు మాలోనుండి వెలువడినవి. అట్టి దివ్య సందర్శన సౌభాగ్య సమయమున—

§ ఆల్ ఇండియా రేడియోవారి అనుమతితో.

'విమల నవనీత మృదుల శబ్దములఁ గూర్చి
రమ్యభావ ప్రబోధకార్గములఁ గూర్చి
ప్రకృతుల గరంచు నెట్టి కావ్యములనైన
మహిత గతి వ్రాయుమా వ్రాయుమా కవీంద్ర.'

అని ఆజ్ఞయైనది. ఆ కవితాసరస్వతి ఆదేశాను సారముగా,

'ప్రౌఢవాఙ్మయంబుఁ బ్రణయ శ్రుతులయందు
ముగ్ధజీవభావములీలి మ్రోగి
సరసభక్తి భావ సంకీర్తనంబయి
విశ్వవీణ మేళవింపఁబోడఁగె.'

ఇది మా కవిత యవతారిక—

గాన మాతనిది, చొక్కంపైన శ్రుతి నాది,
సరసమోహన కలస్వనము మాది:
రాగ మాతనిది, తోరంపైన కళ నాది,
శాంత సుందర విలాసంబు మాది:
స్వర మాతనిది, విభాసురమైన లయ నాది,
సురుచిరామోద విస్ఫురణ మాది;
భావ మాతనిది, జీవంబైన ధ్వని నాది,
నవనవానంద వైభవము మాది;

చోద్యముగ బాడు నాతండు చూపులోన,
పట్టి యాడెద నేఁ గనుపాపలోన,
ఎప్పుగా మెప్పుగాఁ దోచు నింతలోన,
చూపులోఁ బాపయై కవితా పురాణి.

అట్టి తన్మయానంద సమయమున— అట్టి ఏకాంత సేవావసరమున—ఎవరు? ఏమనుచున్నారు?

ఇంపుగ నయనంబు లేకమైనప్పుడు
సింగిసై ద్రేలెనే నీలాల పేరు?
ఇద్దఱి వదనంబు లెదురైన యప్పుడు
విస్ఫురంబు ద్రాకనే వెన్నెలతీగ?
ఒండొరుల పలుకు లొక్కటైనప్పుడు
గిన్నెల నిండెనే దివ్యగానములు?
ఊపిరుల హృదయంబు లూరసిన యప్పుడు
పరవశమయ్యెనే ప్రకృతి యంతయును.

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

నీవు మొదట ఎక్కడ పుట్టావని ఒక మహానదిని అడిగితే ఎంత అందంగా ఉంటుందో నీ మొదటి రచన ఏదో చెప్పు అని ఒక మహాకవిని అడిగినా ఒకటే అందంగా ఉంటుంది. కాని కోకిల ఏదో ఒక వయస్సు వచ్చేటప్పటికి ఒక వసంతము హఠాత్తుగా దాని గొంతులోఉన్న పంచమాన్ని విడి యిస్తుంది. అల్లా కవికూడానా? ఏమో. నండూరు సుబ్బారావుగారైతే కావచ్చు. ఎందుకంటే, ఉండుండి హఠాత్తుగా ఒక రోజున ఆయన గుండె గొంతుకలోన కొట్లాడింది. మరి ఈ పదతిలో వాడు మాతమ్ముడు నాయని సుబ్బారావు,—అతనికీ ఇలాగే ఒక లోకోత్తరమైన అనుభూతి విశేషం వచ్చేటప్పటికీ అతని గీతాశక్తి పండిన దానిమ్మకాయ వలె పగిలింది. ఇలాంటివాళ్ళు చెదురుగా అక్కడక్కడ ఉంటే ఉండవచ్చు. కాని ఛందోవృత్త మార్గాలలో వ్రాసేవాళ్ళకు ఇట్టి—(భవభూతి చెప్పినట్టుగా)—ఆకస్మిక ప్రత్యవభాసం కలుగుతుందా అని ప్రశ్న. ఈ ఆకస్మిక ప్రత్యవభాసం 'మానిషాద ప్రతిష్ఠాం త్వం' అని వాల్మీకి కంఠం వికసించిందని బ్రహ్మదేవుడన్నాడు. ఆ నూత్న సరస్వతీపతాకము నిండిన భావాంగాలు ఒక్కసారి ఆగ్నేయిస్తూ చిత్ర భంగిమలతో రంగపూర్వ ప్రదేశమునుండి రంగము ముందుకు నడుస్తూ వచ్చిన నాట్యకత్తెవలె వచ్చింది. ఇలా యెంత మందికి వస్తుంది! అలా నిండివచ్చేదాకా ఆగే ఓపిక మనకి ఉందా లేదా అనిపిస్తోంది. వ్యుత్పత్తి పరిణతమయి ప్రతిభ ఒత్తిడికి ఆగలేక రెక్కలు సాచి సముప్రసారంగా పై గాలితెరలలో నుంచీ వాలుగా క్రిందికివచ్చే రాజహంసల్లే తన సరస్వతిని రానిచ్చుకునే ఓపిక, నలుకడ, కవులకు పోయినట్లు ఉన్నది. దీనినే కొందరట్లా అంటున్నారు—కవులు రెండు రకాలని. తాను బాగా చదువుకుని అప్పుడు వ్రాసేవాడు, ధోరణిగా మొదలెట్టి క్రమ

క్రమంగా చదువుకుంటూ వచ్చేవాడు. వీళ్ళిద్దరికీ ఎదురు బదుళ్ళుగా ఇంకోయిద్దరున్నారన్న మాట నిజమే. చదువుకుని పాటపెగలనివాడు. వాడు కవే కాదంటాము. కాని మిణుకుతాడు. గిలుకుతాడు. రెండవవాడు ధోరణి సాగటంతోటే కష్టపడట మెందుకని యిదే పరమావధి అని అక్కడే గుడారం వేసుకు కూచునేవాడు. ఏతావతా అయా కవులకు ఎంతవున్నా ఛందోమయసరస్వతీ మార్గాన్ని శతశః హృదయంతో విశ్వసించే నావంటివాడిని నీ తొలిరచన ఏదీ అంటే నా పదకొండవ యేట మొదలుపెట్టిన ఇప్పటియ్యేయేడు వచ్చేదాక యెన్ని యెన్నో ముక్కూ మొహం లేని పద్యాలు వ్రాస్తూ చింపేస్తూ వచ్చిపచ్చి నిజంగా ఇవి బాగానే వుందిరా అని అనుకున్న పద్యం నిజంగా యెప్పుడున్నదో తెలుసుకో లేనివాడిని గురించి అడిగితే చెప్పటం చాలాకష్టం. చిన్నచిన్న చెదురుపద్యాలు నేను, మా కొండాలి ఆంజనేయులు కలిసి యెన్నెన్నో వ్రాశాము. వాటిల్లో ఒకపద్యం చదవరాదా అంటే నేను వ్రాసిన పద్యం గనక జ్ఞాపకం వుండేమో గాని పద్యం రాదు. నా కవిత్వంలో తీర్చి పద్యంపద్యానికోసం రచ్చిత యెంత మట్టుకు వుంటుంది? ప్రసన్న కథాకవిత అలవాటైనా, శ్రీనాథుడు, పోతన, పెద్దన మొదలయిన వాళ్ళ మార్గాన పోయేవాళ్ళకయినా అల్లాంటి పద్యాలు వుంటాయి. తిక్కనగారిని 'మీరు వ్రాసిన భారత భాగంలో ఉత్తమమైన పద్యం చదవ' మంటే 'సింగంబాకటితో' అన్న పద్యం చదివాడు. తిక్కనగారి కవిత్వంలో ఆ పద్యానికి నిజంగా అటువంటి దశ వుందని నేను అనుకోను. తిక్కనగారి కవితా పద్ధతి అల్లాంటిది. భావాన్ని ఎక్కువగా సంగ్రహిస్తూ మార్దవము, హాయి, శబ్దానికే సమకూరుద్దామనే ప్రయత్నమేమీ ఉండదు. తాను చెప్పబోయే అధికమయిన భావాన్ని క్రొత్తభావాన్ని తరుముకువచ్చే భావాన్ని – సర్వభాషా తనలో జీర్ణిస్తే, తన విద్యా సంస్కారాలన్నీ ఒక్క మొగిని ఆ భావమును చెప్పుటకు అభిముఖంగా ఉండగా, తనకున్న అనంత భాషాసామర్థ్యంలో ఈ ప్రత్యేకమయిన విశిష్ట భావం తన యిష్టంవచ్చిన – అది అదిగా తెలుసుకొన్న – యే శబ్దజాలము ఆ కాలాన్ని ఆ భావాన్ని అనుమతుని పరయ్యో అదేచెప్తాడు కవి. ఇంగ్లీషులో సాంగ్ అన్నట్లుగా తెలుగులో పాట అంటున్నాము. ఈ పాటతనము ఆ మాటకు యెంతవుంది? ఇది ఒక వసంతంవలె మావిరెమ్మ చివర ఎర్రగా కనిపిస్తోన్న చిగురల్లే తొంగిచూడదు. పండిన నేల పనసల్లే ఒక్కసారి గుప్పుమని మెరిగె లోనుండి పరిణత రూపంగా కనిపిస్తుంది.

నిజానికి 'ధన్యకైలాసమో'', 'మర్యోధనుడు' అనే నాటకమో 'ఆంధ్ర పౌరుషమో' ఈ మూడింటిలో నా తొలిరచన ఏదో నాకు జ్ఞాపకం లేదు. 'మర్యోధనుడు', 'ధన్యకైలాసము' నాటకాలు. కొందరు ఈయన నాటకాలు చదివేవి కాని ఆడేవి కావంటున్నారు. ఎట్లాగయితేనేమి 'ధన్యకైలాసము' నా మొదటి రచన అని నా ఉద్దేశ్యము. అందుచేత ప్రధానంగా నేను నాటకకవి నల్లే ఉంది. అందులోది ఒక పద్యం—

'తరుణి చెక్కిలింటి కనకపత్రములలోన
వ్రాయబడె స్వర్గ సౌఖ్యాక్షరములపంక్తి
చదివి చదివి నా గుండియ ప్రేమలుకాని
ఇంచుకన్ము మది గోచరించలేదు.'

## శ్రీ నందూరి సుబ్బారావు

కూటికుండను
భుజముపై నిడు
వాటపదిరొయిక
మురువు గులుకగ
పాటబాడెను పాటలాధరి చెట్ల చేమలకై

ఎవనిగూరిచి పాటపాడెనో
ఎవని నామము ధన్య మాయెనో
• లవణుడను మాటొకటి నాచెవి
సోకినట్లయ్యెన్.

పాటబాడెను చెట్టుచేమలు
కోటిచెవులను గ్రోలి యలరగ
తాటివనమున నాగి చంద్రుడు
తాను చెవి యొగ్గెన్.

గురజాడ అప్పరాయ కవిశేఖరునికి కోపం వచ్చినా సరే - ఇది నా తొలిరచన.

౨. కాపుకన్నియ కొప్పు కైసేయు పూవ
అడవికంచెల నందమై యొప్పు పూవ
పోవచే మాతల్లి పూజకో పూవ.

రాయప్రోలు కనుబొమలు ముడివేయుగాక - ఇది నా ప్రథమగేయం.

౩. పాడుట కొప్పచేని పడవ ల్నడిపించెడి
యేటి త్రోవతే
చూడగవద్దు లేతమనసుల్ తడిజేసెడు
చెట్ల చాటునన్
కూడిన మేనలాపకోన కొమ్మల నాకుల
వోలె నొక్క మా
టాడక కూరుచుండ మనుమైన పొలమ్ముల
గట్ల నీడలన్.

ఇది నా మొదటి పాట - అబ్బూరి తబ్బిబ్బు కానీ.

౪. ఆ సాయం సమయంలో-
మెళ్ళో పూసల పేరు
తల్లో పూవుల సేరు
కళ్ళెత్తితే సాలు
కనికాటిసే కాలు.

అనే పదం వ్రాసి ఇదే నా తొలిరచన అను కున్నా. మిత్రుడు అధికార్ల సూర్యనారాయణవద్ద. -

గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ
కూకుండనీదురా కూసింత సేపు.

అని చదివినప్పుడు అతడు ఈ నీ పాటకొరకు చూస్తు న్నానన్నాడు. ఆనాటి అధికార్ల వాని ప్రేమదృష్టి నా తొలిరచన.

౧౯౨౦ జూన్.

సామర్లకోట రైలుస్టేషన్. అప్పటికి ఎంతకాలం క్రితమో కలుసుకున్న తమ్ముడు కృష్ణశాస్త్రి ప్లాటు ఫారంమీద కనుపించినాడు. సన్నగా వర్షం పడు తోంది. ప్లాటుఫారంమీద ఒక లాంతరు స్తంభం వద్ద కూర్చోపెట్టి చదివి వినిపించాను:

ఈరేయి నొక్క తెవు - అన్న పాట,
నాయుడుబావ పాట.

అతను నాలా చిత్రంగా నాకేసి చూశాడు. అది నా తొలిరచన. అతనితో కాకినాడలో చదువుకొంటూన్న వ్వుడు.

అకొండ, అతోట, అయేను, అయెంక - ఇది నా తొలిరచన

ఎంకెవ్వరని.........

౧౪-౨-౧౯౨౪ బందరు కాలేజి హాస్టల్లో నా పాటలు పాడుతుండే లోపలకు వచ్చి ముద్దైన కళ్ళతో నన్నుగట్టిగా పట్టుకుని 'నీవు కవి'వన్నాడు- విశ్వనాథ. ఇది నా తొలిరచన. డిసెంబరు ౧౯౨౪ సాహితీసమితి సభాపతి శ్రీ శివశంకరశాస్త్రి నా ప్రక్క కూర్చుని పాటలు పాడించి తీవిగా చూచి నాడు. ఇది నా తొలిరచన.

## శ్రీ దువ్వూరి రామిరెడ్డి

కొంతమంది కవులు బాల్యమునుండి కవిత్వము వ్రాయుచుండిరని వినియుంటిని. నాకు మాత్రము పందొమ్మిది సంవత్సరముల ప్రాయమున దాంత. కవిత ఒక్కతూరిగా చేపడినవి. ఇది కాకతాళీయం కావచ్చును. కవితాప్రారంభమునకు పూర్వము నాకు తెలుగు వాఙ్మయములతో ఏలాంటి పరిచయము లేదు.

నా కవిత యాదృచ్ఛికంగా ప్రారంభమైనది. మా ప్రక్క ఊరిలో ఒక గ్రంథాలయము ఉండినది. ఆ ఊరిలో అపుస్తకములను కడవరకు చదివిన మొదటి

వాడను, కడవాడను నేనే. ప్రతిదినము సాయంకాలము నాలుగు గంటలకు ఆడుకు చేరేవాడను. ఒకనాడు ఆ ఊరికి ఒక శతావధాని వచ్చి లయిబ్రరీలో కూర్చుండి మాటలాడుచుండెను. 'కవిత్వము పూర్వజన్మ సంస్కారమువలన లభించుననీ, చదివితే పండితుడు కావచ్చునే కాని కవి కానేరడనీ' ఆయన చెప్పుచుండెను. నాకు ఆ కాలములో విపరీతమైన ఆత్మవిశ్వాసముండెను. 'మీరు ఒక్క కవిత్వాన్ని గురించి మాత్రమే చెప్పుచున్నారు. అన్నిటికీ అలాటి పూర్వజన్మ సంస్కారం అవసరమే గదండీ? మనిషి ప్రయత్నించినట్లయితే చేయలేని దొకటుంటుందా' అని నే నన్నాను. 'ప్రయత్నించి తక్కిన కళలు నేర్చుకోవచ్చు, కాని ప్రయత్నించి ఛందస్సు నేర్చుకొని పద్యం వ్రాసినా రసం ఉండదని' ఆయన చెప్పినారు. శ్లోకాలు పద్యాలు ప్రమాణాలుగా చూపించినారు. నా వాదం మాత్రం మానలేదు [illegible]. కడకు ఆయన విసుగెత్తి 'అట్లయితే నీవు వ్రాయరాదటోయ్'! అని అన్నాడు.

చిన్నప్పుడు వీధిబళ్లో చదివిన గజేంద్రమోక్షము రుక్మిణీకళ్యాణము పద్యములను మనస్సులో వల్లించుకొంటూ నాయి దేవునకు మొక్కుకుంటూ కాలహరణం చేయడానికిగా లేచి కాగితం వెదకుతున్నట్లు నటిస్తూ అటువంటి పద్యాలు [illegible] లోలోపల వల్లించుకొంటూ ఉండినాను. ఒకాయన విజిటర్సు రిజిస్టరులో కాగితం చింపి నాముందు పెట్టినాడు. అది తీసికొని 'వందేము శాస్త్రి ధీమణికి వందేము కావ్యకళా విభూతికిన్' అని వ్రాసినాను. ఇది ఒక నమస్కార బాణంగా పనిచేయవచ్చునని అనుకొన్నాను. తర్వాత బండి సాగలేదు. ఏదో ఒక దబాయింపు దబాయించి తప్పించుకొన చూచినాను. 'కవిత్వం అంటే యింతే గదండీ' అని కాగితం ఆయన కిచ్చినాను. నా వాయ నిదానించి చూచి, 'నీవు కవిత్వం వ్రాస్తే నీకు వస్తుందోయ్' అని అన్నాడు. నా అదృష్టం కట్టి వచ్చింది. ఆ పాదానికి అర్థమేమనిగాని తక్కిన మూడు పాదాలు ఏవని గాని ఆయన అడగలేదు.

పరువు దక్కింది. మొదటంభొట్లు జోస్యం ఫలించింది. ఈ కవిత్వము కాకతాళీయన్యాయంగా వచ్చింది. కాబట్టి ఎప్పుడైనా అంతు చెప్పకుండా మాయమవుతుందనే సందేహం నాకు మొదటినుంచీ ఉన్నది. కావుననే ఒకప్పుడు నేనిట్లు తలపోసినాను.

'కడపటి వీడుకోలె మన
కౌగిలి యొత్తుల ముద్దులాటకుం
గడపటి వీడుకో లగుట
గాదుగదా, అది యేమొ నీవు నన్
విడిచిపెట్టున్న సంశయము,
నేమము లేని తపించు యందుకే
ల్పుడైన తంత్రియట్లు వికలంబుగ బల్కు నపస్వరంబులన్.'

ఫలాని కావ్యం వ్రాస్తాము గాని ఫలాని కథ అని గాని ముందుగా అనుకొని నే నెప్పుడూ వ్రాయలేదు. మొదటి పద్యం వచ్చిన తర్వాత రెండు మూడు పద్యములు వెంబడి వెంబడి వచ్చినట్లయితే ఏదో ఒక కావ్యం వ్రాయబోతున్నానని నాలో నాకు తట్టును. ఒకప్పుడు చాలా కాలం, కవిత్వం నాలో అదృశ్యమైనప్పుడు, నేను ఇట్లు భావించితిని —

'జలదపథంబునం దిరుగు,
చక్కని ముక్కవె యయ్యు నాపయిం
గల ప్రణయంబునం జనిడి
గద్దియ డిగ్గి పోలాన బచ్చికం
చెలకపు గూడుచుంటివి క్రొ
వ్వీపల బాలికయట్లు, గడ్డి పూ
దలిగిల కాన్కతో ప్రథమ
దర్శన మత్సవముచెయ్యం దొయ్యలీ.'

కవిత తాళిగట్టిన భార్య కాదుగావున నా అదుపు కదుపులకు లొంగి ఉండదు.

## శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి

నా మొదటి రచన ఏదంటారా? ఏలాగండీ చెప్పడమూ? జ్ఞాపకం చేసుకుంటూ వెనక్కి జరిగినకొద్దీ, ఇంకా జరగవలసిన అవసరం రావడమూ, ఆ తరువాత ఎన్నెన్నో పద్యాలు నేనంటే నేనని ముందుకు తోసుకువచ్చి, అన్నీ కలిసిపోవడమున్నూను. నాకు జ్ఞానం వచ్చినప్పటి నుంచీ, కావ్యనిక్వాణమూ వాటితో కలిసి తారకనామమూ రాత్రీ పగలూ ఇంట్లో వింటూనే ఉన్నానాయెను. అలాగ విన్న ఆ చెవీ ఆ మనస్సూ ఎన్నితరాల ప్రతిభాపథాల్లో ప్రయాణం చేసి వచ్చాయో!

తండ్రిగారు, బాబయ్యగారు, తాతగారు, వేంకటకృష్ణశాస్త్రిగారు, అలాగ సాగిసాగి నాలుగువందల ఏండ్ల క్రితపు మా రామశాస్త్రిగారి కావ్యాలూ, వారిద్వారా నన్నయాదులవీ, అన్నీ నావే అన్నంతలాగ నాలో కలిసిపోయాయి, నమ్మండి.

'కడలియింటికి ధునీకన్యలకై సేసితొలిసారిఅంపించు కులగురుండు' అని గ్రీష్మావసానాన్ని వర్ణించిన బాబయ్యపద్యము, "హిమాచల కుమారికాకుచ సముల్లసత్కుంకుమాసమాన హిమవాలుకా ఘుమఘుమాయి తోరస్థలుడైన" పరమశివుణ్ణి కీర్తించిన నాన్నగారిపద్యమూ నావే అనిపిస్తాయి. అమ్మగారు కలక్టరవాలిరా అనేవారు. తండ్రులు కవివవాలిరా నాన్నా అనేవారు. ఏదీ కాలేకపోయానేమో.

మా చంద్రంపాలెం పిఠాపురానికి మూడుమైళ్ళు. అక్కణ్ణుంచి రోజూ నడిచి ఇక్కడికి వచ్చేవాళ్ళం వాళ్ళూ నేనూ. ఒకనాడు చంద్రంపాలెంనుంచి వస్తున్నాం. దూరాన్నుంచి కుక్కుటేశ్వరస్వామి ఆలయశిఖరం కనపడుతుంది. ఇటు కుంతీమాధవస్వామి 'దివ్యమందిర విమాన దేదీప్యమాన విపుల ధామధామ సుదర్శన దర్శనము' అవుతుంది. వారిద్దరూ ఏవో మాట్లాడుతూ, నాన్నా ఇవాళ పద్యం చెప్పాలయ్యా, ఒక చిన్న పద్యం, మాధవస్వామి మీద అన్నారు. గణాలూ అవీ అంతగా తెలియకపోయినా, లోపలిచెవి ఏదో అంటూంటే అది ఆసరాగా రెండు పాదాలన్నాను, తేటగీతి.

> నందనందన, ఇందిరానాథ, వరద
> పాదయామతి ప్రోవుమీ వాసుదేవ.

వారికి బ్రహ్మానందమయింది. కాని ఇది పద్యం పూర్తి కాదుకదమా!

ఆ రోజుల్లోనే ఒకసారి రామతీర్థాలు వెళ్ళాం. విజయనగరం దగ్గిర ఒక పుణ్యక్షేత్రము, ఒక పెద్ద కొండ ఒడిలోకి ఒరిగిపోతూ, చాలా అందంగా ఉంటుంది ఆ ఊరు. ఉదయమే దేవాలయాలు చూస్తూ, స్వామిదర్శనం చెయ్యడం అయ్యాక కొండెక్కాము. ఎంతచూసినా మరీ ఎక్కి పోతూంది. అప్పుడు తవ్వుతున్న బౌద్ధ విహారాలూ, ఆచీన యాత్రికుడు బసచేసుకున్న స్థలమూ అన్నీ చూస్తూ తిరుగుతున్నాము. మా బావ ఒకతను ఉండేవాడు, పాపం, పద్యాలు ఎన్నో కావ్యాల్లోనివో హాయిగా చదివేవాడు. నడుస్తూ నావైపు తిరిగి, 'ఏమి [illegible] కవితము' అంటూ, ఉడికించడం ప్రారంభించాడు. "ఏమోయి, దేవులపల్లీ" అనడమూ, ఆ పద్యం చదవడమూను.

> "చెలువగు సింగిపుంబలిమి
> సింగపుపిల్లకు కొంచెమేనియున్
> కలుగక యున్నె కృష్ణకవి
> గాదిలిపుత్రుడవై కవిత్వపుం
> బలిమి నెఱుంగలేవటర
> పైత్యపుమాటలవేల వ్రేలెదో
> పలుకక నోరు మూసుకొని
> ప్రక్కకు తొలంగుము బుద్ధిహీనుడా."

అనే పద్యం తంటాలుపడి వ్రాసి, మాంచి జోరుగా చదివాను. నాన్నగారి ఆనందానికి మేరలేదు. ఆ బావకూడా చాలా సంతోషించాడు.

> 'పులిపిల్లకొక్క చారయు
> కలుగక పోనటర లింగకవి పుత్రుడవై

వెలయ కవిత్వపు మార్గము
తెలియగ లేనటుగ తిరుపతికీ తినాథా.'

అన్న పద్యం అప్పుడే నాలో, లోలోపల ఉండవచ్చు. రెండు పట్టపుటేనుగుల్లాగా వారిద్దరూ నడుస్తూంటే, నేనూ మధ్య ఉండి' తరువాత పిఠాపురంలో కోట్లోకి వెళ్ళి మహారాజుకి వినిపించడం జరిగింది.

ఇది మొదటి పద్యమా? మనోదృష్టితో చూస్తే కాదు. తరవాత ఇంగ్లీషు చదువులూ, ఆంగ్ల కావ్య పఠనమూ, పత్రికలలో వేంకట పార్వతీశ్వర కవులవీ, రాయప్రోలు అన్నగారివీ పద్యాల పరిచయమూ, గురుదేవుల Crescent Moon, Gardener చదవడమూ లోపలలోపల ఒక మెరుపు కిరణ మాయనుపడమూ, ఏదో మించుపచ్చి మిలమిలమనడమూ, జరిగాయి. నేనూ ముదరడం జరిగింది. చిన్నప్పటంత అమాయకంగా లేను బ్రతుకింక. కొన్ని అనుభవాలు, కొన్ని రక్తాలు, కొన్ని చీకట్లు, కొన్ని వెలుగులు.

౧౯౨౧. నాకు పెద్దజబ్బు ప్రారంభం. ఇంకా మంచం పట్టలేదు. ఊళ్ళు తిరగడం ప్రారంభించాను. బెజవాడనుంచి బళ్లారి ప్రయాణం. ఆ ట్రయిన్ని ఎరుగుదురు కాదూ, పరిగెత్తుతోన్నప్పుడు ఏదో ఒకటే నడకచప్పుడు. అది మనస్సులో చొచ్చుకు పోయిందనుకుంటాను. దిగువమెట్టు – చలము, ఆ నడుమ నల్లమలలు వచ్చాయి. 'దేవుపల్లె లోన ఏదో తిరగడం' మొదలెట్టింది. దానితో ఆ ట్రయిను నడక అలాగ ధ్వనిస్తుంది.

'ఆకులో ఆకునై'

అన్న రచన తయారు. మరికొద్ది రోజు లయాక మా నంబూరి సుబ్బారావూ నేనూ చాలా నాళ్లకి కలుసుకున్నాం. హోరు గాలీ, వర్షం. సామర్లకోట స్టేషను ప్లాటుఫారం. సుబ్బారావు "ద్వారకానాసా వింటావా"అని, "గుండె గొంతుకలోన కొట్లాడుతుంది"అని పాడడం మొదలుపెట్టాడు. అతగాడు ముగించాక "సుబ్బారావూ విను"మని "ఆకులో ఆకునై" వినిపించాను. తరువాత ఇద్దరమూ ఆ వర్షంలో అంటిపెట్టుకుని కూర్చున్న రెండు కాకుల్లాగా నిశ్శబ్దంగా కాస్సేపు కూర్చున్నాం. ఈ పాట నాకు దేశంలో ఎందరు కవులతోనో తరవాత పరిచయం చేసింది. దీన్నే తొలిరచన అనాలా?

## శ్రీ మల్లవరపు విశ్వేశ్వర్రావు

అది సంవత్సరాదిరోజు. పదమూడో యేడో యేమో నాకు. పొద్దున్నే వేపపువ్వూ బెల్లం కలిపిన పులుసు ఏదో ఉత్సాహం రేపింది నాలో ఎక్కడో లోపల. సూర్యకాంతి వసుంధరకి ధవళాంబరమై ఆవరించింది. అప్పుడు మొదటిసారి నాలో ఛందస్సు పొంగి పైకి ప్రసరించింది. బహుశః గీతం కాబోలు, ముప్పై నలభై పంక్తులు వ్రాసి ఆ కాగితం ముందరి గుమ్మానికి తోరణంతో పాటు వ్రేలాడదీశాను. అది మామిడాకులతో ఎండి రాలిపోయి వుంటుంది. ఇప్పుడు దొరకదు. విస్మృతగీతం. నేనది దాచుకోలేకపోయాను.

ఆ గీతం ప్రభావంవల్లనే నేను శాంతినికేతనాశ్రమం వెళ్లి గురుదేవదర్శనం పొందాను.

పైని చెప్పింది నా తొలిరచన కాదు. నా తొలి భావోద్గమం అందాం. శాంతినికేతనాశ్రమం వెలుపల విశాలమైన శాద్వలస్థలం. పార్శ్వాన్ని పరుచుకున్న పచ్చని పైరు తివాసీలు దిగంత విశ్రాంతంగా తూర్పుదిశని మారుమూరాలలో తాళవృక్ష శీర్షాలు అంతరాళాన్ని అంటుతూ. ఆ అస్పష్ట వృక్షకాండల నడిమిని ఓ పెద్ద కాంతిపుంజం. అది ఆనాటి సూర్యోదయం. ఆశ్రమజీవినైనాక, ఆనాడే తొలిసారి మహా సూర్యోదయం నేను దర్శించాను. ఆ చల్లని సంధ్యాతేజం విశాల జగత్తుని తన ఆలింగనంలో ఇముడ్చుకున్న ఆ క్షణాన్ని వాయుకుమారుడు పజ్జనున్న వంశీవనంలో విహరిస్తూ ఊరికే ఊదిన మురళీధ్వని నాలో పారవశ్యం కల్పించివుండాలి...

పద్యాలు తొల్త తొల్త వ్రాసినట్లు బాగా జ్ఞాపకం ఉన్నది. కాని ఆ పద్యాలేవీ నా స్మృతిలో లేవు. ముప్పది రెండేండ్లు పొంగు క్రుంగులతో ప్రవహించిన కాలకుల్యాలలో వానిని వెదకడం సాధ్యం కాదు. ఏ సుడిగుండంలోనో పడి ఉంటవి. లేక ఏ ఒడ్డో ఎక్కి ఉంటవి.

అయితే నా అంతఃకరణ తంత్రులను శ్రుతిచేసిన ఛాయా సంధ్య మాత్రం గుర్తున్నది. అది నివేదిస్తాను. వండి, అన్నం ఆరకుండా పాలూ మీగడా కలిపి తినిపించి నన్ను పెంచింది మా పిన్ని. నేను భాగవి నముపుకుండే రోజులు అవి. నా చదువు నానాకాలపు వ్యవసాయంలాగా ఉండేది. కాని ప్రతి దినమూ, ఏ రామాయణమో ఏ పురాణమో చదివి ఆమెకు వినిపించే వాడుక ఉండేది.

ఒకనాడు అనసూయా చరిత్ర చదివి ముగించితిని. అది అంతా శాంతంగా విన్నది. చిట్టచివరకు 'నాన్నా, మాచావురా? త్రిమూర్తులు కూడా ఏలా తల్లి కంటితో చూస్తే చంటి పిల్లలైనారో? ఈలాటి భావం మన కథాకల్పాలలో ఇంకా అధికంగా ఉంటే ప్రేమ భావం తొణికేదా? ఏ గ్రంథంలో విన్నా ఆడవాళ్ళను గురించి ఏమేమో వ్రాస్తారు. మగవాళ్లు' అని అన్నది. కథ కంచికి పోయింది. ఆ పలుకూ, ఆ స్వరమూ, ఆ శ్రుతికూడా నాలో ఏ పచ్చని పచ్చిక మీదనో శయనించి నిదురపోయినవి. కాని అనంతరం ముక్తకంఠమైన నా రాగానికంతా అదే అమృత బీజమని విధేయవిజ్ఞాపన. అది మొదలు కొనీ, 'క్షీరసాగరశయనా' అనే గీతం వినబడితే ప్రేమరూపిణియైన తల్లి, ఆమె వక్షఃస్థలం మీద స్తన్యపానం చేసే శిశువూ, నా హృదయాంబరం మీద దర్శనమయ్యేవారు. నా జ్ఞయ ప్రపంచంలో మాధుర్యమయమైన ప్రకృతీ, మధుర కళారాధనం చేసే కవీ సాక్షాత్కరించేవారు.

'పచ్చి కస్తూరి గంధ కుంభములు దింపి
క్షీరభాండము లెత్తితి చిన్నవాడ' అనే పద్యంలో ఇమిడిఉన్న నా భావం ఇదే.

చైతన్యమయమైన సృష్టిలో మానవుడు భాషా సౌభాగ్యంచేత విలక్షణసంపన్నుడైనాడు. యుగ యుగాంతరాలుగా మానవప్రాప్యమేమిటి అని అన్వేషణ జరిగింది. అది అనంతంగా తుదకు వ్యపదేశమయింది. ఈ అనందాన్ని అందుకోవడానికి అనేక సాధనలు జరిగినవి. పలుమార్గములు వెలసినవి. అందులో సాహిత్యోపాసన ఒకటి. అయితే దీన్ని నేను కవిగోష్ఠి మాత్రంగా గౌరవిస్తున్నాను. అంతేకాదు. ఇంత ప్రసన్నమూ ఇంత పరిఫుల్లమూ అయిన లలితసాధన మరొకటి నాకు కానరాలేదు. అందుకే ఇది లలితకళలలో ప్రధాన పీఠం ఎక్కగలిగింది. యజ్ఞకర్మలచేతా, బ్రహ్మజ్ఞానచేతా, ధర్మశాస్త్రానుశాసనంచేతా, రాజనీతిశిక్షాదికంచేతా, మరెన్నో వివిధోపాయాలచేతా, అనంత ప్రాప్య మార్గాలను వెదికీ, చూపి, నిలుపబెట్టడానికి ప్రయత్నించాను. అయితే లలితమైన కళాసాధనాలలో ఒక వైశిష్ట్యమున్నది. అదేమిటంటే అంతఃకరణసౌందర్యాన్ని మాత్రమే గుర్తించి, మాధుర్యాన్ని మాత్రమే ఆస్వాదించి, తన్మూలంగా లీలాతాండవమైన ఆనందంలో లీనమైపోవటం అభ్యాసము చేసుకుంటుంది. ఇదే సాహిత్య సాధనా ఫలితం. హితమంటే మనోవాక్కాయకర్మలకు ప్రియమైన సర్వసంపత్తూ స్ఫురిస్తుంది. అంతేకాక అహితమైన వికారమూ, వికటమూ, వికలమూ అయినది అనావృతి మనికూడా ధ్వనిస్తుంది. ప్రియమైన రూప కల్పనా, మధురమైన శబ్దానువృత్తీ, మనోహరమైన భావబంధమూ కావ్యానికి కళాకాంతులని విన్నవిస్తున్నాను.

ఎవరులేని గవాక్షసంవృతిలోన
నను బిలిచి బంధమేసె సుందరి యొకర్తు
త్రెంచరే నెట్టులో సహియించువాడ
సన్నగిల్లహాస్తమునుండి జారువాక.

## శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

చిన్నప్పుడు సుమారు ౧౩వ ఏట అనుకుంటా— భీమునిపట్నంలో నరసింహస్వామి దేవాలయం మెట్లమీద కూర్చుని ఎదుట విశాలనీలసముద్రాన్ని చూస్తుంటే సీసపద్యాలు ఏందలుగా రాయాలని ఉండేది. అప్పటికి తెనుగు పద్యలక్షణం ఏమీ తెలియదు. అక్కడి నరసింహదేవునిమీద రాయాలని సంకల్పం. వచ్చిన ఒక సీసపద్యాన్ని బట్టి మాటలు మార్చుతూ రెండుగోజుల కో సీసం కట్టాను.

పద్యం రాసి కొండెక్కడం సాంప్రదాయమైతే కొండెక్కి పద్యం రాయడంతో ప్రారంభమయింది నా విలక్షణ పద్యచరిత్ర.

కానైతే అప్పటికి చదువుతూన్నది కుమారసంభవం. చరచర తెనుగు మాటలూ ఛందోజ్ఞానం ఎట్లా వస్తాయి? రహస్యంగా తెనుగుపద్య లక్షణం నేర్చుకుని పట్టి ఎగుడు దిగుడు దేవుడితో మన రెండుకని నరసింహస్తుతి—సరస్వతీ నతిగాను, సీసాన్ని ఉత్పలంగానూ మార్చాను. అందులో జ్ఞాపకం ఉన్న చిన్న ముక్క ఇది. 'మాతరో నిన్ను నాదు మన మందున నిల్పి భజింతునమ్మ నే, ఖ్యాతిదలిర్ప'— అంతా జ్ఞాపకంలేదుగాని ఆదిపద్యం మాత్రం ఇదే. విద్యారంభం కరిష్యామి అన్నదంతా సంస్కృతంలో జరుగుతూన్నందువల్ల అప్పటి మా గురువులకు గిరీశం పంతులుగారు చెప్పినట్లు — తెనుగు పద్యాలమీద ఖాతిరీ లేదు. కనక కవిత్వం వ్రాయడమంటే కానిపని చేసినట్లు బెదురుతూ గిలకవలసి వచ్చేది. ఆ ఇరుకు కాలంలోనే ఏదో సందు చూసుకు జానకీపతిశతకమంటూ ఒకటి రామాయణం కథ వచ్చేలా రాదామని సంకల్పించి, ౨౦ పద్యాలు రాసి, గురువుగారికి పట్టుబడి చివాట్లు తిని సంస్కృతం చదివినవాళ్లు తెనుగుపద్యం రాస్తే ఒట్టు అనుకున్నాను. కాని పట్టు అట్టే నిలవలా, 'రాధా సందేశం' అని ప్రభావతీ ప్రద్యుమ్నం చదివిన వేడిమీద ౨ పద్యాలు రాసి ౧౯౨౬ సంవత్సరంలో భారతికి పంపాను. తరవాత ఏం జరిగిందనిమాత్రం అడక్కండి.

ఇది ఒక ఘట్టం.

కాలేజీలో చేరిన మొదటి రోజుల్లో శుద్ధమునిపల్లె లాంటి వూరినుంచి వెళ్లిన ప్రాణి కళ, ప్రకృతిప్రకృతికం, ప్రత్యయాలతో ఉక్కిరిబిక్కిరయింది. క్రమంగా నాటి పరిభాష అలవడుతున్న కొద్దీ ప్రాచీన కావ్య భక్కికిలో అనర్గళమైన కవిత్వం చెప్పాలని మహా కాంక్షగా వుండేది. పెద్దపెద్ద సమాసాలతో రాజాధిరాజనంకనాలు, ఇంకా ఏవో పద్యమాలలు రాసినట్లు జ్ఞాపకం ఉంది. సంస్కృతంలో కూడా ౫, ౬ పద్యాలు అప్పుడే రాశాను. దుర్మలా మళ్లా ఎప్పుడూ అల్లాంటి మహాపరాధం చెయ్యను. శ్రీజగన్నాథ పండితరాయలతోటే అఖరున మెరిసిపోయింది సజీవమైన సంస్కృతకవిత్వం.

భావకవిత్వం అంటే ఏమిటండీ అని అడిగిన ప్రశ్నకు మా మాస్టరుగారు ఏ కాంతసేవా, ఏ కాంతసేవ సరికా చదువుతున్నారు. చదివి చూసినకొద్దీ మనస్సు ఏదో పొగపిడిచి బయట పడుతూన్నట్టు కనపడ్డది. ఇంతవరకూ రాసిన పద్యరాశి మాటలసాము అనీ, ఈ కొత్త దేదో మనస్సును సంబంధించినదనీ వెంటనే తట్టింది. అక్కడినుంచీ నడకలో టెక్నిక్ మార్చాలనీ గాఢవాంఛ కలగడం మొదలైంది, 'ఒక నాటిగీతి' అని వ్రాసి భారతికి పంపాను. అచ్చయింది. దాని మొదటి పాదం ఇది- 'ఎన్ని యుగాల నుండో నా హృదయసుమము'. ఆంధ్ర ప్రశస్తి లాంటి పద్యాలు కొన్ని రాశాను. అప్పుడే స్మృతి కణాలని, అట్లా ఒక ఎగలో ముందువాళ్ళ ప్రభావం తెలుసుకోలేక 'ప్రేయసీ గీతాలేమిటి,' 'విరహ గీతాలేమిటి' పరంపరంగా వ్రాయడమైతే జరిగింది గాని చాలాభాగం ప్రకటించలేదు.

తెనుగునుడి నూటిగా పలకాలంటే ఈ వృత్తాలు ఉపకరించవేమో అని తోచడం మొదలెట్టింది. దీనికి పాల్కురికి సోమన్న బసవపురాణం ప్రోద్బలం

హెచ్చయింది. 'ఉరుతర పద్య గద్యోక్తులకంటె సరసమై పరగిన జాను తెనుంగు' వ్రాయవలెననే కుతుకం హెచ్చింది. పిమ్మట క్రమంగా తెనుగు వీణపాటలు వ్రాశాను. ఇప్పుడు కవిత్వంగా ఏది వ్రాయాలని కుతూహలం కలిగినా ముందు పద్యం కంటె పాట వస్తుంది. తెనుగు వీణ ఇట్లా ప్రారంభమయింది.

ఏ పువ్వు పూసినా
ఏ పాట పాడినా
ఎందుకో ఈ హృదయ
మింత కళవళపడును.



జ్ఞాపకాలనుండి తుడుచుకుపోయిన సంగతులను జ్ఞాపకం తెచ్చుకోవాలని చేసే ప్రయత్నం నామీద విధించుకుంటూ నా ప్రథమ రచన ఏదై ఉంటుందా అని ఆలోచిస్తూ ఉన్నాను. మొట్టమొదటిసారి కలం కాగితంమీద ఉంచి ఏదో వ్రాయడమే ప్రథమ రచన కాదని నా ఉద్దేశం. దానికి వెనక ఇంకా ఏదో ఉంది. ఆ కవిత్వం అనండి, రసం అనండి, ఏదో ఉత్సాహం అనండి—అదేదో అకస్మికంగా నాలో ఒకమారు ఉప్పొంగింది. అంతవరకు నే నెరుగనిదేదో నాలో నేను తడుముకున్నానని ఇప్పుడు నాకు పొడగట్టుతున్నది. మహాసముద్రంలో హిమపర్వతం వలె మన స్పష్ట చైతన్యం మూడింట రెండు వంతులు మట్టం కింద ఉంటుం దని మనస్తత్వవేత్తలు అంటారు. ఇందులో దాగిఉన్న అహంత నానావిధలక్షణాలు ప్రదర్శిస్తుంది. స్వప్నసీమలలోనే దీని విహారం. స్వప్నజీవితాన్ని చులకన చెయ్యడం క్షమించరానిది. అలాగయితే మానవుని జీవిత ప్రమాణంలో మూడవ భాగం నిద్రలోనే ఎందుకు గడిచిపోవాలి! నిద్రావస్థలో మనం ఎంతో అసహ్యించుకొనే స్వప్న ప్రపంచంలో ఎందుకు నిద్రాకాలం గడవాలి! అందులో అందరూ తమ బ్రతుకులో కొంత భాగం గడపక తప్పదు. కవులు అక్కడ సంచరించి సాహసించి సత్యాలను పైకి తెస్తారు. నిజమైన ప్రతిగీతం నిత్యనూతనం కావడానికి ఇదే కారణం. మొట్టమొదటిసారి నాకు పద్యం వ్రాయాలని బుద్ధి పుట్టినప్పుడు ఏదో కొత్తది కనిపెట్టినట్లే నేను భావించాను. నేను వెదకుతున్న గులేబకావలి నాకు దొరికిం దనుకున్నాను. అతఃపూర్వ సాహిత్యానికి అది అనుకరణం కాదు. తర్వాత తర్వాత సాహిత్య దృష్టి హెచ్చి, నాలాగే ప్రమాదప్రయోగాలు చేసి అనుభవాలు సంపాదించి విశేషంగా కనుక్కొని మజాగా చెప్పిన వారి హృదయం ప్రాచ్యులదీ, నవ్యులదీ కలిగినపిమ్మట వాటికి నిగనిత చేసవగా అనుకరణ చేస్తూ పోవాలని బుద్ధి పుట్టింది.

కావ్యరచనలో స్వాతంత్ర్యం, అనుకరణ ఈ రెండూ పెనచుకొని ఉంటాయి. మూలస్థానంలో కవిత్వం విశుద్ధంగా ఉంటుంది. తరమిలానే అనేక సాంకర్యాలు.

శిశువు చిత్రలేఖనం ప్రారంభించినప్పుడు ఎవ్వరినీ అనుకరించడు. తర్వాత అతనికి కళలో శిక్షణ ఇవ్వవలసిన పెద్దలు అనుకరణ మప్పుతారు. ఈ కూజా, ఆ గొడుగు, ఆ ముక్కోణం, ఈ వస్తువులు, పువ్వు, నవ్వుమొగం అన్నీ ఆకారములను అనుకరించడం నేర్పుతారు. దానివల్ల చిత్రకారునికి చెయ్యి తిరుగుతుంది, కాని హస్తాన్ని మస్తిష్కం పరిపాలిస్తుంది. హృదయం పరిపుష్టం చేస్తుంది.

అలాగే నేను ఏవో యతిప్రాసలు లేని పద్యాలు వ్రాస్తుండడం చూసి మా నాన్నగారు నాకు సులక్షణసారం కొనిపెట్టారు. ఛందస్సులో ప్రథమ పాఠం చెప్పారు. 'ఆదిమధ్యావసానేషు యరతా యాంతి లాఘవం, భజసా గౌరవం యాంతి, మనౌతు గురులాఘవం' అనే ఫార్ములా ఆయన ముఖతా నేర్చుకున్నాను. అప్పటికి నా వయస్సు ఏడెనిమిది సంవత్సరాలకు మించి ఉండదు.

ఆ సూత్రాలనుండి ఎన్ని పద్యాలు వ్రాశానో చెప్పను. అన్నీ తప్పులే. కాని ఒకసారి చేసిన తప్పు మళ్లీ

చెయ్యలేను. అందరూ నా తప్పులు దిద్దేవారే. కొన్ని తప్పులు నాకు తప్పుగా తోచలేదు. అవి చెయ్యడానికి నాకేదో హక్కు ఉందనిపించింది. అందువల్ల నా వ్యక్తి చైతన్యం ప్రగాఢతరం అవుతున్నట్లు, నా రక్తం పరిశుద్ధమవుతున్నట్లు నాబలం హెచ్చినట్లు స్పష్టంగా తోచింది.

ఇప్పుడిప్పుడు నా వ్యక్తిచైతన్యం సంఘచైతన్యంగా మారుతోంది.

## శ్రీ నోరి నరసింహశాస్త్రి

నేను మొదటి అడుగు ఎప్పుడు వేసినానో మొదటి మాట ఏమని అన్నానో ఎట్లాగైతే జ్ఞాపకంలేదో అట్లాగే నేను మొదటి పద్యము ఎప్పుడు వ్రాసినానో ఆ పద్యమేమిటోకూడా జ్ఞాపకంలేదు. చిన్నతనంనుంచీ పద్యాలు చెప్పినవాణ్ణి అయితే ప్రథమ పద్యము, ప్రథమ రచన కాదు. నా రచనలలో యెప్పటికప్పుడు వర్తమానకాలమునూ భవిష్యత్తునూ గూర్చి మాత్రమే ఆలోచించే స్వభావము నాది. రచన పూర్తియైనతర్వాత దానితో నాకు సంబంధము నెమ్మదిగా వదులుకుంటాను. అందులో 'కు జ్ఞాపకశక్తి తక్కువ. అందువల్ల నా ప్రథమ రచన జ్ఞాపకం చేసుకోవడము కష్టమైనది. జ్ఞప్తికి తగిలినంతవరకూ ఆలోచించి మనవి చేస్తున్నాను.

అప్పుడు నాకు పదహారేళ్లు. మా స్వగ్రామము గుంటూరు. అప్పటికి కొద్ది కాలము క్రిందటనే అక్కడ కవుల తగాదాలు పుట్టి దేశమంతా విజృంభించి విస్తరించి ఉపశమించినవి. దూరాన యూరపులో మహాసంగ్రామము జరుగుతున్నది. కాని దాని ఘోష వినపడీ వినపడకుండానే ఉన్నది. తెలుగు భూమిలో కొత్తకాంతి వెలుగుతున్నది. ఐతే అది నా దేహములోని నూతన యౌవనమువలెనే అవ్యక్తమధురముగా ఉన్నదేగాని సుబోధము కాలేదు. హృదయములో ఆనందజ్యోతి వెలుగుతున్నది. కాని బాధచిమ్ము లేదు.

సంవత్సరాది వచ్చినది. అది పింగళ సంవత్సరాది కావచ్చును. అనాదిగా కవులకు స్వస్వరూపము చూపుతూ నిత్యయౌవనుడైన వసంతుడు నాకూ దర్శన మిచ్చినాడు. నా హృదయములో కవి ప్రకృతి రూపము ధరించినది. ఆనందము కలిగినది. ఆనందానుభూతి మనకు ఆప్తులైనవారితో పంచుకోనిది సంపన్నము కాదు. అప్పుడు నాకు ఏకైక మిత్రుడు, ఇప్పుడు కీర్తిశేషుడు ఐన చామర్తి రాజశేఖరకవి, అతనిని ఉద్దేశించి అన్నాను.

నెచ్చెలీ ఒక్కసారి కన్విచ్చి కనుము
అధిక సంతోషమున నూత్నహాయనంపు
జీవయాత్రను గడపగా సిద్ధమైన
ఎట్టి శుభసూచనంబు నా ఎదుటబడెనో.
ప్రకృతి కాంత వసంత దర్శనము కలుగ
ప్రియుని సంప్రీతితో నాదరించుకొరకు
చిగురు చీరె ధరించి విచ్చేసె వెనుక
తరలిపోయిన పూర్వవత్సరముతోనె
సౌఖ్యహీనత ఏమున్న సాగనంపు
అభినవాబ్దము క్షీణించి యరుగుకొలది
శుక్ల శశికళలను మీరు శోభజెందు.

ఈ ఖండకావ్యము నా ప్రథమరచనగా భావిస్తున్నాను. గీతమాలిక – నా మొదటి ఖండకావ్య సంపుటిలో మొదటి కావ్యమిదే. ఆనాడు నాకు అధికముగా దర్శన మిచ్చిన ప్రకృతియే మరల అనేక మార్లు అనేకరూపములతో ప్రత్యక్షమైనది. ఆమెను మరచినప్పుడల్లా నాకు బాధ కలిగింది. ఆమె స్మృతిలోకి వచ్చినప్పుడల్లా మనశ్శాంతి కలుగుతున్నది. ఆమెను నేను మరచినప్పుడుగాని గుర్తులో ఉంచుకున్నప్పుడుగాని నాచేత పలికించినది ఆ తల్లియే అని నా విశ్వాసము. ప్రస్తుతము ఆమె జగదంబా స్వరూపముతో నిత్యమూ నా ఆత్మలో వెలుగుతూ నాచేత 'తా మగ్నివర్ణాం తపసా జ్వలంతీం' ఇత్యాదికంగా ధ్యానము చేయించుకుంటూ ఉన్నది. ఆమె నవ్వు నా హృదయములో ప్రతిధ్వనించినప్పుడే కాని ఇప్పుడు కావ్యము చెప్పలేను. ఆ జగదంబ నామస్మరణతోనే జీవితము వెళ్లబుచ్చుతూ ఉండవలెనని నా ఆశయము.

# శ్రీ టి. శివ శంకర శాస్త్రి

ఎందుచేతనో కొన్ని విషయాలు స్వల్పము లయినా జ్ఞాపకము ఉంటవి. ముఖ్యమైనవి కూడా కొన్ని స్మరణకు రావు. దీని యాథార్థ్యము మనస్తత్వ వేత్తలే పరిశీలించి పరిష్కరించ గలుగుతారు. పంచాశద్వర్ష ప్రాయములో ఉన్న నాకు చిన్ననాటి సంగతులు స్మృతి పథములో పడినవి కొన్ని కొన్ని గోచరిస్తున్నవి. సత్యానికీ, స్వహృదయరంజనానికీ సమ్మేళనము ఎంత ఉంటుందో ఇది మిశ్రమని ఇప్పుడు నిర్ణయించడము నిపుణతతో కూడిన పని. 'ప్రథమరచన' అన్నప్పుడు సహజంగా సాక్షాత్కరించిన పద్యమా! ప్రయత్నపూర్వకముగా ప్రతిష్ఠించిన పద్యసముచ్చయమా! అని విచికిత్స కలుగుతున్నది. సామాన్యంకోసం పక్షద్వయమును నిరూపిస్తాను.

దేవభాషా కవిని అయ్యేనాడను దేశభాషా కవిని చిత్రంగా అయినాను. షష్ఠ్యగ్ని హోత్రులై, తపస్సంపన్నులై, తరతరాలుగా తురీయాశ్రమము స్వీకరించి, బ్రహ్మీభూతు లయిన తెల్లాప్రగ్గడలవారి వంశములో సుకృత విశేషముచేత జన్మించిన నాకు సంస్కృత భాషాభిమానము సహజమైనది ప్రత్యేకవిశేషముగా పరిగణించ నక్కరలేదు. బాల్యములోనే ప్రథమతః నాకు కర్ణగోచరమైనవి శ్రీకృష్ణకర్ణామృతములోని సుధామధురశ్లోకములే. పూజ్యు లగు మా నాయన గారు అమృతవాక్కుతో శ్లోకములు అంటూ నాచేత నర్తనము చేయించిన సంగతి చూచాయగా జ్ఞప్తికి వస్తున్నది.

> శైవా వయం న ఖలు తత్ర విచారణీయం
> పంచాక్షరీజపపరా నితరాం తథాపి
> చేతో మదీయ మతసీకుసుమావభాసం
> స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్

అనే వసంతతిలక తాత్పర్యము నా అంతరంగములో అతిగాఢముగా అంతర్నిఖాతమైనది. మా కుటుంబములో అనుదినమూ పురాణశ్రవణ మయ్యే పుణ్యగ్రంథము ఆంధ్రభాగవతము ఆప్యాయంగా ఆలకించేవాడిని, అర్థం కాకపోయినా. అనవరతపఠనము వల్ల నా లేతమనస్సులో పాతుకొనిపోయినది భగవద్భక్తి. సప్తమస్కంధములో, 'చించున్ హృత్కమలంబు శోణితము వర్షించున్ ధరామండలిన్' అనే పద్యము చదివినప్పుడు మక్కు పెదిరి నెత్తురు చుక్క గ్రంథభాగముమీద పడింది. నేను హృదయవాసుల్లో వాడిని కాబట్టి ఉద్రిక్తహృదయానికి ఉదాహరణంగా చెప్తున్నాను. ఉపనిషత్తులు కొంత ఉద్దీప్తిని ఇచ్చినవి. ఆంధ్రగ్రంథాలలో కాశీఖండ, భీమఖండములు, మార్కండేయ పురాణము మాత్రము మనస్సుకు తగులుతున్నవి. భావమే కాకుండా భాషమీద కూడా నాకు ప్రీతి మెండు. అలంకారప్రియుడను. ఈ లక్షణాలన్నింటితో సమ్మిశ్రితమై సరళమైన హృదయము గల నాకు అనుకోకుండా అప్రయత్నంగా, అవిదితంగా, ఆట వెలది నోట అవతరించింది!

సహజకవిని అయినా నని చకితుడ నయినాను! ఆనాడు మాలతీమాధవ నాటకం చదువుతూ ఉండగా అందులో అఘోరఘంటుడు అనే కాపాలికుడు మాలతిని చండికకు బలి ఇవ్వబోయే సమయంలో మాలతీప్రియుడైన మాధవుడు ఆకస్మికముగా వచ్చి అడ్డుపడి కాపాలికుని ఖండఖండములు చేసి ప్రియురాలిని రక్షించినఘట్టములో నానోట తెలుగుపద్యము వెలికి వచ్చింది. అప్పటికి నాకు పన్నెండో సంవత్సరము.

తరువాత రెండు సంవత్సరాలకు మా బంధువులూ, విద్వద్వరేణ్యులూ అయిన శ్రీ నోరి హనుమచ్ఛాస్త్రులవారి చరణసాన్నిధ్యములో ఛందస్సు గ్రహించగానే చెప్పిన మొదటి పద్యం తేటగీత. వారి ప్రోత్సాహమువల్ల పద్యరచన జయాళంగా సాగింది. మరి రెండు సంవత్సరములకు నే నేదో నాటకము వ్రాసి చదువుతూ ఉంటే మా నాయన గారు యాదృచ్ఛికంగా ఆకర్ణించి మావాడు కవిత్వమువల్ల జీవిస్తాడు అని పక్కన ఉన్నవారితో

అన్నారు. అప్పటినుంచీ ఆత్మవిశ్వాసం కలిగి సారస్వతప్రక్రియను సమకట్టినాను.

ఇంచుమించుగా ఇరవయ్యో సంవత్సరంలో ఖుస్రోజ్ అనే ఖండ కావ్యము చెప్పాను.

'రాజనీతిజ్ఞు డిండియా రాజరాజు
రాజపుత్రాంగనా పరిరంభ భోగి
మొగలువంశ శిరోమణి మోద మొంద
వచ్చె ఖుస్రోజనామక వాసరంబు'

ఇది ప్రథమ పద్యము. తరువాత కావ్యము కాల గర్భంలో కలసి పోయింది.

ఆనాటినుంచి పంచాక్షరీజపముచేత పవిత్రమైన అమృతవాక్కులతో ఆశీర్వదించి, 'పాశుపతాస్త్రం' చేత పరిపూతమైన పాణితో [illegible] యిచ్చిన అస్మద్గురుతాతపాదులు (శ్రీకృష్ణశాస్త్రులవారు) [illegible] చేసినే నా కవితాశక్తి విజృంభించింది అని విశ్వాసం. శివానుగ్రహం వల్ల మాతృభాషయు [illegible] నా వాక్కులకు వన్నె గౌరవము కల్గింది.

[illegible]
[illegible]
[illegible]
[illegible]



# కవి — వాణి

ఊటుకూరు సత్యనారాయణరావు

కవి:

మలయ పటీర గంధ వలమాన విధాత సమాగతానిల
మ్ములకును తంత్రులూగి, కనుమోద్పుల నిద్దుర నన్ను లేపగా
పలికెడు వీణ— ఏల పరిపాటిని రాగము మాని, మూగమై
కలతవహించె—? ఈ బ్రతుకు కాంక్షలె తా నయియుండియున్ ప్రభూ

కలకల నవ్వుచున్, దర వికస్వర మాధుకరీ సుధారసో
జ్జ్వల కల నాదగేయ పరివర్తిత ఝుళఝుళంఝుళీపదో
చ్చలిత వినూత్న నూపుర లసన్మణికాంతుల నందగించునా
యశికచ ఈ హృదంతరపుటంచులకున్ వెలియై గమించునా....!

ఏ విపినమ్ములందొ ప్రవహించెడు యేటి కరుళ్ల మబ్బు చా
పై వెలయించు వెన్నెల బయల్పడు త్రోవల బట్టి పోవు రీ
తిన్ విధియించు చున్నయది, తిన్నగ సాగుచు— కాళ్ల జాడలే
కావలె, యెందుకీ దురవగాహ మనఃస్థితి ఆమె కో ప్రభూ!

ఎన్ని జన్మలో యె_త్తి సాధించుకున్న
ఒక్క చే, ఒక్క యుడురేఖ—ఒక్క యమృత
కలశ, మొక మరున్నాట్యమేఖలరుతమ్ము
అ_ష్టదానంద జీవితానంతసీమ!

తానయి వచ్చి, లేపి — పెరదారుల నైహిక భోగ తత్పర
ధ్యానము మాపి, నాదు పరిధానము చే మెలపై చ—ఏడకో
నే నసుకోని భావ రమణీయ సుఖ స్ఫురితాచ్ఛలోక సు
శ్రీనతమైన ఆ పదము చేరువలన్ నడిపించె నో ప్రభూ !!

వా ణి :

మనమున కందరాని, అతి మానుషమై అనుభూతయోగ్యమై
తనరెడి యూహాలే పదవితానము తేనియ లోద్భు గాయనా!
అనుపమమైన, భావ జగ దంతర దివ్య మహస్సు లోతులో
యినికిన నీ మెడంద కదియే బ్రతుకైన రసజ్ఞజీవికిన్.

లొలగితినా కవీ! ఎటుల దోచెను — నీ వెనువెంటనుండి, నీ
యలఘు తపస్సుస్త్రీ కలచు నారడి నూరట పెట్టి శాంతియై
మెలగిన దెవ్వరోయి— అనిమేషమనఃస్థితి నీవు నాయికన్
పలుచనమై కృశించు నెడబాటును పాటును నేరకుంటినా ?

జారె మనస్సు—నీ పదవిజారె, సుషుప్తునిజేసి హాయిలో
తీరము జేర్చునోడ కడతెన్నుల హోరున రాగలేక చే
జారెను—యోగమం దడుగుజారెను—ఈ నిఖిల ప్రసక్తిలో
నేరవు నీ హృదంతరము నీడల నే వసియించినసంగతిన్

# పురిటి పాట

"పాప"

తడపలా ఆమె కడు పింతుందేమె
అని అనుకోని వాడు లేడు.
గుండెలు మట్టుకు చేత్తో పట్టుకు
ఎవరికి వారే నాడు
లోపలి బెదురు దాచుకున్నారు
ఆ రాత్రిక వల్లకాదు.

చీకటి చలిగా జీబురు లాగ
మెల్లిమెల్లిగా పాకింది.
చుక్కలు రాలే చప్పుడు మల్లే
నిశ్శబ్దం రాలుతోంది.
గడియారంలో చక్రం పంట్లో
కాలం చిక్కుపడింది.

గదిలో మూలుగు కదిలింది జీలుగు
బూరాలా బరువుగ.
ఎక్కడో అడుగుని లోకంలో ధ్వని
లా పొంగిందొక వగ.
అమ్మ కూర్చుంది అమ్మా యంది
"అమ్మా ! ఇప్పుడు ఎల్లాగ ?"

"కొంచెం ఓపిక తల్లీ! ఇంక"
అంటో విమిరిందమ్మ
విధిలా సాగిన రథ మొక లోతున
కదిలినట్టుగా రిమ్మ.
పొంగే నూనెవి మింగే వేవి
కునికే దీపపు శెమ్మా.

గోడల పాకిన నీడల చాటున
ఆడిం దేదో బొమ్మ!
మంచంపక్కవి ఆ మంత్రసాని
గుర్రెట్టిన పెద్దమ్మ .

అమ్మ కూర్చుంది అమ్మా యంది,
"ఎల్లాగే మరి అమ్మా!"

"ఓపిక తల్లీ! కదలకు మళ్లీ"
తెల్లవారిపోతుం దింక"
తూరుపు దాకా పాకిం దపుదే
నాలిన చంద్రుడి డింక.
ఎర్రని వేకువ చుక్కకి మెలకువ
వచ్చింది రాక రాక.

కీచురా ళ్లింకా చీకటి పంకా
కిర్రని లాగుతున్నాయి.
"అమ్మా! ఏదే తెల్లవారిందే?"
గుళ్లోనా ఆ సన్నాయి?
అమ్మపుడంది "సన్నా యేదీ?
ఎందుకు ఆ బెదు రమ్మాయి?"

చీకటిలోపల ఏవో జీవుల
మాటలు రాని జవాబు
మ్రింగిన గాలిని కక్కడం రాని
పాము లారాత్రి తబ్బిబ్బు
ఆకాశంలో నిండు బుడగలా
తాకితే పగిలే ఉబ్బు.

తూరుపు చీల్చుకు వచ్చే టందుకు
కాలం ఎర్రగా కందింది:
ఊపిరి సలపని లోపలి లోతుని
రేగిం దేదో రంధి.
చెవిలో యేరులు పారే హోరులో
అమ్మాయి, "అమ్మో" అంది.

గింగురు మంటో గాలికి కంటో
ఏదో కప్పిన పిచ్చి

ఇంకా బారెడు అడుగుని సూర్యుడు
 చిందిన నెత్తురు పచ్చి
తూర్పుని నిగనిగ మెరిసిం దొకటిగ
 అమ్మా యంది, "లచ్చీ!"

నిద్రమేలుకుని ఆ మంత్రసాని
 కళ్ళు నులుపుకు పలికింది.
రగిలిన కుంపటి నిప్పుల తంపట
 వాసన గదిలో పాకింది.
ఎరగని వేదన అల్లల్లాడిన
 అమ్మాయి "అమ్మో" అంది.

ఎర్రని ముద్ద లా తూరుపు గద్దెలో
 సూర్యుడు ఇవతల పడలేదు.
ఊపిరి ఆపుకు మెదలని తోపుకు
 అవతల తీరని గోడు.
కిలకిలనా లాగే వేదన
 అంది "ఎల్లాగిప్పుడు?"

చటుకుని తోసుకు తూరుపు కొనకు
 పండులా లేచాడు సూర్యుడు.
తలుపు తెరుచుకుని పురిటి కబురుని
 అమ్మగా రూదిం దప్పుడు.
పొరుగ మ్మంది, "ఎట్లాకంది!"
 అడుగున్న రున్నాడు పిల్లాడు!

"అమ్మది చూపూ, నాన్నది రూపూ
 బతికి బాగుండాలి కాని
నా తల్లి తాపం తొలిచూలు పాపం
 కష్టం పడితే పోనీ
రాజావి కంది నా తల్లి" కంది
 నవ్వుతో ఆ మంత్రసాని.

అమ్మాయి మాత్రం శాంతిగా నేత్రం
 మూసుకు పడుకుంది.
అలిసిన నరాల మసక ల్లోపల
 చైతన్యం ఒక బండీ

వెలిసిన తుపాను వెనక ధీమాను
 గుండెల్లోపల నిలిపింది.

మెల్లగా విచ్చిన కంటో పచ్చని
 నవ్వులు కొద్దిగా మెరిశాయి
కదల్లేని శాంతిలో పదిలంగా ఒక
 చూపటు చూసిం దమ్మాయి.
కష్టపు పర్వం గడిచిన గర్వం
 అడిగింది, "ఏదే అబ్బాయి?"

ఎర్రటి ముద్దని పక్కకి యిమ్మని
 అమ్మాయి చేతులు జాపింది.
అబ్బాయి మూసిన కన్నులు చూసిన
 ఆనందంలో అడిగింది.
ఏమే అమ్మా! వారికి రమ్మని
 రాసిన ఉత్తర మందిందా?"

పలకా పుల్లలు పట్టుకు పిల్లలు
 బళ్లో కేమో పోయారు.
నా న్నాఫీసు - అమ్మకి నిద్ర
 ఇంటోఎవరూ లేరు.
టకటక గాలిలా - ఆదుర్దాలా
 రైలు దిగి వచ్చారు వారు.

మంచం పక్కని వంగిన వారిని
 అమ్మా యేమో చూసింది.
"వచ్చారా? ...పొద్దున్న...చూడండి...నాన్న!"
 అంటో చేతిని ఇచ్చింది.
భయంతో వారు ముట్టుకున్నారు.
 అమ్మాయి మెల్లగా నవ్వింది.

"ఎందుకో నాకు ఎంతో చిరాకు
 చంటి పిల్లల వాసన
ఎర్రటి ముద్దా - ఇంతటి ముద్దా
 అబ్బ" అన్నా రాయన,
గుండెకు హత్తుకు ఆమె వింతగా
 అంచి, "మన బ్బాయి"ని

# వేంబు

19 6 - అక్టోబర్ · ఆం.ప్ర.భ

**తాత కృష్ణమూర్తి**

సూర్యాస్తమయ మయినా పశ్చిమాన్ని ఆకాశం ఇంకా సంజకాంతులతో వెలుగుగానే ఉంది. తాను కట్టుకున్న తెల్లని జరీచీర లేత కాషాయరంగుదిగా కనబడింది వేంబుకు. పైటపిన్ను సర్దుకుంటూ ఆమె నిలువుటద్దానికి ఎదురుగా నిల్చొని, తన చక్కదనానికి తానే మురిసిపోతూ చిన్నపిల్లవలె ముసిముసిగా నవ్వుకుంది. అద్దంలోనే గాక తళ తళలాడే తన మెరుగు బుగ్గలలోకూడా తన ప్రతిబింబం పొడగట్టి ఉంటుంది ఆమెకు!

మంచి అవయవ సౌష్ఠవం; ఇరవై రెండేళ్ల ప్రాయం; వేంబు నిండు జవ్వని. అసమాన సౌందర్యవతి, కెరటాలవలె వంపులు పడిన నల్లని జుట్టు. కుదురైన మొగం, మొగిలిపువ్వు రంగులో మెత్తగా మెరిసే నున్నని ఒళ్లు, గులాబీరంగు పెదవులు, అందమైన పెద్ద కాటుకకళ్ళు, – అన్నీ దిద్ది తీర్చినట్లు ఆమెకు అమరిఉన్నవి.

'నార్సిసస్'ను వలె తన రూపం తననే మోహింపజేస్తున్నట్లు తోచింది వేంబుకు. అర్థంకాని సంతోషంతో హృదయం ఉప్పొంగి, ఒళ్ళు తేలికై నాట్యమాడాలని అనిపించింది ఆమెకా నిమిషంలో. కోయిల గొంతుకతో కూనిరాగం మాత్రంతీసి, "తుమ్నే ముఝ్‌కో ప్రేమ సిఖాయా......"

అన్న హిందీపాటలో తనకు పట్టుపడిన ఆ ఒక్క చరణమే ఎంతో శ్రావ్యంగా పాడింది ఆమె, కళ్లతో తమాషాగా అభినయిస్తూ.

ఇంతలో బంగాళా ఆవరణలో కారుచప్పుడు వినవచ్చింది.

"మధూ కారే అయి ఉంటుంది అది." అని తనలో అనుకొని, పాట ఆపివేసి చకచక హాలుద్వారం వద్దకువచ్చి తెర తొలగించి ఆత్రతతో బయటికి చూసింది వేంబు.

ఆయాసంతో మేడమెట్లెక్కి వస్తూఉన్న ముసలి దాది యజమానురాలిని చూసి, "అమ్మా, డాక్టరుగారు వచ్చారని చెప్పమన్నారు." అన్నది.

"సరే, మేడపైకి రమ్మని చెప్పు." అన్నాది వేంబు. దాది వెనుదిరిగి వెళ్లింది.

హాలుకు మధ్యగా అమర్చబడిన ఉయ్యాలదగ్గరకువచ్చి వేంబు తన రెండుచేతులతోనూ ఉయ్యాలగొలుసులు పట్టుకొని, నిద్రిస్తున్న బాలుణ్ణి అట్టేచూస్తూ నిల్చొని-ఏదో ఆలోచిస్తూ. గుండె కొంచెం వడిగా కొట్టుకోసాగింది ఆమెకు.

సౌఖ్యంగా మెత్తని దిండ్లమధ్య ఒళ్ళుమరచి నిద్రిస్తున్నాడు బాలుడు. చల్లని వసంతపవనములో వాని ముంగురులు ముద్దుగా చెదురుతూ అప్పుడప్పుడు కళ్లమీద పడి రెప్పలను అదిరిస్తున్నాయి. ఇంపయిన కలలో ఉన్నవానివలె నిద్రలో చిరునవ్వు నవ్విన తనయుని వాత్సల్యంతో తేలికగా తలమీద ముద్దుపెట్టుకుంది వేంబు. ముద్దులు మూటగట్టే ఆ చక్కని బాలుడు ఆమె ప్రథమ సంతానం. 15 మాసాల పసివాడు. తప్పటడుగులు, చిన్న ఎలకపళ్లు, ముద్దుముద్దు మాటలు, ఇప్పుడిప్పుడే వస్తున్నాయి వాడికి.

వేంబుకూ, ఆమె భర్త సుందరేశానికీ, అబ్బిగాడంటే అతి గారాబం. వాడు ఏ కారణంచేతనయినా పాలు తాగడానికి కాస్త చికాకు చేసినా, తాగినపాలు కక్కివేసినా, అట్టే అల్లరిచేసి ఏడ్చినా, సరిగా నిద్రపోకపోయినా, ఆడుకోకపోయినా, ఒక చిన్న జలుబుతుమ్ము తుమ్మినా, భార్యాభర్తలిరువురూ తల్లడిల్లిపోతారు.

సుందరేశం ఐ. సి. యస్. ఉద్యోగస్థుడు. వేంబుకు దగ్గర బంధువు. ఆమెకంటె ఏడేళ్లు పెద్దవాడు. ఇంగ్లాండునుండి అతడు తిరిగివచ్చినప్పటికి ఆమె యింకా కళాశాలా విద్యార్థిని. పెళ్లితో ఆమె చదువు ఆగిపోయింది.

సుందరేశానికి సబ్‌కలెక్టరుగా ఏజెన్సీకి బదిలీ అయినప్పటికి శిశువు తొమ్మిది నెలలవాడు. చంటి బిడ్డతో మన్యప్రదేశాలకి వెళ్లడానికి మొదట ఎంతో భయపడింది వేంబు. ఆమె భయపడినట్లుగానే కొత్త ఊరు వచ్చిన నెలలోపునే సుందరేశానికి చాలా జబ్బు చేసింది. మలేరియా జ్వరంతో అతను 18 రోజులు మంచంమీద ఉండవలసి వచ్చింది. ఆసుపత్రి అసిస్టెంట్ సర్జన్ మాధవరావు రెండు పూటలా వచ్చి చూస్తూ జాగ్రత్తగా వైద్యం నడిపి జబ్బు నయం చేశాడు.

ఆది మొదలు దంపతులిద్దరికీ మాధవరావుతో పరిచయం అభివృద్ధి అవుతూ వచ్చింది. అతని వైద్య నైపుణ్యంమీద ఇద్దరికీ ఒక విధమైన గురి కుదిరింది. చిన్నవాడైనా అతడు గొప్ప తెలివితేటలు గలవాడనీ, స్నేహ సౌహార్ద్రుడనీ, యోగ్యవర్తనుడనీ, ఉద్యోగులందరూ అతని గూర్చి మంచి అభిప్రాయం కలిగిఉండేవారు. ఆదే కాలంలోనే అతని భార్య యామినితో కూడా వాళ్లకి స్నేహం కలిసింది. వీళ్లింటికి వాళ్లు, వాళ్లింటికి వీళ్లు, తరుచుగా వస్తూ పోతూ, సినిమాలతో, వినోదాలతో, ఆటలతో, పాటలతో, కారు షికార్లతో, బాల్యస్నేహితులవలె, ఒకే కుటుంబం వాళ్లవలె, కలిసి మెలిసి ఉండేవారు.

సర్కారు పనిమీద సుందరేశం తరుచుగా క్యాంపులు తిరగవలసి వచ్చేది. దగ్గర ఊళ్లకైతే అప్పుడప్పుడు వేంబుకూడా అతనితో సరదాగా వెళ్లి వచ్చేది. కోయపల్లెలు, పొలాలు, అడవులు, కొండలు, సెలయేళ్లు, అన్నీ మామూలని ఆమెకు మిక్కిలి కుతూహలంగా ఉండేది. కాని భర్తకు జబ్బు చేసినప్పటినుండి ఏజన్సీలో తానుకూడా చంటి బిడ్డతో ప్రయాణాలు చేయడం భావ్యం కాదని తెలుసుకుంది ఆమె. ఎప్పుడోతప్ప, మారుమూల క్యాంపు లకు వెళ్లడం బొత్తిగా మానుకుంది.

భర్త ఊళ్లో లేనప్పుడు కొత్తలో వేంబుకు ఏమీ తోసుపోయేది కాదు. ప్రొద్దు పుచ్చడం కష్టమయేది. యామినితో బాగా పరిచయం కుదిరిన తరవాత ఆ యిబ్బంది కొంతవరకు తీరింది. చీటికీ మాటికీ ఒకరి వద్దకు ఒకరు పరుగెత్తుతూ ఉండేవారు. క్రమంగా వాళ్లస్నేహం బాగా అభివృద్ధి అయింది. ఒకరి పట్ల ఒకరు ఎంతో అభిమానం, చనువు, గౌరవం చూపుకునేవారు. చిన్ననాటి స్నేహితులవలె, తోబుట్టువులవలె, నూతనప్రియులవలె, ఇద్దరూ అన్యోన్యానురక్తులై మెలగేవారు.

వేంబుకంటె యామిని మూడునాలుగేళ్లు చిన్నది. పొడవుగా, సన్నగా, నాజూకుగా ఉండేది. జుట్టు పెద్దదే కాని కొంచెం ఎరుపు, మొగం తీర్చినదే కాని కొంచెం కోల. వేంబువలె మహా అపురూప సౌందర్యవతి కాకపోయినా, ఆమె నాగరికంగా, నాజూకుగా, ఆకర్షకంగా కనపడేది. చామనచాయ ఒళ్లు, పెద్ద కోలకళ్లు, నవ్వితే చిన్న లొత్తలు పడే బుగ్గలు, తీర్చిన సూది ముక్కు, పలుచని పెదవులు ఎప్పుడూ ఆనందంతో కలకలలాడే మొగం,— అన్నీ ఆమెలోగల ఏదోనిర్ణయించరానిఅపూర్వమైన ఆకర్షణశక్తిని సూచించేవి. చురుకుదనం, హాస్యం, రసికత్వం, పెంకెతనం, లోకజ్ఞానం, అన్నీ విశదపడేవి ఆమె సంభాషణలో. మంచి సరదా అయిన నిర్మొగమాటం మనిషి. పల్లెపల్లె. హాయి గొలిపే కంఠంతో ఆమె వీణమీద అద్భుతంగా పాడేది. మంచి అందమైన లేసుపన్లు కుట్టేది. గుర్రపుస్వారీ చేసేది. నదిలో సునాయాసంగా ఈదేది. బట్టకట్టులోను, మాటతీరులోను, శరీరశుభ్రతలోను మంచి నాగరికంగా ఉండేది. కాన్వెంట్ స్కూలులో చదువుకున్న పిల్లగనుక దొరసాన్లవలె చక్కని ఉచ్చారణతో ధాటీగా తప్పులు లేని ఇంగ్లీషు మాట్లాడేది.

“మంచి ముద్దొచ్చే ఇంగ్లీషు మాట్లాడుతుంది ఆమె” అని తరుచుగా యామినిని మెచ్చుకునేవాడు సుందరేశం.

“అవును—”అని మెల్లగా నవ్వుతూ, “అందుకనే కాబోలు మీ వంటి దొరలకు ఆవిడ అంటే అంత యిష్టం!” అనేది వేంబు, జెలసీ స్వరంతో.

ఇద్దరూ నవ్వుకొని ఒకరినొకరు వేళాకోళం చేసుకునేవారు.

దినాలు గడచిన కొద్దీ యామినితో సుందరేశానికీ, వేంబుతో డాక్టరుకూ చనువు అధికమవుతూ వచ్చింది. టెన్నిసు, బ్రిడ్జి ఆట, కాక్‌టెయిల్ పార్టీలు, ఎక్స్‌కర్షన్లు, పడవషికార్లు, వెన్నెల రాత్రులలో నదీ స్నానాలు. — అన్నీ వాళ్ల పరస్పర మైత్రిని అనేకవిధాల పెంపొందజేశాయి.

ఆరునెలలు దాటినవి, సుందరేశం ఏజెన్సీ వచ్చి. ఆయన క్యాంపులో ఉన్నప్పుడు పిల్లవాడికి రొంప చేసి, ఒళ్ళు కాస్త వెచ్చగిల్లింది. వేంబు వెంటనే ఆసుపత్రికి కబురుచేసింది. డాక్టరు వచ్చి చూసి మందిచ్చాడు. మర్నాడు సాయంత్రం సరికి జ్వరం పూర్తిగా దిగజారింది. మళ్లీ తగలలేదు. కాని ఇంకా రోజూ వచ్చి చూస్తూ ఔషధం ఇస్తునే ఉన్నాడు డాక్టరు. పిల్లవాడు మరల ఎప్పటి ఆరోగ్యస్థితికి వచ్చి కులాసాగా ఉన్నాడు.

నాలుగైదు రోజులనుండీ వరసగా సాయంత్రం పూట ఒకసారి కలెక్టరు గారి బంగళాకు వచ్చి వెళ్ళడం పరిపాటయింది డాక్టరుకు.

నాటి సంధ్యవేళ మెత్తని రబ్బరు జోళ్లతో చప్పుడు చేయకుండా వచ్చిన డాక్టరు వుయ్యాలవద్ద వేంబును చూసి, చిరునవ్వుతో పలకరిస్తూ, "వద్దు, లేపకండి బిడ్డను. నిద్రపోనీయండి హాయిగా," అన్నాడు.

"ఇంతా వచ్చి, అబ్బాయినిచూడరూమరి!" అన్నాది వేంబు, మొగం ఎత్తి సూటిగా అతని కళ్లవేపు చూస్తూ.

"తొందరలేదు. సావకాశంగా చూస్తాను—అబ్బాయి నిద్ర లేచిన తరవాత. ఇప్పుడు జ్వరం, జలుబు, ఏ చికాకూ లేవుగా?" అన్నాడు డాక్టరు.

"లేవు—మీ దయవల్ల" అంటూ ఆయనను కూర్చోమని చెప్పి, బయటి వరండావద్దకు వెళ్ళి నౌఖరును కేకవేసి పిలిచి, చప్పున టీచేసి తెమ్మని ఆజ్ఞాపించింది వేంబు.

త్వరలో ఒక కుర్రవాడు పళ్లెంతో టీసామగ్రి తెచ్చి పదిలంగా టేబిలుమీద ఉంచి వెళ్లాడు.

"క్షమించండి......నేను ఇప్పుడే టీ పుచ్చుకొని వచ్చాను." అన్నాడు డాక్టరు.

"ఫరవాలేదు, ఒక్క కప్పు తాగండి—టెన్నిస్ ఆడి అలసిఉంటారు" అంటూ వేంబు చిరునగవుతో తాపీగా రెండు కప్పులలో తేనీరుపోసి, అతని కెదురుగా తానూ కూచుంది బల్లవద్ద.

"లేదు, ఈనాడు టెన్నిస్ ఆటకు నేను క్లబ్బుకు వెళ్లనే లేదు."

"ఏం? అర్జెంటు కేసు ఏదైనా ఉండెనా?"

"లేదు. కాని ఏమో టెన్నిస్ మీద బుద్ధి పోలేదు." అంటూ క్షణం ఊరుకొని, "...ఈ మధ్య మీరు క్లబ్బుకు రావడం బొత్తిగా మానివేశారేం?" అన్నాడు డాక్టరు.

"నాకు మీ యామినిలాగ టెన్నిస్ సరదా అంతగా లేదుగా? ఆమె ఉంటే బలవంతంగా నయినా యీడ్చుకు పోయేది నన్ను. ఎప్పుడు వస్తుందేమిటవి ఊరినుండి?"

"ఏమో దాని చిత్తం! పుట్టింటికి వెళితే అది మొగుణ్ణి, స్నేహితులను, అందర్నీ మరచిపోతుంది. ఉత్తరాలుకూడా సరిగా వ్రాయదు. బహుశా, వారం పది రోజులలో వస్తుందనుకుంటాను."

టీ తాగుతున్నంతసేపూ ఇద్దరూ ఏవేవో లోకాభిరామాయణం కబుర్లు చెప్పుకుంటూ, మధ్యమధ్య నవ్వుకుంటూ, వాదించుకుంటూ, తీరుబాటుగా కూచున్నారు. అప్పుడప్పుడు ఒకరివైపొకరు చిత్రంగా చూసుకొని, పెదవులను పొంగే చిరునవ్వును, అణచుకొంటూ కళ్లు వాల్చుకునే వారు. సాధారణంగా నవ్వుతూ, హాస్యాలతో, పిట్టకథలతో, సరదాగా సంభాషించే డాక్టరు నాడు పరధ్యానంగా, చప్పచప్పగా, తడబడుతూ ఏమేమో మాట్లాడ దొడగాడు. వేంబుకూడా తన మామూలు ధోరణిలో లేదు. మోతాదు మీర షాంపెన్ తాగినదానికివలె, ఆమె కళ్లు అప్పుడప్పుడు చిత్రమైన వెలుగుతో జ్వలించేవి. తన హృదయాంతరాళంలో పుట్టిన ఏదో కల్లోలాన్ని ఆమె కష్టంతో అణచు

కుందుకు యత్నిస్తున్నట్లుగా ఉండేవి ఆమె మాటలు, చూపులున్నూ. నరాలలో విద్యుచ్ఛక్తి ప్రవహిస్తున్నట్లుగా ఆమె ముక్కుపుటాలు అప్పుడప్పుడు కొంచెం అదిరేవి. డాక్టరు చూపులన్నీ తన సౌందర్యాన్ని కూడని విధంగా వెయ్యివిధాల వెర్రిగా పొగడుతున్నట్లూ, తన నేదో యాచించరాని దాని కోసం జంకుతూ దీనంగా యాచిస్తున్నట్లూ, కనబడేవి ఆమెకు.

సిగ్గుతో బుగ్గలను కాస్త ఎర్రబరచుకొని, కళ్లు వాల్చి, తేలికగా నవ్వుతూ, "మరికొంచెం చక్కెర వెయ్యనా?" అంటూ ఆమె చెమ్చాతో అతని కప్పును తాకబోయింది.

మొగమాటం పడుతున్న వానివలె వద్దని చెయ్యి అడ్డు పెట్టిన అతని వేళ్లను చెమ్చా తగిలింది. ఇద్దరూ చిన్న పిల్లలవలె అనవసరమైన తొట్రుపాటుపడి, మొత్తానికి టీ కప్పును తిరగదోశారు. ఒలికిన వేడి తేనీరు ఆ గడబిడలో కొంచెం ఆమె చీరమీద పడింది. ఇద్దరూ ఒకరివైపొకరు ఓరగా చూసుకొని పక్కున నవ్వుకున్నారు, లేచి నిలబడుతూ.

చప్పున తన జేబురుమాలుతీసి, వేంబును సమీపించి టీ పడినచోట ఆమె చీరను అదిమి తుడవబోయినాడు డాక్టరు. అతనిచేతి తాకుడుకు చక్కిలిగింత పుట్టింది ఆమెకు. కలకల నవ్వుతూ వయ్యారంగా నడుము వంచి, తప్పించుకుందుకు ప్రక్కగా ఒరిగింది ఆమె. తానూ నవ్వుతూ రెండోచేయి ఆమె భుజంమీద వేసి, ఒళ్లు తెలియని మోహావేశంతో తటాలున వేంబును తనవైపు లాగుకున్నాడు డాక్టరు.

ఒకరి ఒళ్లు ఒకరికీ వెచ్చగా మెత్తగా తగలడంతో ఇద్దరూ వివశులైనారు. ఎన్నాళ్లనుండో అట్టి ముహూర్తం కొరకు తపిస్తున్న వాళ్ళవలె ఒకరినొకరు బిగువుగా కౌగలించుకొని ఆవేశంతో ముద్దులాడుకున్నారు. జంకు, సిగ్గు, క్రొత్తదనం, నీతి, అన్నీ ఆ గాఢాలింగనంలో, ఆ వెర్రి ముద్దులలో అకస్మికంగా కరిగిపోయినాయి. ఒక్క క్షణంవరకూ కాలం ఆగిపోయింది.

ఇంతలో ఉయ్యాల్లో ఉన్న బాలుడు కెవ్వున ఏడుస్తూ నిద్ర లేచాడు. కలలో ఉన్నట్లుండిన వేంబు త్రుళ్లిపడి, వెంటనే తెలివి తెచ్చుకుంది.

"అబ్బా,... వాసులు!" అంటూ ఉక్కిరి బిక్కిరి అయిన దానివలె పెనగులాడి, అలసటతో కౌగిలి వదలించుకుంది ఆమె.

ఆపాదమస్తకం సన్నని కుదుపుతో గజగజ వణికింది ఆమె దేహం. ఆమె సిగలోని గులాబిపువ్వొకటి నలిగి కింద రాలింది.

ఏడుస్తున్న తనయుణ్ణి తీసి ఎత్తుకొని బుజ్జగిస్తూ, దాదిని కేక వేసింది ఆమె.

వేంబువైపు [illegible] రెప్ప వాల్చకచూసి, "కోపమా?" అన్నాడు మాధవరావు అస్పష్టస్వరంతో. లేదని సూచించేటట్లు మెల్లగా నవ్వి, "... కాని నువ్విక వెళ్ళు" అన్నది ఆమె, కళ్ళు వాల్చుకొని.

ఆమె ఆజ్ఞను మారు చెప్పలేక, అనిష్టంగా మేడ దిగి వెళ్లిపోయినాడు అయన, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ.

వెలిగించిన పెట్రోమాక్సు లాంతర్లతో ఎదురైన బంట్రోతు వినయంగా ప్రక్కకు తప్పుకొని సలాముచేసి నవ్వాడు, "ఏమోయి, నువ్వు మరొక గంట పోయిన తరువాత ఆసుపత్రికి వస్తే, మందుపొట్లాలిస్తాను. తెచ్చి అమ్మగారికి అప్పజెప్పు" అన్నాడు డాక్టరు.

"చిత్తం బాబూ," అన్నాడు వాడు. ఆ రాత్రి వేంబుకు సరిగా నిద్ర పట్టలేదు. ఏవేవో ఆలోచనలతో మెదడు వేడెక్కించుకొని బాధ పడ్డది ఆమె. జరిగినదానికి ఆనందించాలో లేక కించపడాలో కూడా తెలియలేదు ఆమెకు.

అప్పటికి కొంతకాలం నుండి ఆమె హృదయంలో మాధవరావుమీద ఎందుకో అర్థంకాని వెర్రివెర్రి కోర్కెలు రగులుతూ ఉండేను. అతని సాన్నిధ్యం ఆమె మనసుకు చెప్పరాని ఆనందం కలుగజేసేది. అతని రూపురేఖలలో ఆమెకు క్రొత్తక్రొత్త సౌందర్యకళలు గోచరించేవి. అతని మాటలు వీనుల విందుగా వినబడేవి. ఎన్నడూ ఏ పురుషుడూ తన

హృదయాన్ని అట్లా ఆకర్షించి, కుదిపి, ఆరాట పెట్ట గలగడం ఆమె ఎరగను. కాని, తుదకు ఎన్నాళ్ళనుండో తాను కలలు కంటున్నట్లుగా, మనస్సులో కోరుకుంటున్నట్లుగా నాడు ఆయన కౌగిట్లో ఒక్క నిముషం వెచ్చగా నలిగేసరికి, ఒక్క తృప్తికరమైన వేడి ముద్దు అనుభవించే సరికి, ఎందుకో ఆమెకు గుండెల్లో దడ పుట్టింది. నరాలు అదిరి ఆమె శరీరం కంపించి పోయింది. ఎందుకట్లా అవాలో ఆమెకు అర్థం కాలేదు.

లోకంలో ఎందరు స్త్రీలు రహస్య ప్రేమసౌఖ్యాల ననుభవిస్తుండ లేదు! వాళ్ళందరూ తనవలెనే బాధ పడుతున్నారా మరి!...తనకూ బాధ ఉండదేమో, అన్ని కోర్కెలూ తాను తీర్చుకోగలిగితే!...... కాని తీర్చుకోగలదా!—తీర్చుకోవచ్చునా!...... మనసుకు కొంతశాంతి, శరీరానికి కొంతసౌఖ్యం, ఇయ్యగల సాధారణ దాంపత్యప్రేమను ఆమె ఎరుగునే కాని, ఈవిధంగా హృదయాన్ని పీడించి దేహాన్ని తాపంలోముంచగల దారుణప్రేమను ఆమె ఎన్నడూ ఎరగదు.

ఇన్నాళ్ళూ నిజమైనప్రేమ అంటే ఎట్టిదో ఎరగకే కాబోలు ఏమీ ఒడుదుడుకులు లేని ప్రశాంతజీవితం గడుపుకోగలిగింది ఆమె! పిల్లకెరటాల సముద్రం మీద హాయిగా, తేలికగా, క్షేమంగా ప్రయాణం చేస్తున్న ఓడ హఠాత్తుగా ప్రమాదకరమైన తుపానులో చిక్కుకున్నట్లుగా పరిణమించింది ఆమెఅవస్థ! ఉత్తముడు, ప్రయోజకుడు, రూపవంతుడు, యువకుడు అయిన సుందరేశంవంటి భర్తనుండి తనప్రేమ అకారణంగా ఎందుకు తొలగవలెనో ఆమెకు బోధ పడలేదు. మూడేళ్ళనుండీ సౌఖ్యంగా, సవ్యంగా ఎంతో రమ్యంగా గడుస్తూన్న తన దాంపత్యజీవితం ఇప్పుడేమి కానున్నదో!

మాధవరావు ఇంకా బిరుసెక్కని చిన్న మీసంతో లేతగా, సన్నగా, పొడుగుగా, కుర్రవాడివలె కనిపించినా, సుందరేశం కంటె [illegible]చిన్నవాడు కాడు; అతనికంటె ఎక్కువ అందచందాలు గలవాడు కూడా కాదు. కాని అతన్ని చూసినమాత్రాన తల్చుకున్న మాత్రాన వేంబు హృదయం గాఢమైన వెర్రివెర్రి కోర్కెలతో గిజగిజ తన్నుకునేది!

ఆమె లోకానుభవం చాలని అజ్ఞానురాలు కాదు. చదువు సంధ్యలు లేని మూఢురాలు కాదు. చపల చిత్తురాలు కాదు. మాధవరావుమీద తనకు మమత కూడదనీ అది అసందర్భమనీ అపాయదాయకము కూడా అనీ, ఆమె ఎరుగును. మర్యాదస్థురాలు, మగనాలు, బిడ్డతల్లి అయిన తనవంటిదానికి పరపురుషునితో స్నేహం ప్రమాదకరమని, అక్రమమనీ, ఆమెకు తెలుసును. ఇదివరకెన్నోసార్లు ఆమె తన అంతరాత్మతో వాదించుకొని, పోట్లాడుకొని, నెగ్గలేక ఊరుకుంది.

రాత్రి ఆమె భోజనానికి లేచే ముందు, బంట్రోతు ద్వారా డాక్టరు మందు పొట్లాలని పంపిన చిన్న చాకొలేట్ పెట్టెవంటి అట్టపెట్టెను సీలు తెరచి చూసుకునే సరికి అందులో పొందికగా మడతపెట్టి ఉంచబడిన ఉత్తరమొకటి కనిపించింది ఆమెకు. మిక్కిలి తొందరతో, సొట్ట అక్షరాలతో మాధవరావు ఆమెకు వ్రాసిన ప్రేమలేఖ అది! ఆత్రతతో ఆ ఉత్తరాన్ని చదువుకొని, వేంబు తనలో ముసిముసిగా నవ్వుకుంది. ఏమిటో తనగదిలో టేబిలు దగ్గర కూచుని, మళ్ళీ ఆ లేఖ చదివి, చేతిమీద గడ్డం ఆనుకొని దీర్ఘంగా కొంతసేపు ఆలోచనలో పడి, వేడి నిట్టూర్పులు విడిచింది ఆమె!

"నా వలెనే మనూ కూడా [illegible]. ఇన్నాళ్ళూ తన ప్రేమను అట్లా మనసులోనే అణచుకున్నాడు కాని, ధైర్యం చేసి నాకు చెప్పలేక పోయాడు గదా? ఇప్పుడెట్లా వచ్చిందో ఇంత ధైర్యం! ఈ ఉత్తరంలో వ్రాసినట్లు ఒకవేళ నిజంగానే వస్తాడేమో రాత్రికి? ....." అంటూ ఉత్సాహంతో, సంకోచంతో, బెదురుపాటుతో ఉత్తరాన్ని పెదవుల కద్దుకుంది వేంబు.

ఆ రాత్రి ఆమెకు భోజనం ఏమీ హితవు కాలేదు. విస్తరిముందు కూర్చొని ఎలాగో మొక్కు తీర్చుకుంది ఆమె. ఏపని చేయడానికీ ఆమెకు మనస్థిమితం లేకపోయింది. మేడ వరండాలో కొంతసేపు చల్ల

గాలికి పచారుచేసి, ఏమీ తోచక, తన గదిలో మంచంమీద పడుకుంది ఆమె, శూన్య దృష్టితో దోమతెర పైకప్పు వేపు చూస్తూ.

ఎందుకో అప్పుడు భర్త జ్ఞాపకానికివచ్చాడు ఆమెకు. గదిగోడకు అమర్చబడి ఉన్న అతని ఫోటోచిత్రం వేపు అప్రయత్నంగా ఒకసారి చూసింది ఆమె. తనవేపు ఎంతో దయతో, ప్రేమతో, విశ్వాసంతో చూస్తున్నట్లుగా కనబడ్డాయి అతని కళ్ళు. అతని ప్రేమ, అమాయకత్వము, మంచితనము, అన్నీ తలుపుకు వచ్చి ఆమె మనసును కలత పరచాయి. అతన్ని ద్రోహం చెయ్యటానికి ఆమె అంతరాత్మ ఒప్పుకోవటం లేదు.

కాని మాధవరావును అంతమనసారా ప్రేమిస్తూ, అతని ప్రేమను నిరాకరించడమెట్లో ఆమెకు తెలియరాలేదు. ఇద్దర్నీ ప్రేమిస్తూ, ఇద్దర్నీ సుఖపెట్టగలగడానికి సాధన మేమిటో? తన మూలాన ఆ ఇద్దరిలో ఎవరికి కష్టం కలిగినా ఆమె సహించుకోలేదు. నిజానికి, తన విశాలహృదయంలో ఇద్దర్నీ ఉంచుకుందుకు బోలెడు స్థలం ఉంది! కాని వాళ్ళు అట్లా ఉండలేరుగా?

తానట్లా మధుని ప్రేమిస్తున్నట్లు తెలిస్తే, భర్త నిజంగా గుండెపగిలి చచ్చిపోతాడు - ఓర్చుకోలేడు పాపం! ఏమో,... తెలిస్తే ఎందుకు చెప్తా, మగవాళ్లకు అంత కష్టంగా ఉండటం! భరించుకోలేకనే కాబోలు మగవాళ్ళు ఎంతేసి దారుణకృత్యములైనా చేస్తూఉంటారు, ఇట్లాటివిషయాలలో! అనునిత్యం తన పెనిమిటి ఈ మోస్తరు కేసు లెన్నో విచారణ చేస్తూ ఉంటాడో కోర్టులో!......భార్య కాస్త అజాగ్రత్తగా, అనుమానాస్పదంగా ప్రవర్తించింది అని తెలిస్తేచాలు, భర్త వెర్రెత్తిపోతాడు! పెళ్లాం విషయంలో ప్రతీపురుషుడూ ఒథెల్లో వంటివాడే! కాబట్టే లోకంలో ఇన్ని ఖూనీలు, ఆత్మహత్యలు, పిచ్చెత్తిపోవడాలున్నూ!...... మగవాడి ఊహలోనే ఉంది ఆబాధ కాని తెలియకుంటే మళ్లీ ఏమీ లేదు! ఎందరి నెరగదు అట్టివారిని!—తమ వెనకాల తమ ధర్మపత్నులనుగురించీ లోకమేమనుకుంటూ ఉందో ఎరగని పెద్ద మనుషులను చూచి తనలో నవ్వుకుంది.




నిజమైన ప్రేమకు సందేహాలూ, సమస్యలూ ఉండవంటారు. ఒకవేళ తనది నిజమైన ప్రేమ కాదేమో! ఆ తలపు కలిగినందుకే ఆగ్రహం వచ్చింది ఆమెకు. తన దేహంలో ప్రతి రక్తకణమూ, ప్రతి సూక్ష్మరేణువూ, అట్లా మాధవరావుకోసం ఆరాటపడుతూ ఉంటే, తన విజ్ఞానం, పాతివ్రత్యాదర్శం తన హృదయంతో రోజూ యుద్ధంచేసి ఓడిపోతూ ఉంటే, తనది నిజమైన ప్రేమ కాదూ! కాని ఎట్లా ఋజువుచెయ్యటం తన ప్రేమ నిజమైనదని? ఎవరికి అర్థం అవుతుంది తన హృదయపరిస్థితి?

మాధవరావు మీద తనకు మనసు కలగటం తన తప్పేనేమో! తాను మంచిమనిషి కాదేమో! నిజంగా తానెట్టి మనిషి! ...... ఏ స్త్రీ అయినా ఎట్టిది? తన శక్తికి మించిన శక్తిని ఎవతె అయినా ఎట్లా ఎదుర్కో గలదు? హృదయాన్ని, ఆత్మను, జీవితాన్ని నలిపి, పీడించి, పిప్పిచేసే అమానుషప్రేమను ఎవరు మాత్రం జయించగలరు! ...తలపు పెద్ద భయానకమైన సుడిగుండం వంటిది. అందులో ఎన్నడూ పడక, తలను గిర్రున తిప్పే ఆ ప్రవాహానుభవాన్ని ఎరగక, ఎట్లో తప్పించుకొని, సంసారసాగరాన్ని ఈదగల అదృష్టవంతులే ధన్యులేమో? తన కేల అట్టి అదృష్టం పట్టలేదో!... కాని ప్రేమ నెరగని అభాగ్యజీవులు నిజంగా అదృష్టవంతులే అవుతారా?

లేనిపోని అనవసరమైన సమస్యలతో బాధపడటం పిరికితనంవల్లనే ఏమో! దేవుడు తన నెందుకింత పిరికిదాన్నిగా చేశాడో! కాని ధైర్యం వహించడమే అక్రమం, అన్యాయం, అపాయకరం, అంటుంది తన అంతరాత్మ!

"పిరికివాళ్లు తమ చాతగానితనాన్ని ఒప్పుకోలేక అంతరాత్మను నిందించుకుంటారు!" అన్న యామిని మాటలు అప్పుడు జ్ఞప్తికివచ్చాయి [illegible].

చిత్రమైన మనిషి యామిని! రకరకాల పురుషులను ఆక

క్షించే దీపంవలె మగవాళ్లను చుట్టూ చేర్చుకొని ఆడుకుంటుందేకాని, ఎవరినీఎక్కువ చనువు తీసుకో నియ్యదు. ఆమెను అర్థం చేసుకోలేక మోసపోయి, ఎవడైనా వెర్రివెర్రిగా ప్రవర్తించినా వాడిని చెంప మీద చరిచి బుద్ధి చెప్పగల ధైర్యంకూడా ఉంది ఆమెకు! ఎందరితో ఎంత స్వేచ్ఛగా చనువుగా మెసలినా ఎవరికీ లొంగిపోయి తాను చులకన అయిపోదు ఆమె!

అసలు దానికెందుకో తన్ను తాను కాపాడుకోవల సిన అగత్యం? మగవాడు స్వేచ్ఛగా మెసలుతాడు. ఇట్టి విషయాలలో పువ్వునుండి పువ్వుకు తిరిగే తుమ్మెదవలె ఒకతెనుండి ఒకతె వద్దకు వెళ్లగలడు! కొందరు స్త్రీలుకూడా అట్లా హాయిగా సంచరించ గలరు!...... తానెందుకట్లాటిరకం మనిషి కాదో! మనసుకు పిసరంత క్షోభలేకుండా సహ స్వానుభవాలకోసం ప్రేమసుఖాలకోసం వెనుక లాడే స్త్రీలను ఎందరినో ఎరుగును తాను! వాళ్లు తనవలె ధర్మసందేహాలతోగాని లోకాపవాద భీతితోగాని బాధపడుతున్నట్లు తోచదు.

ఆలోచించిన కొలదీ తనకు పిచ్చి ఎత్తుతున్నట్లు తోచింది వేంబుకు. మనస్సు ఎన్నివిధాల కుదుట పరచుకుందా మనుకున్నా సాధ్యం కాలేదు. చల్లని గాలి, మెత్తని పట్టుపరుపు, కొప్పులోని మల్లె పువ్వుల మత్తు వాసన—అన్నీ శరీరానికి విశ్రాంతి, సౌఖ్యం, చేకూర్చడానికి బదులు తాపహేతువులై చికాకు పరచాయి ఆమెను.

పాన్పునుండి లేచి, టేబిలుమీద దీపం హెచ్చించి, కూజాలోని చల్లని మంచినీళ్లు గ్లాసులో పోసుకొని తాగి, హాలువైపు వచ్చింది వేంబు. రాత్రి పది గంటలు దాటింది. మేడ అంతా నిశ్శబ్దంగా ఉంది.

నౌకర్లు ఎక్కడో పడుకొని నిద్రిస్తున్నారు. దాది మాత్రం హాలులో పడుకుంది, ఉయ్యాలకు దగ్గ రలో. నిద్రలో ఉన్న అబ్బాయిని తీసుకొని, తన పక్కలో పడుకో పెట్టుకుంది వేంబు. నరాల వేడి కొంచెం తగ్గినట్లు తోచింది ఆమెకు. ఆవేశంతో ఆ పసివాడిని వెచ్చగా రొమ్ముకు అదుముకుంటూ తల మీద ముద్దు పెట్టుకుంది ఆమె. మెలకువ వచ్చి, కళ్లు తెరచి, భయాశ్చర్య దృష్టులతో తల్లి మొగం చిత్రంగా చూస్తూ, ఏడుపు ప్రారంభించాడు వాడు. దాది లేచింది. కాస్తసేపు వేంబు బాలుణ్ణి బుజ్జగించి ఊరుకో పెట్టలేక, మళ్లీ దాదికే అప్పజెప్పింది వాడిని.

నిట్టూర్పుతో గట్టిగా కళ్లుమూసుకొని, నిద్ర తెచ్చు కుందుకు యత్నించింది వేంబు. కొంతసేపటికి ఆమెకు చిన్న కునుకు పట్టింది. కాని మాటికీ చీటికీ నిద్రలో కదులుతూనే ఉంది ఆమె. కలతతో ఆమె నిద్ర కలతనిద్ర అయింది. మెలకువతో ఉన్నప్పుడు ఆమెను బాధించిన కోర్కెలన్నీ ఆ సుఖ స్వప్నాల సరళిలో మధురంగా తీరుతున్నట్లు తోచింది ఆమెకు. అపరాత్రివేళ ఉలికిపడి కళ్లు తెరచింది ఆమె. పక్కమీద తా నొక్కతే ఉన్నట్లు తెలుసు కుంది. బాగా తెలివి తెచ్చుకొని ఉద్రేకతో లేచి కూర్చుంది. టేబిలుమీది గడియారం చూసింది. పావు తక్కువ పన్నెండుగంటలు అయింది అప్పుడు. రాత్రి పదిగంటల తరువాత ఆమె గదిలో దీపం లేక పోవడం చూసుకొని డాబామీదికి వస్తా నని వ్రాశాడు మాధవరావు. టేబిలుమీద పెద్దగా వెలు గుతూ ఉన్న దీపంవైపు చూస్తూ తనలో మెల్లగా నవ్వుకుంది వేంబు. లేచి టేబిలువద్ద క్షణం ఆలో చిస్తూ నిలుచుని, దీపం ఆర్పడానికి తాపిగా వత్తి దించింది. కాని ధైర్యం చాలలేదు. వేళ్లు వణికాయి. వెంటనే మళ్లీ దీపం కాస్త హెచ్చించింది.

గది తలుపులు తెరచి చల్లగాలి కని బయటి డాబామీదికి వెళ్లింది ఆమె. గోలెములలో ఉన్న పూలమొక్కలను, నింగిని మెరసే చుక్కలను, చెట్ల సందులలో నుండి రమ్యంగా కనబడే అస్తమిస్తున్న చంద్రుణ్ణి చూస్తూ కొంతసేపు నిల్చుంది. గాలి కొంచెం చలిగా తాకింది ఆమె చెంపలకు.

మళ్ళీ తన పడకగదికి వచ్చి, దీపం ఆర్పి, తలుపులు మూయకుండానే మంచంమీద వాలింది ఆమె.

వెర్రివెర్రి ఊహలు పరుగులెత్తాయి ఆమె తలలో. ఆ అర్ధరాత్రిని, ఆ అనుకూల సమయాన, ఆ నిమిష

మందు, హటాత్తుగా మాధవరావు ఆమె శయనాగారం ప్రవేశించి, దేనికీ ఆమెకు వ్యవధి నివ్వక, చీకట్లో అమాంతంగా ఆమెను కౌగలించుకొని ఉంటే అతని చేతులలో కీలుబొమ్మవలె సుతరామూ లొంగిపోయేదే ఆమె! తన్నుదాను కాపాడుకుందుకు ఆమెలోగల అన్నిశక్తులూ ఆ క్షణానికి నశించాయి. నీతి, లోకం, భర్త, బిడ్డ—అన్నీ తన మోహోద్రేకంలో ఆ ఘడియకు మరిచిపోయింది ఆమె!

కాని ఆ మరుసటి క్షణమందే ఆమె తలలో ఏదో మెరుపు మెరిసింది. తటాలున మంచంనుండి లేచి, వెలుపలి డాబామీదికి వచ్చింది ఆమె. డాబానుండి తిన్నగా బయటికి తోటవైపుకు ఉన్న మెట్లు దిగింది తొందరగా.

సమీపంలో దట్టంగా ఉన్న చెట్లనీడలలో అలికిడి అయి, "వేంబూ!" అని మెల్లగా పిలుపు వినవచ్చింది. మామిడిపువ్వు వాసనతో బరువుగా వీచింది గాలి. ఆకుల గలగలధ్వని, పిట్టల పిల్ల అరుపులు తప్ప, తోట అంతా నిశ్శబ్దంగా ఉంది. దూరంనుండి మధురంగా కోయిలకూత వినవచ్చింది. చంద్రు డస్తమించాడు.

వేంబువైపు ఆశతో చేతులు చాచుకొని, ఆ మసక చీకటిలోకూడా ప్రకాశవంతమై ఆనందంతో వెలుగుతున్నట్లుండిన నవ్వుమొగంతో వడివడిగా ముందుకు వచ్చాడు మాధవరావు. చుక్కల గుడ్డివెలుగులో మెట్లమీద ఠీవిగా నిల్చున్న వేంబు మంచుబట్టలు గట్టిన వనదేవత వలె కనబడింది అతనికి.

"......మధూ,......మధూ!......ఎట్లా వచ్చావు, ఈ అడవిదారిని? ఎంతసేపయింది వచ్చి?... జోళ్లు తొడుగుకోలేదేం? పురుగూ పుట్రా కరిస్తే! ఆగు, ఆగు, ... అక్కడే నిల్చో, ఎడంగా! ... వద్దు,...మీదికి రాకు. నన్ను తాకవద్దు!...అట్లాగే నిల్చో...ముందు నేను చెప్పేదంతా విను."

ఆమె మాటలు వినిపించుకునే స్థితిలో లేడతడు గాలిమీద నడుస్తున్నాడు. ముందుకు ఒక్క దాటువేసి వేంబును సమీపించి, ఆమె చెయ్యి పట్టుకోబోయినాడు.

కోపంతో చెయ్యి విదల్చింది. ఆమె గాజులు ఘల్లుమన్నాయి.

"ఏమిటిది? న్యాయమేనా వేంబూ? ఎందుకు నామీద అంతకోపం?" అన్నాడాయన దీనస్వరంతో నిర్ఘాంతపడి.

ఒక్క క్షణం ఒకరినొకరు కళ్లెత్తి చూసుకున్నారు. ఫక్కున నవ్వింది వేంబు. "...బుద్ధిగా నేను చెప్పినట్లు నడుచుకునేమాట ఉంటే ఇక్కడికి వచ్చి, ఈ మెట్టుమీద కూర్చో—నన్ను తగలకుండా! ఇక్కడే మనం స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చును. ఇతరులు వింటారేమో అన్న భయం లేకుండా" అంటూ ఆమె తాను నిల్చున్న సోపానం మీదనే చతికిలబడింది.

మాధవరావు ఆమె చెంత కూచుని, తల వాల్చుకున్నాడు, ఏమేమో ఆలోచిస్తూ.

కొంతసేపటివరకూ వాళ్ల సంభాషణ ధారాళంగా సాగలేదు. ఒకరినొకరు తగలకుండా కూర్చోవడం ఇద్దరికీ కష్టంగానే ఉండెను. "...వేంబూ, నేను ఋషిని కాను,—రాయినీ, రప్పనూ కాను! రక్తం మాంసం గల సాధారణ మానవమాత్రుడను. ఎన్ని కలలతో, ఎన్ని కోర్కెలతో ఎట్టి ఆశతో వచ్చానో ఆ దేవునికే తెలియాలి కాని,నువ్వు ఊహించుకోలేవు. నేను చెప్పినా నీకు అర్థం కాదు.... ఎందుకు నన్నిట్లాటి అగ్నిపరీక్ష చేస్తున్నావో తెలుసుకోలేకుండా ఉన్నాను. నా ప్రేమను శంకిస్తున్నావా! నామీద నమ్మకం లేదా! లేక—"

"అది కాదు మధూ! నాకు తెలుసు, నిన్ను బాధపెడుతున్నానని. నేను నీకంటె ఎక్కువ బాధపడుతున్నాను. నమ్మవు కదూ? పోనీలే!...రాత్రి నీ ఉత్తరం చూసుకొని నా హృదయంలో ఎంత పోట్లాట పెట్టుకున్నానో ఎరుగుదువా!... ఎన్నాళ్లనుండో ప్రేమిస్తున్నాను నిన్ను! నువ్వూ నన్ను ప్రేమిస్తున్నావని ఎలాగో ఇదివరకే తెలుసు నా మనసుకి. కాని—",

"కాని ఈ దివ్యమైన రాత్రిని– ఇన్నాళ్ళకు ఆ ప్రేమ దేవుని అనుగ్రహం వలన మనకు లభించిన ఈ ప్రథమ రాత్రిని – వృథాపరుస్తున్నావు అనవసరంగా! నేను ఒప్పుకోను, ఒప్పుకోలేను –" అంటూ లేచి నిల్చున్నాడు మాధవరావు.

పెద్ద నిట్టూర్పు విడిచి, "మధూ, ఇట్లా చూడు నా మొగం వైపు.........ఏడుస్తున్న దాన్ని మరింత ఏడిపించకు! ...మనం చిన్నపిల్లలము కాము. బొత్తిగా లోకానుభవం లేని అజ్ఞానులము కాము. కేవలం మృగాలవంటి అనాగరికులము కాము! మనం ఒకరి నొకరం ప్రేమించుకుంటున్నామని, ఇతరులను మన ప్రేమకు బలిపశువులనుగా చేయలేం కదా? మన ప్రేమ సఫలత్వం కోసం, మన సౌఖ్యం కోసం, మనను నమ్ముకున్న అమాయక ప్రాణులను క్రూరంగా నట్టేట తోయలేం కదా?... ఒకవేళ మనం ఇప్పటి ఆవేశం కొద్దీ, కూడని విధంగా ప్రవర్తించామా, ఇక ఆ జన్మాంతమూ పశ్చాత్తాపపడవలసివస్తుంది! నువ్వు మగవాడివి గనుక, నీకు అట్టే ఇబ్బంది లేదేమో! వలపుతిప్పలు నీ జీవితాన్ని మోపుగా గాయపరచక పోవచ్చును. కాని నేను స్త్రీని—అబలను—అస్వతంత్రురాలిని—బిడ్డతల్లిని! అయితే, నా జీవితం భ్రష్టు అవుతుందని గాని, ధ్వంసం అవుతుందని గాని కాదు నాదిగులు. నా ప్రేమ కానుకగా నీకు నా ప్రాణం ఇమ్మంటే ఇస్తాను. నువ్వు నన్ను అగ్నిగుండంలో దిగమంటే దిగుతాను! కాని నాతోకూడా నా భర్తను, నా బిడ్డను, నీ భార్యను, నిన్ను కూడా ఎట్లా దింపను? శక్తి లేదు—ధైర్యం లేదు! నిన్ను ప్రేమించడానికి గాని, నీ ప్రేమను స్వీకరించడానికి గాని అర్హత లేదు నాకు!

"......కాని నిన్ను ప్రేమిస్తున్నందుకు కించపడను. జరిగినదానికి వగవను. నువ్వు నన్ను ప్రేమిస్తున్నందుకు గాని, ఫలాపేక్షతో ఉన్నందుకుగాని, నీమీద నాకు కోపం అనుకోకు. నువ్వంటే నాకు ప్రాణం. నీ మీద ఎంతో ఇష్టం, గౌరవమున్నూ. నీ ప్రేమను పొందినందుకు ఎంతో గర్వపడుతున్నాను నేను. ఇతరులను హింసించకుండా నిన్ను సుఖపెట్టే మార్గమేఉంటే నువ్వు ఏం చెయ్యమన్నా చేస్తాను.

"......నువ్వుకూడా ఆలోచించు, మన ప్రేమ మనకు నిజంగా ఏం సౌఖ్యం ఇవ్వగలదో!...... ఇట్లా అదృష్టవశాత్తూ లభించిన ఈ ప్రస్తుతావకాశాన్ని చేతులారా ఎందుకు పోగొట్టుకోవాలని కదా నువ్వు అనేది! వెర్రివాడా! ఈ ఒక్క రాత్రితో మన కోర్కెలన్నీ తీరిపోతాయా? మన ప్రేమకు సఫలత్వం సిద్ధిస్తుందా! కేవలం ఇట్లాటి అవకాశాల కోసనే ఆశపడుతూ ఎన్నాళ్లు బ్రతుకగలదు మన ప్రేమ! ఇట్టి రహస్య సమ్మేళనాలలో మనకు ఏం తృప్తి లభిస్తుంది! ఎంతకాలం సాగించుకోగలం ఈ దొంగబ్రతుకు! ఎందరికళ్లు మూయగలం, మన మీ పాడులోకంలో! అన్నిటికీ సిద్ధపడదామనుకున్నా, భయంతో, దిగులుతో, అంతరాత్మ పోరుతో ఏం సౌఖ్యం లభిస్తుందని మనకు! కష్టార్తి పడినా కమ్మనిపించెను, మధూ! ప్రపంచం చెడినా, సుఖం అయినా దక్కాలికద! అదీ లేనప్పుడో!......

"నీకంటె ఎక్కువ తెలిసినదానివలె నీకు నీతిబోధ చేస్తున్నానని అనుకోకు! నీ కంటె నేనేమీ ప్రజ్ఞావంతురాలను కాను. మనోధైర్యం గలదాన్ని కూడా కాను. దుర్బలమైన సామాన్య మానవ హృదయంతోనే నిన్ను వెర్రిగా ప్రేమిస్తున్నాను. నీ కౌగిలికోసం కలలు కంటున్నాను. కాని నిన్ను నీచత్వానికి దింపలేను! సామాన్య ప్రియులవలె రహస్య సౌఖ్యాలలో జీవితానందాన్ని చేజిక్కించుకున్నట్లు భావించుకొని సంతోషించలేం మనం! అవునా? మన ఆశలు వేరు – ఆదర్శాలు వేరు – బాధ్యతలు వేరు! ...

"కాబట్టే మనప్రేమను మన త్యాగశక్తే కాపాడగలదేమో కాని, అన్యసాధనం ఉన్నట్లు తోచదు... ఈ పిచ్చివాగుడంతా నిన్ను తిరస్కరించడానికని గాని, నీప్రేమను అవమానపరచడానికని గాని నీ హృదయాన్ని గాయపరచడానికని గాని అనుకోకు! నువ్వు ఏం కోరినా లేదనడానికి నిజంగా నాకు శక్తికూడా లేదు......

"...ఏమి టది మధూ,...అట్లా దిగులుగా చూస్తావేం ? నా నుండేనా నీ కీబాధ?... తుదకు నా ప్రేమ ఇదా నీకు ఇస్తున్నది?—అసందర్భం!

"నా వెర్రి మధూ! ఇట్లారా నా కౌగిట్లోకి! నీ బాధ, కోపం, అన్నీ పోగొట్టుతాను—," అంటూ నవ్వుతూ అలిగిన బిడ్డను బుజ్జగించే తల్లిపలె, చేతులు చాచింది వేంబు.

మాధవరావు శిలాప్రతిమవలె రెప్పవాల్చక ఆమెను అట్టే చూస్తూ ఊరుకున్నాడు.

"ఒక ముద్దిచ్చి మేలుకొలపనా, అయితే?" అంటూ అతని భుజాలచుట్టూ చేతులు పెనవేసింది వేంబు.

"వద్దు వేంబూ!" అంటూ నెమ్మదిగా ఆమె చేతులను దిగజార్చి, "వద్దు, – నీ ముద్దులో మతిని పోగొట్టే విద్యుచ్ఛక్తి ఏదో ఉంది. ఆ శక్తి నెదిరించి తట్టుకోగల మనోధైర్యం నాకు లేదు!... నా ప్రేమ తీవ్రత కొలదీ మొదట నేను తొందరపడి నందుకు క్షమించు! నాలో ఎన్నడూ ఉన్నదని నేను శంకించనైనా లేని ఔన్నత్యాన్ని పైకి తీయగలిగింది నీ ప్రేమ! చీకటిలో ఉండిన నా ఆత్మకు ఇప్పుడు వెలుగు తోచింది. ఇన్నాళ్లూ నిన్నొక సాధారణ మానవ కాంతనుగా, భూలోక వనితనుగా, భావించుకున్నానే గాని, నువ్వొక దేవతామూర్తి వని తెలుసుకోలేక పోయినాను. నీ హృదయంలో నాకు నువ్వు చోటిచ్చినందుకు ఎంతో కృతజ్ఞుడను. నిన్ను నా హృదయపీఠమందు నా హృదయేశ్వరినిగా, నా ప్రేమదేవతనుగా నెలకొల్పుకొని పూజించుకుందుకు మాత్రం అనుజ్ఞ ఇయ్యి!" అన్నాడు మాధవరావు లేచి నిలబడుతూ.

గాలికి కొంచెం మామిడిపువ్వు రాలింది ఆ యిరువురి తలలమీద!



# అంజలి



పుట్టబోయెడి బుల్లి బుజ్జాయికోసమై
పొదుగుగిన్నెకు పాలు పోసి పోసి
కలికి వెన్నెల లూరు చలువదోసిళ్లతో
లతలకు మారాకు లతికి యతికి
పూల కంచాలలో రోలంబములకు రే
పటి భోజనము సిద్ధపరిచి పరిచి
తెలవారకుండ మొగ్గలలోన జొరబడి
వింత వింతల రంగు వేసి వేసి
తీరికే లేని విశ్వసంసారమందు
అలసిపోయితివేమొ దేవాదిదేవ!
ఒక నిమేషము కన్ను మూయుదువుగాని
రమ్ము! తెరచితి మాకుటీరమ్ము తలుపు.

## ౨

కూర్చుండ మా యింట కురిచీలు లేవు — నా
ప్రణయాంకమే సిద్ధపరుపనుంటి
పాద్యంబునకు మాకు పన్నీరు లేదు — నా
కన్నీళ్ళతో కాళ్లు కడుగ నుంటి
పూజకై మావీట పుష్పాలు లేవు — నా
ప్రేమాంజలులె సమర్పింప నుంటి
నైవేద్యమిడ మాకు నారికేళము లేదు
హృదయమే చేతి కందీయనుంటి

లోటురానీయ నున్నంతలోన నీకు
రమ్ము! దయసేయు మంకపీఠమ్ము పైకి
అమృతఝురి చిందు నీ పదాంకముల యందు
కోటిస్వర్గాలు మొలిపించుకొనుచు తండ్రి!

## ౩

లోకాల చీకట్లు పోకార్ప రవిచంద్ర
దీపాలు గగనాన త్రిప్పలేక
జగతిపైఁ బడవచ్చు జలరాశి కెరటాలు
మామూలు మేరకు మడుపలేక
పనిమాలి ప్రతిరోజు ప్రాణికోటుల గుండె
గడియారముల కీలు కదుపలేక
అందాలు చింద నీలాకాశవేదిపై
చుక్కలమ్రుగ్గులు చెక్కలేక

ఎంత శ్రమపడుచుంటివో యేమొ బాబు?
అదు గిడితి వెట్లొ నేడు మా గడపలోన
గుండె కుదిలించి నీముందు కుప్పవోతు
అందుకో వయ్య! ప్రేమ పుష్పాంజలులను.

# ఆరాధనము

క్రొంజిగురాకు వ్రేళుల కురుల్ తడియార్చుచు గూరుచున్న అ
భ్యంజనమంగళాంగి! జడ యల్లుదునా - మకరంద మాధురీ
మంజుల మామక ప్రణయ మానసమే అనురాగ పూర్ణ పు
ష్పాంజలి చేసి వాలుజడపై గయిసేయుదునా కళామయీ!

అంజనరేఖ వాల్గనుల యంచులు దాట ప్రఫుల్ల మల్లికా
కుంజములో సుధామధుర కోమలగీతిక లాలపించు ఓ
కంజదళాక్షి! నీ వలపుగానములో పులకింతునా - మనో
రంజని పుష్పవృష్టి పయి రాల్పుదునా కదిలించి పందిరిన్.

సంజ వెలుంగులో పసిడి చాయల ఖద్దరు చీరె గట్టి నా
రింజకు నీళ్ల పోయు శశిరేఖవె నీవు; సుభద్రసూతినై
రంజిత పాణి పద్మములు రాయుదునా నిను మౌళి దాల్చి మృ
త్యుంజయ మూర్తినై స్మరునితో తొడగొట్టి సవాలు చేతునా.

— జంధ్యాల పాపయ్య శాస్త్రి

# చీకటింట్లో నల్లపిల్లి

## = శ్రీ కృత్తివాస తీర్థులు

### పాత్రలు

విద్యావాచస్పతి— నక్షత్రశాలలో కొంతకాలం పరిశోధకుడు. జర్మన్ విశ్వవిద్యాలయాలలో ద్రవ్యరహస్య పరిశోధనలు చేసినవాడు. ప్రాక్పశ్చిమ తత్త్వములు మంథించినవాడు.

కవి— అతివాస్తవికుడు

పిల్లి— మణిద్వీపంలో మందిరంలో చీకటి గదిలో ఉన్నదనీ, నల్లగా ఉంటుందనీ కళ్ళూ, మీసాలు బంగారు వికారాలనీ జనశ్రుతి. శోధనకు మూలమైనది.

మణికర్ణిక— వాచస్పతి భార్య

విలాసిని— మణిద్వీపవాసిని

మల్లిక, మందార, నీలోత్పల — విలాసిని పుత్రికలు

ఛాయ— వాచస్పతి వైజ్ఞానిక దవ్వుతున్న స్వప్నము ఆశ్రయించి స్నేహం చేసుకొన్న కన్య

ఆశాలత— విద్యావాచస్పతికి ప్రాణసమురాలు

### ౧

సమయము : మసురు పట్టిన వేకువ. డ్రాయింగ్ రూమ్ కిటికీలోంచి మసకగా కొండల అంచులు కనపడతవి. గది గోడలమీద ఇన్‌స్టీన్, మాక్స్ ప్లాంక్, బోర్, ష్రోడింగర్, హైజన్‌బర్గుల తైలవర్ణచిత్రాలుంటవి. కుడివైపు పుస్తకాలబీరువా, ఎడమవైపు అద్దాల బీర్వాలో శోధన నాళికలు, లెన్సులు, మైక్రాస్కోపులు, టెలిస్కోపులూ ఉంటవి. గది మూలస్టాండ్ మీద ఆచార్యశంకరుల బస్టు, ఎడమవైపుమూల ఇమాన్యూల్ కాంట్ బస్టు ఉంటవి. గదిమధ్య పెద్ద టేబులు. సోఫాలో కూర్చుని మోచేతులు బల్లమీద మోపి, అరచేతుల్లో తలపెట్టుకుని అశాంతిలో ఉంటాడు విద్యావాచస్పతి. వయస్సురమారమి 50. తల కొద్దిగా నెరసింది. చెల్లాచెదరై ఉంది జుట్టు. ఆకళ్లు ఆలోచన అశాంతి తెలియచేస్తవి. పొడవైన నల్లకోటు తొడుక్కున్నాడు. సోఫాలోంచి లేచి కాలు కాలిన పిల్లిలా అటూఇటూ తారట్లాడతాడు. కిటికీలోంచి కొండల అంచులు చూస్తాడు. మళ్లీ సోఫాలో కూలబడతాడు. గది మసక మసకగా ఉన్నది.... మారాన్నుంచి సన్నగా పాట వినపస్తుంది. తలెత్తి, చెవులు రిక్కించి వింటాడు వాచస్పతి.

### గానము

తనువే మధురం, తనువే మధురం
తనువే ఈ తనువే, తనువే మధురం

భంగపరుపకో, భాండము
భంగపరుపకో...... తనువే మధురం
శోధనమేలా? తను
శోభనమే వరమూ...తనువే మధురం
చీకటింటిలో
శూన్యశోధనా? తనువే మధురం

= వాచస్పతి =

అబ్బా మనోరంగం రణరంగం. ఇశ్శ్!
(మందారం, నీలోత్పల, మల్లికలు మసకలో కనిపిస్తారు. వాచస్పతి ఉల్లిపడతాడు.)

= వాచస్పతి =

వచ్చారా నా పాలిట యములాళ్ళలాగ!

= మందారం =

పరిశోధనలతో మతిపోగొట్టుకుంటున్నారు.

= నీలోత్పల =

హాయిగా ఎప్పుడూ నా కురుల నీడల్లో మీ కళ్ళకు విశ్రాంతి నీయండి.

= వాచస్పతి =

మీరే నా మనస్సును వికలంచేస్తున్నారు. మీరే అనుకుంటే మిమ్మల్ని మించిపోయింది లత. అంతు లేకుండా కఠోరదీక్షతో నక్షత్రశాలల్లోంచి ఆకాశాంతరాళాలు వెతికినాను. విశ్వకిరణాలఅధిష్ఠానం చూడలేకపోయాను.

(ఆకాశలత ప్రవేశం)

= లత =

పాపం మీ మనస్సును హుషారు చేస్తుంటే వికలపరుస్తున్నానంటారేం.

(ఛాయ ప్రవేశం)

= ఛాయ =

మీరు నన్ను తిట్టినా సరే మిమ్మల్ని అసలే వదలను.

= వాచస్పతి =

విశ్వవిద్యాలయాలలో ద్రవ్యరహస్యా పరిశోధించే రోజులు...అప్పణ్ణించీ నన్నసలే నువ్వు వదలవు. లత మిణుగురుల్ని చూపించి ఏవోఏవో దూరదూరాలు కనబరుస్తుంది. అబ్బా...మీ రందరూ నామనస్సును సమ్మెటల్తో కొడుతున్నారు. అబ్బబ్బా...నాకు ఏతృప్తీ లభించదే! తృప్తి దీపం ఏదీ కనపడనీకుండా మీరు అడ్డు వస్తున్నారు.

ఛాయా! నీ ఆవరణంలో నన్ను ఖైదు చేస్తావా?

= ఛాయ =

మహామహా వాళ్ళకే తప్పలేదు.

= వాచస్పతి =

నామెదడు ఉయ్యాల లూగుతున్నది లతా! నన్నెక్కడికి లాక్కుపోతావు? వది లెయ్యవా నన్ను?

= లత =

నన్ను దూరం చేసి బూడిద పూసుకొని ఏం బావుకు తింటారు సన్యాసులు? నేను లేని మీ జీవితాలు మరుభూములు.

= వాచస్పతి =

నన్ను సన్యాసిని చెయ్యకు.

(నీలోత్పల భయంకరంగా వికరనృత్యం చేసి కురులతో అతన్ని కప్పవేస్తుంది.)

అమ్మో! ఉత్పలా! ఉత్పలా! ఉత్...

భయంకరము లైన వినీలకుంతలాల్లో నన్ను కప్పకు. నాదృష్టికి అడ్డు పెట్టకు. అమ్మో కరాళకుంతలాలు! తిమిరపాశాలు! ప్రతిబంధకాలు!

= మందారం =

నా రక్తిమ చూడండి. చూడండి అరుణ మందార మాలలు. ఎంత బాగుంటాయి! నేను లేనిదే మీకు కల్పనాశక్తి ఎక్కడిది? మీ మనః ప్రవృత్తికి హుషార్ నేను ఇస్తాను. ప్రవృత్తి ముమ్ముందుకు ప్రవహించేలాగ చేస్తాను. నే నన్నా మీకు కోపమేనా?

= వాచస్పతి =

అంతర్వాహిని అయితే మనఃప్రవృత్తి బాగుండి పోతుంది. అబ్బా! అంతా చీకటి!

మంచు తెరలు ! ముసురు ! తృప్తిదీపం కన పడదు, కనపడదు! నేను ఎక్కడికీ పోవడం?

(గిజగిజలాడుతాడు. 'తనువే మధురం' అన్న పాట అందరూ పాడుతారు. అంకాల చప్పుడు చేస్తూ మెల్లగా మసకలో కలిసిపోతారు.)

= వాచస్పతి =

తనువు, పాడుతనువు! ఇదే పాట ! చింతపండు గుల్ల ఎంతో అదృష్టం చేసుకుంది. నేనూ అలా అయితే బాగుండును !

(మణికర్ణిక కాఫీతో ప్రవేశం. అతన్ని చూసి కలవల పాటు)

= మణికర్ణిక =

ఏ మండోయ్ !

= వాచస్పతి =

(కళ్లు తెరిచి ఖంగారుగా లేచి సోఫా చేతిమీద కూర్చుంటాడు)

ఆఁ ఏమి టంటావ్ ? ఎప్పుడు వచ్చావ్ ?

= భార్య =

చప్పున కాఫీ తాగండి చల్లారి పోతుంది. ...అవును గాని మీ ధోరణి నాకు అర్థం కాదు. ఆరోజు కారోజుకు ఇలా అయి పోతున్నారేం ?

= వాచస్పతి =

నా తత్త్వం ఫిరాయించ బోతున్నది.

= భార్య =

ముందు కాఫీ పీల్చండి, వేడి చల్లారుతుంది.

= వాచస్పతి =

ఈ డికాక్షన్ పాలతో తాదాత్మ్యసిద్ధి అయింది. భేదాభేద మేనా?

= భార్య =

వల్లకాటి సిద్ధి! పిచ్చి బాగా ముదిరి పోతున్నది. నక్షత్ర పరిశోధనతో ఇల్లూ వాకిలీ అక్కర్లేకుండా నే నసలే అక్కర్లేకుండా, ఉన్నారు. కూటికీ గుడ్డకూ పనికిరాని పని. దమ్మిడీ ఆదా లేదు, క్షణం తీరుబాటు లేదు మీకు.

= వాచస్పతి =

చచ్చు ఆదా! చచ్చు కూడూగుడ్డా! దమ్మిడీ ప్రశంస తీసుకు రాకు నాదగ్గిర. పెళ్లాం గదా అని మెళ్ళో కట్టుకుని తిరగ మంటావా? నిన్ను చూస్తూ గోళ్ళు గిల్లుకుంటూ కూచో మని సెలవా ?

= భార్య =

హా య్యో రాత ! ఓ ముద్దూ ముచ్చటా ఏమీ లేవు ఈ జన్మకు!

(కళ్ళు వొత్తుకుంటూ)

= వాచస్పతి =

వెనక వాచస్పతిమిశ్రులు భాష్యరచన చేసి భార్యపేరు పెట్టాడు 'భామతి' అని. నా ఖగోళ పరిశోధనలో గోచరించిన నూతన గ్రహానికి నీపేరే పెడతాను. నీపేరు శాశ్వతంగా ఉంటుంది. లేకపోతే నా పాలిట శక్తివి గనుక నీకు 'క్వాంటం' అని పేరెట్టనా ?

= భార్య =

ఎంతసేపూ అందని దానికి అర్రులు సాచడం, నేల విడిచిన సాములూ మీ పండితులకు అల వాటు. నా కే పేరూ ప్రతిష్ఠలూ అక్కర్లేదు. చాలు, మీ భార్యనై సుఖపడుతున్నాను!

(పెదవి విరుపు)

= వాచస్పతి =

ఇలా చూడు! మణి ద్వీపం వెళ్ళి పిల్లి పరిశోధనంచేసి, పి. హెచ్. డి. సంపాయించు కొంటే ఎంతయినా సుఖం మనకు వస్తుంది. ఉన్నత శిఖరం అందుకోవాలి కద.

= భార్య =

పునాది లేని శిఖరాల్లో మీ కాపరం ఎంతసేపూ! పిల్లిని పరిశోధించడం తరవాయి కామోసు! ఎందు కిలా జీవితం పాడుచేసు కుంటారండీ?

= వాచస్పతి =

ఎంతసేపూ నేలమీద పాకాడతా నంటావు. ఈ గొంగళిపురుగు లాటి జీవితాలు చూస్తుంటే నాకు రోత.

= భార్య =

అందుకే ఆకాశాన్ని అంటిపెట్టుకునే సరికి మనోరోగంతో పాటు మీకు నేత్రరోగం కూడా వచ్చింది.

= వాచస్పతి =

అదోటి తెచ్చిపెట్టకు. నీ పుణ్యమా అని! నీ కిలా చులకనగా కనిపిస్తాను నా ఖర్మం! నా శాస్త్రజ్ఞానం చూసి నన్నంతా నెత్తిని పెట్టుకుంటారు. తార్కిక కేసరి పండిత సభలో నాకు బ్రహ్మరథం పట్టాడు. పరమాణు రహస్యం, ఖగోళమర్మం నేను చెప్పేదాకా జనానికి తెలియదు.

= భార్య =

వాచస్పతిగారి భార్య నని ఇంటింటా హోరెత్తమన్నారా?

= వాచస్పతి =

నాపాండిత్యం నీకు అక్కర్లేదూ?

= భార్య =

ఉహుఁ. మీరే కావాలి!

= వాచస్పతి =

నాకు మనోరోగం ఉన్నదంటావేం?

= భార్య =

ఉండడ మేమిటి, ప్రత్యక్షంగా కనపడు తుంటేనే?

= వాచస్పతి =

అసంతృప్తి ఎక్కువైంది. బంగారు మీసాలతో, బంగారు కళ్ళతో, ఆకాశవర్ణంతో ఆ దివ్యమైన పిల్లి నాకు కావాలి. 'మణిద్వీపే నీపోపవనే వసతి చింతామణిగృహే' అన్నట్టు ఆ చింతామణి సదనంలో పిల్లిని పట్టి తీసుకు రావాలి. అంతవరకూ నాకు తృప్తి లేదు.

= భార్య =

ఇంత పిచ్చి ముదిరిం దేమండీ ఇంతా చదివీ.

= వాచస్పతి =

వొట్టి చదువు దండగ! అనుభవం కావాలి. నాపిల్లి ఎంత సూక్ష్మాతిసూక్ష్మ మనుకున్నావ్! పారిమాండల్యంకన్న సూక్ష్మం! పూర్వం మేము నెలిగించిన చదువూ, గ్రంథాలూ చర్మచక్షువులతో......

(ఆర్తోక్తిలో భార్య అడ్డుపడి)

= భార్య =

బాబోయ్! మీధోరణి అర్థం కాదు. పొయ్యి మండి పోతున్నది.

= వాచస్పతి =

అప్పుడే వంటా... ఆకలి!

= భార్య =

ఈలోకంలో వాళ్ళం. మాకు ఆకలి ఉంటుంది.

= వాచస్పతి =

నాకూ ఉంది ఆకలి. నామెదడు ఆవురు మంటున్నది. పిల్లిని పట్టి తెచ్చేదాకా ఈ క్షుత్తు తీరదు.

= భార్య =

పొయ్యి మండిపోతుం దేమో?

(విసుగు, నిష్క్రమణ)

[ ౨ ]

= వాచస్పతి =

ఈ శక్తిని వదుల్చుకున్నాను.

పిల్లి నాకు లభించే దాకా తృప్తి లేదు. పుస్తకాలు చదవడంతో మెదడు కసుడు కట్టింది. మణిద్వీపవాసినీ! మార్జాలమా! నువ్వు అప్రమేయమా? నేను నువ్వు అవు తాను. నేనూ పిల్లిని కావాలి! అన్నట్టు జ్ఞాపక మొచ్చింది— ఆశాలత మణిద్వీపానికి తోవ చూపిస్తుంది.

(ప్రవేశం లత)

= ఆశాలత =

విద్యావాచస్పతీ ! కళ్ళు తెరు.

= వాచస్పతి =

వచ్చావా !

= లత =

మన ప్రయాణం మాట ఏమిటి ?

= వాచస్పతి =

నువ్వు తల్చుకుంటే సప్తసముద్రాలు దాట వచ్చును.

= లత =

ఈ సాయంత్రం మన యాత్రారంభం.

= వాచస్పతి =

లతా ! ఎన్ని అవరోధా లున్నా నన్ను మణి ద్వీపానికి తీసుకు పోవాలి.

= లత =

మిణుగురులతో ఆడుతూ పాడుతూ యాత్ర నీచేత చేయిస్తాను. ఛాయ నీమనస్సు బాధ స్తున్న ట్టున్నది.

= వాచస్పతి =

అవును. మణిద్వీపంచుట్టూ నాగకన్య లుంటా రట.

= లత =

ఎవ రున్నా మనకు అడ్డు రారు.

= వాచస్పతి =

ఈ ఛాయ నన్ను వెంటాడుతూన్నప్పట్నుంచీ నా మనస్సుకు స్తిమితం లేదు. మార్జాలం కోసం ప్రయాణం మానివేయ మన్నది ఛాయ.

= లత =

సమస్తం తృణప్రాయం. మార్జాలం మన పరం కాక తప్పదు.

= వాచస్పతి =

మల్లికా, మందారం, నీలోత్పల ఎక్కడికి పోతే అక్కడ సిద్ధం. మణిద్వీపంలో బాధం చకుగద !

= లత =

ఆ ముగ్గురూ లేని జగత్తే లేదు. ఆ అమ్మా యిల తల్లి మణిద్వీపంలో ఉంటుంది. ఆమెను విలాసిని అంటారు. విలాసినివలలో కైపులో పడకుండా ఉండాలి.

= వాచస్పతి =

పడను. విలాసిని నాకు తృణప్రాయం.

= లత =

అలా అనకండి. ఎంతోమంది యాత్రికులు వచ్చిన పని మరిచిపోయి విలాసినీ సౌందర్య రసప్రవాహంలో తల మునకలైనారు. బయలుదేరిన చోటికి వచ్చి చేరారు. అయినా నే నుండగా ఏమీ ఫరవా లేదు వాచస్పతీ!

= వాచస్పతి =

ఆ దివ్యమార్జాలం గోచరించేదాకా ఎంతయినా కష్టనిష్ఠురాలు సహిస్తాను. సాయంకాలం ప్రయాణానికి సిద్ధపడాలి.

(ఆశాలత. నిష్క్రమిస్తుంది. ప్రవేశం ఛాయ)

అబ్బ! వచ్చావా ఛాయా!

యాత్రికులు ఎంతమందో నాబంధం తెంచుకో లేకపోయారు.

= వాచస్పతి =

మణిద్వీపానికి సాయంత్రం యాత్ర.

= ఛాయ =

మణిసదనంలో మా అక్క విలాసిని ఉన్నది. నీలోత్పల భయంకరములైన కుంతలాలతో నిన్ను బంధించేస్తుంది. నీకళ్ళు ఆ నీడలో మసక లవుతాయి. పిల్లి ఎలా కనిపిస్తుంది? నేను ఎలాగో మీ వెంట పడతానుగదా. మా అక్క మహా అందగత్తె. ఆ సౌందర్య లహరిలో మీ మనస్సు కల్లోలమై, ఆమె వశ మవుతుంది. వెళ్ళకండి, వెళ్ళకండి.

= వాచస్పతి =

లత నన్ను ముందుకు లాక్కు పోతుంది. ఇశ్శ్! నువ్వు చూడబోతే వెనక్కు లాగుతావు. ఎలా గబ్బా!

= ఛాయ =

తనువే మధురం అన్న మా గానం వినలేదూ?

= వాచస్పతి =

విన లేదు: నా మెదడు ఉయ్యాల లూగుతున్నది. ఈ ప్రపంచం, కాలం గిర్రుగిర్రున తిరుగు తున్నయి. తృప్తిలేదు బాబోయ్. తనువుమాట చెప్పకు ఛాయా! సూర్యుడు వెలిగినా నాకు కనబడదు. అంతా మసక. నీడలు! నీడలు! ఉయ్యాల ఊపులు! ఇశ్!

= ఛాయ =

నీయాత్రలో నిన్ను వెంటాడక తప్పదు.

= వాచస్పతి =

యాత్రలో ఏహిమసదంలో నయినా నీ కాలు జారితే నేను అదృష్టవంతుణ్ణి!

= ఛాయ =

ఆశాలత ఏకొండమీదనుంచో పడిపోతే వాచస్పతి యాత్రసంగతి వేరే చెప్పాలా?

('తనువే మధురం' పాడుతూ నిష్క్రమణ.)

## [3]

స్థలం : వంటిల్లు, భార్య, విద్యావాచస్పతి.

= వాచస్పతి =

పాకశాసనీ, వం టయిందా?

= భార్య =

ఆహాఁ.

(పోష్టుబంట్రోతు ఉత్తరం తెచ్చిన కేక. ఉత్తరం తెచ్చి మణికర్ణికకు ఇస్తాడు)

= వాచస్పతి =

అల్లుడు రాశాడు కాదూ?

= భార్య =

హాయ్యో! అమ్మాయికి జబ్బు, రెండులంఖణాలు! (కళ్ళు వొత్తుకుని)

= వాచస్పతి =

విశ్వాసినికి రెండులంఖణాలా! కొంచెం సుస్తీ. అల్లుడు ఖంగారుకొద్దీ రాశాడు.

= భార్య =

పిల్లిగొడవలో మీకు మీ విశ్వాసినిమీద అనురాగం ఉంటేగద? ఇల్లూ వాకిలీ అక్కర్లేదు.

= వాచస్పతి =

ఇల్లు చెరసాల. ఈ ఖైదు వదిలిపోతేగాని దివ్య మార్జాలం దొరకదు. విశ్వాసినిని ఇప్పుడు నేను చూడను. నాపాతశిష్యుణ్ణి కూడా తీసికొని వెళ్ళు, అమ్మాయిని చూడాలంటే.

= భార్య =

మీరోసారి కుర్రదాన్ని చూడాలి. రాలేదని అఘోరిస్తుంది.

= వాచస్పతి =

ఈ యాత్ర ముగిసేదాకా విశ్వాసినిసంగతి చెప్పకు. అసలే తేనేతుట్టెలా వుంది నా మెదడు.

= భార్య =

యాత్ర చేసి పిల్లిని చంక నెట్టుకు రండి.

= వాచస్పతి =

ఎంతమాట అన్నావు? మనమంతా ఆ మార్జాలస్వరూపం కావాలి.

= భార్య =

నీకి రక్కుతుంది ఆ మార్జాలం.

ఎందుకే భయం? 'న బిభేతి కుతశ్చన'. ఉపనిషత్తులు అఘోరిస్తున్నాయి.

= భార్య =

పిల్లి మీకెక్కువ, పిల్ల నాకెక్కువ.

= వాచస్పతి =

నువ్వు దారవు కాదు, శిరస్తదార.

= భార్య =

మీకు ఈశ్వరత్వం పడితే శిరస్తదారనే కద.

= వాచస్పతి =

అన్నీ పడతాయి క్రమసాధనవల్ల. అదివరకే నా నెత్తి నెక్కి కూర్చున్నావు. గట్టిగా మాట్లాడితే నువ్వెవరవు? నేనెవర్ని?

= భార్య =

ఓహోహో! పాకం ముదురుతున్నది.

= వాచస్పతి =

సముద్రంలో ఉప్పుకూ ఉసిరికాయకూ ఎక్కడి కూడిక! మహాప్రవాహంలో రెండు గడ్డిపోచలం ఎలాగో కలుసుకుని కొట్టుకుపోతున్నాం.

= భార్య =

మహా బాగుంది ఉసిరిపచ్చడి దాంపత్యం!

[౪]

సమయం: సాయంకాలం: చీకటి: మసకలో సన్నని తోవ. కీచురాళ్లు సంగీతం పాడుతున్నాయి. ఆశాలత ముందు నడుస్తున్నది. వెనకాలే వొంగి వాచస్పతి నడుస్తున్నాడు. లత వొంటిమీద

మిణుగురులు తళతళలాడుతూ మెరుస్తున్నాయి. మంచు కురుస్తూండడంవల్ల, రొజ్జగాలి మూలాన ఇద్దరూ వణుకుతున్నారు. కొంతసేపు గంభీరమైన నిశ్శబ్దం.

= ఆశాలత =

ఈ పెనుచీకటి కవతలవొడ్డు చేరుకోవాలి.

= వాచస్పతి =

తోవ తిన్నగా వుంటుందా?

= లత =

ఈ తోవ బాగుంటుంది.

= వాచస్పతి = (లతను ఆపి)

చూడు చూడు. కనపడ్డంలేదూ మరోతోవ?

= లత =

మణిద్వీపానికి చాలా తోవ లున్నాయి. తోవలన్నీ ఒకేచోట కలుస్తాయి.

= వాచస్పతి =

ఛాయ నన్ను వెంటాడితే నన్ను ముళ్ళ దారిలో నెట్టేస్తుంది.

= లత =

ఛాయ మాట తలపెట్టకు. అదుగో ఎవరో వస్తున్నారు.

= వాచస్పతి =

ఎవరో వస్తున్నారు వెళ్ళినతోవనే.

= లత =

ఎవరా వచ్చేవారు?

= వ్యక్తి =

పోయిన దారినే తిరిగి వచ్చేస్తున్నాను. ఈ యాత్రలో ముళ్ళు గీసుకున్నాయి.

= వాచస్పతి =

మణిద్వీపంలోకి వెళ్ళలేదూ?

= వ్యక్తి =

ఒడ్డుదాకా వెళ్ళి ఏమీ కనపడక తిరిగి వస్తున్నాను. కంచు గొడ్డళ్ళతో సాలిగూళ్ళు యుగయుగాల తరతరాల ఛాందస నిర్మితి పగల గొట్టేస్తున్నాం. మా యువకులం సిద్ధం. అంతా వ్యాప్తి ఆకాశం.

= వాచస్పతి =

ఎవరు మీరు?

= వ్యక్తి =

నేను కవిని, వాస్తవికుణ్ణి. అంతా నగ్నంగా చూస్తున్నాను.

= లత =

మీతో లాభం లేదు. మీ తోవన వెళ్ళండి.

= వాచస్పతి =

జయ్ మణిద్వీపవాసినీ! బిసతంతు తనీయసీ! ఆవాస్తవిక కవికి పిల్లెందుకు? సుధామధుర మైన ఆమ్యాన్ స్వరం అప్రణవం ఆయన వింటే అలా ఎందు కంటాడు?

= లత =

తిరుగుబాటు తత్త్వం అలాగే వుంటుంది.

= వాచస్పతి =

ఎలక్ట్రాన్ స్వరూపిణీ! ఓహో! హో! ఎప్పుడు నాకు లభిస్తావో!

= లత =

దారి తిన్నగా చూసుకోండి.

= వాచస్పతి =

కాటుకలా, 'నీలోత్పల' కరాళకుంతలాలవలె వున్న ఈచీకటి రెప్పలు మెల్ల మెల్లన విచ్చు తున్నాయి తెల్లతెల్లగా.

= లత =

మణిద్వీపం కొద్దిదూరంలో వుంటుంది.

నాగకన్యల శిరోమణుల కోసం మురిసి పోకూడదు.

= వాచస్పతి =

తృణప్రాయం!

= లత =

తోవలో హిమనదాలూ, పర్వతములూ, అడ్డువస్తాయి, దాటిపోదాం. మనకు లెక్కా?

= వాచస్పతి =

పాదాలు గీసుకు పోతున్నాయి. అబ్బా! అమ్మా! ముళ్ళు! ముళ్ళు! ఇశ్శ్! యాత్రికుల పాదాలు ఎన్ని రక్తసిక్తాలయినాయో! నడవలేను.

= లత =

నా చెయ్యి పట్టుకో. యాత్రాపథం అంతా పూలబాట కాదు. కరుకురాళ్ళూ కంటకాలూ వుంటాయి.

= వాచస్పతి =

నడవలేను.

= లత =

ఏమిటీ క్లైబ్యం?

= వాచస్పతి =

ఇశ్! దుర్గం పథం తత్ కవయో వదన్తి.

= లత =

అన్నీ చదివారు. ఓర్పుతో సాధించాలి.

(ప్రవేశం ఛాయ పాడుతూ)

= ఛాయ =

ఆగుమోయి తెరువరీ!
ఆగుమోయి తెరువరీ!
కరుకురాలు కంటకాలు
కత్తిమీద సామదేల? ..ఆగు..
కలల బ్రతుకు నిష్ఫలమ్ము
కాంచదేల శూన్యమ్మును? ..ఆగు..

= వాచస్పతి =

బాబోయ్ ఛాయాదేవి!

= ఛాయ =

దీపానికి ఛాయ ఉంటుంది పక్కనే. మసక దీపానికి ఛాయ ఎక్కువ. అదుగో, తెల్లవారుతున్నది. కొండమీద హిమసదం కరిగి పెరుగులా వుంది.

= వాచస్పతి =

బాబోయ్ కాలుజారి పడిపోతానేమో లతా, నన్ను పట్టుకో. ఈ ఛాయ నన్ను హిమసదంలోకి లాగివేస్తుంది.

(హోరున ఈదరు గాలి. హిమనదం రాళ్ళను పగిలి ప్రవహిస్తుంటే హోరు.)

పదండి. ఏం ఫర్వా లేదు.

= వాచస్పతి =

అమ్మో హిమసదం! అబ్బా కాళ్ళు చలికి మండుతున్నాయి. వుండుంగాటి చలి. ఏమిటా హోరు!

= లత =

పర్వతం మీద గాలి హోరు. గిరి కందరాలు ఘోషిస్తున్నాయి. నాగాను, గోధుమ వన్నె తాచుల్లా కరిగీకరగని మంచు వంకర వంకరలై ప్రవహిస్తున్నది. చలికి లెక్క చెయ్యకు.

= ఛాయ =

యాత్ర మానెయ్యి.

= లత =

ఛాయ మాట వినకు. ఛాయాదేవి ఆవరణల్లో వుంటే నీకే మ్యావ్ వినవస్తుంది. ఏ పిలుపు వినిపిస్తుంది?

= వాచస్పతి = (వినడు)

అబ్బా చలి! కాళ్ళు మంచుతున్నాయి. తుపానులా హోరు! ఈ యాత్ర ఎలా ముగుస్తుందో!

(వాయు నీహారంలో కలిసి తారాడుతూ వుంది.)

[౫]

- వాచస్పతి -

కూడా వుండు లతా! ముందుకు నన్ను వదలి పోకు.

= ఆశాలత =

కూడానే వున్నాను. ఉషస్సు చూడు. నీహారంలో తడిసిన గులాబిలా వుంది ఉషస్సు.

- వాచస్పతి -

(కేక వేస్తాడు 'మొసళ్లు')

కళ్ళు చెదరి పోతున్నాయి. బాబోయ్ మొసళ్ళు!

- ఆశాలత -

ఏమి టీ వెర్రి భయాలు! ఈ నీళ్ళల్లో మొసళ్ళుండవు. త్వరగా ఈదండి, అలల్ని గెంటేయండి.

- వాచస్పతి -

అదుగో నాగకన్యలు! ఇంద్రనీల మణుల కుప్పల్లా అనంతాంధకారంలా ఆ కురులు తేల్తున్నాయి. ఓహో! అవి బంగారు కలశాలే!

= లత =

ఆఁ మరచి పోయేలా వున్నారు వచ్చినపని?

— వాచస్పతి —

శిరోమణి దీప్తులు. కళ్ళు మిరుమిట్లు!

= లత =

ద్వీపం దగ్గిరే వున్నాం!

= వాచస్పతి =

ఇదంతా లాక్షారుణ ప్రవాహంగా వుంది.

= లత =

విలాసినీ సౌందర్య లహరీ కల్లోలం!

= వాచస్పతి =

ఓహోహో! ఆ నూపురాల సంగీతం!

= లత =

దేవీ చరణ రణిత మణినూపురగానం!

= వాచస్పతి =

ఓహోహో! హ్వా హ్వా హ్వా! యౌవనవనసారంగి! సౌందర్యానంద సంపదున్మేష! మహా హ్వా! ఆసవా ఘూర్ణిత నేత్ర శోభ! విస్మితాస్యం! తాటంకదీప్తి! కుచోన్నతాల కుంకుమరాగ శోణిమ! గళద్వేణీబంధా! హ్వా! హ్వా! కనకకదళీ స్తంభాలు! ఓహో! శ్రుతిసీమంత సిందూరీ కృతపాదాబ్జ ధూళి!

= లత =

మరిచిపోతున్నావు! జాగ్రత! విలాసిని కుమారికలు మూడురంగుల వల పట్టుకుని ఎదురుచూస్తున్నారు.

= వాచస్పతి =

(తెప్పరిల్లి)

పిల్లని మరిచిపోలేదు!......

(ద్వీపం చేరడంతోనే మల్లికా మందార నీలోత్పలాలు మూడురంగుల వల వాచస్పతి లతల మీద విసరుతారు. చేపల్లా ఇద్దరూ చిక్కుకుని గిలగిల లాడతారు. కన్యాత్రయం పకపకనవ్వు).

= కన్యాత్రయం =

(మల్లిక : మందారం : నీలోత్పల)

: స్వరమేళ :

గుణవాగురలో

కూలెను మీనము

రెంటికి చెడినా
రేవడి తెరువరి!

[౬]

మణిద్వీపంలో ఒకగది: చీకటి. పెద్దవలలో గిజగిజ తన్నుకుంటున్న ఆశాలత వాచస్పతి.

= వాచస్పతి =

అబ్బ! అబ్బ! ఈతాళ్ళు నాపాలిట ఉరితాళ్ళు!

(గట్టిగా తన్నుకుంటాడు. గది అవతల పకపక నవ్వు)

ఎంతమాయలాడివి విలాసినీ! ఉహూ తెగవు తాళ్ళు.

(ఆశాలత తాళ్ళు తెంపుకుంటుంది.)

= లత =

అమ్మయ్య! ఈ నల్లతాడు ఇంకా తెగదు.

(కాలికింద వలతాడు నొక్కిపెట్టి లాగుతుంది. తాడు తెగిపోతుంది. మూరంగా లత పడుతుంది. ముఖాన దెబ్బ. రక్తం. వలలోంచి వాచస్పతి బయటకు వచ్చి ఆశాలతనుమట కట్టు కడతాడు.)

= వాచస్పతి =

అయ్యో! లతా!

(గదిఅవతల నవ్వు)

నవ్వండి! మీ ఇష్టం వచ్చినట్టు, దిక్కులు పగిలేట్టు నవ్వండి. (క్షణం ఆగి) నామార్జాలం! అందాల పిల్లి! ఏది? (చీకటిలో తిరుగుతాడు) అయ్యో! ఇవిగో మిలమిల్లాడే బంగారు కళ్ళు! (పరుగెడతాడు) అయ్యో! మిణుగురుల మెరుపులు! కాదు కాదు నీవార శూకవత్ తన్వీ పీతాభా స్వస్త్యణూపమా! ఏవీ హిరణ్మయ శ్మశ్రువులు? ఛీ! నానెరిసిన మీసా లట్టుకున్నాను!

(గది వెనకనుంచి విలాసిని నవ్వు)

నువ్వు మాయలాడివి విలాసినీ!

రసోవై సః। స మార్జాలః।రసగ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీభవతి। మార్జాలమా! నువ్వు అప్రమేయమా? ఎలక్ట్రాన్ స్వరూపమా? పారిమాండల్యమా? ఉహూ. ఇదిగో నువ్వు? తస్యప్రియ మేవ శిరః। మోదో దక్షిణః పక్షః। ఆనందాత్మా। బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా! ఇదిగో నీతోక!

(పట్టుకోనబోయి దొరకక కిందపడతాడు వాచస్పతి. విలాసిని గది అవతల నవ్వు)

= విలాసిని =

(తెరలోనుంచి)

పాపం, తోకయినా దొరక లేదు!
తోకయినా దొరక లేదు!

= వాచస్పతి =

ఓ జవాబియ్యని శూన్యమా! ఆకాశ సముద్రతరంగమా! అనిర్దేశ్యమార్జాలమా! అందుకే హైజన్‌బర్గ్ మొత్తుకుని నిన్ను అనిర్దేశ్య మన్నాడు ఏదీ మిగలక.

= విలాసిని =

ఎలకల్ని వదిలితే పిల్లి దొరుకుతుంది.

(నవ్వు)

= వాచస్పతి =

అయ్యో నీమ్యావ్! నీ ప్రణవం! వినపడదే

= విలాసిని =

(తెరలోంచి)

మ్యావ్! మ్యావ్!

(తెరలోంచి పిల్లిలా అరుస్తుంది)

= వాచస్పతి =

ఇదుగో నీవాణి! నీ అమృతవాణి!

(పరిగెడతాడు, గోడ తగిలి పడతాడు)

పా ట

ఎవరనీ నిర్ణయించేదిరా?
ఎట్లా దర్శించేదిరా?
పిల్లివో పసిడిపిల్లివో యేమొ!
వివరమూ తెలిసినా విడులకూ మ్రొక్కెద!

(దుఃఖిస్తూ) జవాబియ్యాని శూన్యమా!
ఓవిలాసినీ, నువ్వూ నీముగ్గురు కుమార్తెలూ
ఈ సుడిలో వడివడిగా తల ముక్కలు
వేయించారు-

= లత =

పదండి కొంపకు. పాపం మీ అమ్మాయి
విశ్వాసినిజబ్బు నయమయిందో లేదో?
వెళ్ళి చూడకపోనా చూశారు కాదు. శరీ
రాన్ని తిట్టడంతో సరిపోయింది.

= వాచస్పతి =

బయలుదేరిన చోటికే వచ్చిచేరాం.

(ఛాయ ప్రవేశం)

= ఛాయ =

నీతోకూడా ఉండనే ఉన్నాను. మల్లికా
మందారం, ఉత్పలా విసిరిన రంగులవల
గుర్తులు ఇంకా నీ వంటినే ఉన్నాయి.

= లత =

ఆముగ్గుర కన్యల్నీ వదల్చుకోడం తరమా!
సరే, నీమాట చెప్పనే అక్కర్లేదు.

వ్యాఖ్య :

౧. "తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయాత్
అన్యోంతరాత్మానంద మయః
తస్య ప్రియమేవ శిరః ।
మోదో దక్షిణః పక్షః ప్రమోదో త్తరః
పక్షః, ఆనందాత్మా, బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా'
—తైత్తిరీయము ii-౫ ఆనందవల్లి

౨. 'రసోవై సః రసహ్యేవాయం లబ్ధ్వానందీ భవతి'
—తైత్తిరీయము ii-౭

౩. నీవారశూకవ త్తన్వీ పీతాభాస్వ త్యణూపమా'
—పురుషసూక్తము.

౪. 'ఎవరనీ నిర్ణయించేదిరా! త్యాగయ్య కృతిని
మార్పులు చేసుకున్నాను, నా అవసరాన్ననుసరించి.

౫. ఆకాశ సముద్రతరంగమా! విద్యావాచస్పతి
చేసిన సంబోధన వాచస్పతి ద్రవ్య పరిశోధకుడు
కావడంవల్ల స్రోడింగరు పండితుని 'Waves of
probability' సూచన చేశాడు. ద్రవ్యంలోని
ద్రవ్యత్వం పోగొట్టినవాడు.

౬. 'అనిర్దేశ్యమాత్రాలక్ష్యరూపమా'!— 'అనిర్దేశ్య
సిద్ధాంతం' ద్రవ్యశోధకుడూ పండితుడూ అయిన
హైజన్‌బర్గ్ ప్రతిపాదించినాడు. Indeterminism అంటారు పరిభాషలో. ఈ సిద్ధాంతంవల్ల
భౌతికానికీ ఆధ్యాత్మికానికీ భేదం తొలిగిపోయింది.

౭. 'బిసతంతు తనీయసీ'—లలితా సహస్రనామా
వళి. విపులమైన సమీక్ష నేను చేయక వది
లేస్తున్నాను.

౮. విశ్వకిరణాల అధిష్ఠానం :
—Source of Cosmic Rays

# చిరంజీవి పాటలు

## ౧

నా గొంతులో పాట ఆగిపోయింది
నీకోస మీ రేయి నిలిచిపోయింది.

నేను చీకటితోటి చీకట్లు నాతోటి
చేరి నీ మాటలే చెప్పుకొన్నాము....

ఈ పాట నీకోస మెన్నొ జన్మాలుగా
పాడుతా ననుకొంటి పాడలేకుంటి....

పాటతో ప్రాణాలు ప్రాణాలతో పాట
కూడి గొంతౌకమాటె వీడునో యేమొ....

## ౨

నన్ను నడిపించోయి నన్ను నడిపించు.
నాచేయి నీచేతిలో చేర్చినానోయి
నన్ను నడిపించోయి నన్ను నడిపించు.
ఎన్ని వుంటే నేమి కన్నులే లేవాయె
నన్ను నడిపించోయి నన్ను నడిపించు,
ఇచ్చటనె నీ కోస మెదుట వేస్తున్నాను
నన్ను నడిపించోయి నన్ను నడిపించు.

## ౩

పట్టుకో చెలికాడ పట్టుకోవోయి !
నిలువలేకున్నాను నేను పడుతున్నాను
పట్టుకో చెలికాడ పట్టుకోవోయి !
ఈ కొండమెట్లన్ని ఎక్కివచ్చా నెట్లొ
పట్టుకో చెలికాడ పట్టుకోవోయి !
నీమీదె ప్రాణాలు నిల్పుకున్నానోయి
పట్టుకో చెలికాడ పట్టుకోవోయి !

## ౪

పాడకుండా యింక బ్రతుకలేనేమో !
ఏనాటి కానాడు ఇక పాడ ననుకొందు
కాని పాటలె నాకు ప్రాణ మైపోయెనే
పాడకుండా యింక బ్రతుకలేనేమో !
పాటలే అన్నాలు పాటలే నీళ్లుగా
పాటతోనే బ్రతుకు పయనాలు చేసెనే
పాడకుండా యింక బ్రతుకలేనేమో !
పాడుమని వీ రెల్ల బ్రతిమాలుతున్నారు
పాటలో నీ పేరు పలుక సిగ్గేయునే
పాడకుండా ఇంక బ్రతుకలేనేమో !

## ౫

బ్రతిమాలుతా నొక్కపరి వచ్చి పోవోయ్ !
ప్రియసఖా అని నిన్ను పిలిచాను పిలిచాను
గొంతెండి ప్రాణాలు కొట్టుకొన్నాయి
బ్రతిమాలుతా నొక్క పరివచ్చి పోవోయ్!
బ్రతికినన్నిదినాలు పలుకకుంటే మానె
ప్రాణాలు పోయాక నైనా పలుకరించు
బ్రతిమాలుతా నొక్కపరి వచ్చి పోవోయ్ !

## ౬

ఎవ్వరోనే ఇతడు ఎవ్వరో నమ్మ!
మాయింటిముందటే మసలుతున్నాడు.
దొంగలాగా తాను తొంగిచూస్తున్నాడు
గాలిలా తనచూపు క్రమ్ముతున్నది నన్ను....
తలుపు వేస్తేవచ్చి తడుతా డెందుకో
మరలి పొమ్మన నోటమాట రాకుందితల్లి!

## ౭

చెప్పలేదని నన్ను దెప్పబోయేవు
పలుకకున్నా నిన్ను పిలిచి చెప్పాను.
నాతోటి వుంద చిన్నతనమైతే నీకు
ఇచ్చటికి న న్నేల తెచ్చివుంచావో.
వాకిళ్లు తెరుచుకొని నాకళ్లు విప్పుకొని
రేయింబవళ్లు నిరీక్షించలేను.
నను చూచి నిను చూచి మనఇంటిబాటనే
మసలే జనులు గుసగుసలు పోతున్నారు.

## ౮

సిగ్గుబిడియము లేక చెప్పుకొన్నానే
నావంకనే చూచి నవ్వుతున్నావే.
అందర్ని విడిచి రమ్మన్నావు కాదా
వచ్చాక వొంటిగా పారిపోతావా.
ఏ దారి వెంట నీ వేగినావో నే
ఈ బాట రెండుగా ఇచట చీలిందే.
మోసగాడా వెన్కముందెన్నే తెలియనీ
అడవిలోపల నన్ను విడచి పోయావే.

## ౯

కోమటీ కోమటీ కొంటావటోయ్ నన్ను
చౌకగా వున్నాను చప్పున కొనుక్కో.
నీదగా మాన్కెతోనే కొలుచుకోలే
నీదగా రాళ్లతోనే తూచుకోలే.
నీ ఇష్టమెంతో అంతే ఇచ్చికొను లే
బేరమాడే పొద్దు తీరిపోయెనులే.
బేరగాడా ఒక్కటే రహస్యమ్మోయ్
నను విల్వవుంచితే పనికిరానేమో.

## ౧౦

తొండ రెందుకు తోటమాలీ?
ఇందుకా గొడ్డలిని తెచ్చావ్?
నిమ్మమొక్కవి నీళ్లు పోస్తే
తుమ్మనైనా సరియు నిజమే.
నీరు పోయ ననిష్టమైతే
నేనె గాలికి పెరుగుతాలే."
పెరిగి పెరిగీ ఎండి మోళ్లైై
వారిగెదను నీ కాళమీదే.

## ౧౧

ఓహోం ఓహోం ఓహోం ఓహోం
మేనాలో ఓరాణీనివి
బాణా లెక్కడో చెప్పమ్మా
ఓహోం ఓహోం ఓహోం ఓహోం
బోయలమైనా యుగయుగాలుగా
మోయ జాలమమ్మా తల్లీ
ఓహోం ఓహోం ఓహోం ఓహోం
చల్‌చల్ చల్‌చల్ చల్‌చల్ చల్‌చల్
సారధి ఈరథమే రాజిల్లు
చేరాలోనే చెప్పయ్యా
చల్‌చల్ చల్‌చల్ చల్‌చల్ చల్‌చల్
హయాల మైనా అనంతకాల
ప్రయాణక్లేశం పడలేమయ్యా
చల్‌చల్ చల్‌చల్ చల్‌చల్ చల్‌చల్
జుంజుం జుంజుం జుంజుం జుంజుం
మబ్బిగలో ఓవెన్నా నీవీ
మారైనా వస్తావా తల్లీ
జుంజుం జుంజుం జుంజుం జుంజుం

కవ్వాలమమ్మా కలకాలంగా
తిరిగీ తిరిగీ అరిగిపోతున్నాం
ఝుంఝుం ఝుంఝుం ఝుంఝుం ఝుంఝుం

౧౨

నను చూడవచ్చుచున్నాడమ్మ నాస్వామి
చెలులతో ముందుగా చెప్పినాడమ్మా।
ఈ పాలనెవ్వరమ్మా పారబోశారు
నాస్వామి దాహమన్నను ఏమిసేతునే:
ఈ యద్దమును ఎవ్వరే పగులనేశారు
నా స్వామి చూచుకొనగ నేమి ఇత్తునే:
ఈ కుంకుమ మెవ్వరే నేల బోశారు
దేనితో స్వామి కే తిలకమ్ము నిడుదునే:

౧౩

నిను నమ్మితే ఇంతపని చేసితివిగా
పదని తాళా లిచ్చి పంపినావుకదా:
ఈ ఇల్లు నాస్వామిదేన యని యడిగితే
పదిమంది గుమిగూడి పకపకా నవ్విరే.
తాళాలు మారుస్తు తలుపు తీస్తుంటేను
దొంగ వని తూలాడి తోసి వేసిరికదా.
స్వామి నా కికమీద నేమైన కానిలే
నీవు లేకుండ పోనేపోను పోనులే.

౧౪

బ్రతుకలేని సిగ్గుతో
నీ జాడ
వెతుకలేని బ్రతుకుతో.

అడుగడుగునా భయంపడినాను పడినాను
వెనుక ముందు నసహ్యావికటతాండవములే.
నను కాలమే క్షణక్షణములుగా భిన్న
భిన్నాలు చేసి తింటున్నది కదా ఇంక.
నీ వెవ్వరవో నీవు నివసింతు వెక్కడో
నైనా తెలియకే ప్రయాణమైనాను పో!

# అవివాహ శాసనం

వేకుమళ్ల కామేశ్వర రావు

కొండలమధ్య ఉంది లోవగూడెం. తూర్పున ఉన్న కొండ చాలా ఎత్తయినది. అన్ని కాలాలలోను పొద్దు పొడవడం తొమ్మిది చుట్టుపట్ల కాని జరగదు. కొండమీద కనక కాస్త మబ్బుపడితే ఇంక చెప్పే అక్కర లేదు. తూర్పు కొండ సూర్యోదయాన్ని అడ్డుతూంది కాని పడమటి కొండలు విడివిడిగా ఉండడంవల్ల సూర్యాస్తమయం చక్కగా కనబడుతుంది. కాలజాతివారు ఈ సృష్టి చిత్రాల్ని చూసి ఇక్కడ నివాసం ఏర్పరుచుకో లేదు. నీటి సమృద్ధి, నేల సారం చూసి చేరారు.

వీరదొరకి ముందు ఎందరు దొరలు కాలజాతిని ఏలేరో చరిత్రకారులైనా చెప్ప లేరు. కాని వీరదొరకి ముందు కొందరిని గురించి వారు చెప్పుకుంటూ ఉంటారు. మల్లిదొర చాలా ప్రతాపం కలవాడనీ, అతని కాలంలో దిక్కుల చివర ఉండే జాతులుకూడా కప్పం కడుతూ ఉండేవనీ చెప్పుకుంటారు. నల్లదొర కాలంలో పాడి పంటలు చాలా వృద్ధిగా ఉండేవట! రెండువేల జనాభా లేని ఈ జాతికి పశుసంపద కొన్ని వేలు ఉండేదిట! పండిన పంటలు తినలేక తిరిగి పొలాలలోనే కలిపేసే వారుట! పై ఇద్దరి రాజుల కాలం ఎవరికీ తెలియదు. అంతే కాదు, కాలజాతివారి కాలమానంలో కొన్నియుగాలు కూడా గడిచి పోయినవి.

ఇప్పటి రాజైన వీరదొర పరిపాలనము కాలజాతి వారు మెచ్చుకుంటున్నారు. అతను మల్లిదొరని అనుకరించి ప్రపంచాన్ని వశపరుచుకోదలచుకున్నాడనీ, నల్లదొర ననుసరించి పాడి పంటలు వృద్ధి చెయ్యదలచుకున్నాడనీ జాతి అంతా సగర్వంగా చెప్పుకుంటుంది.

వీరదొర ఒక్కడే కాదు, అందరూ విన్న విషయమే, తమ ముత్తాతల కాలంలో తమవాళ్లు ఏడడుగులన్నరపొడుగు ఉండేవారనీ, వారు అంత ఆజాను బాహువులుగా ఉండబట్టే ఉట్టిచేతులతోనే మేకాలని పట్టుకునేవారుట! పదిపన్నెండుగురు కలిసి ఏనుగుని బంధించేవారుట! ఒంటి పెద్ద గిత్త కణుసుని తోకపట్టుకు లాక్కొచ్చేవారుట! ఇవన్నీ కథలుగాక యథార్థ విషయాలని కాలజాతికి నమ్మకం. ఇప్పటికీ తూర్పుకొండపక్కని వెన్నవాగు పక్కని ఉన్న చెలకని సాగుచేస్తూన్న తాడిదొర ఏడున్నర అడుగుల పొడుగున్నాడు.

విశ్రాంతికోసం వచ్చి నల్లవాగు పక్కని ఎత్తైన బండరాయిమీద కూచున్న వీరదొర ఇదే ఆలోచించాడు. "వెయ్యి ఆమడల దూరంలో ఉన్న ఒక కూరజాతి వారంతా ఆజాను బాహువులై ఉంటూ ఉంటారు. అటువంటివారు కొండెక్కి మా మీదకి దండెత్తివస్తే మేము ఏమి చెయ్యగలం? ఇప్పుడు వస్తారనీ కాదు, వస్తున్నారని కబురు వచ్చిందనీ కాదు. వస్తే చేసేదేమిటని!" అతను ఒక్క క్షణం ఊరుకుని మళ్లా తనలో "మా ముత్తాతల కాలంలో కనక అటువంటి వాళ్లు దండయాత్ర చేస్తుంటే మా వాళ్లు ఉట్టి చేతులతోనే శత్రువుల్ని వెదురు బొంగుల్ని విరిచినట్టు విరిచి పారేసేవారు. ఇప్పుడు మేం చెయ్యకలిగిందేమిటి? ఊరికే చూస్తూకూచోవడమేనా! మా పాడిపంటలు వాళ్లకి అప్పచెప్పి దండం పెట్టాలి. అంతకి మించి ఏం చేస్తాం?... ఒక పెద్ద పులికి, ఒక కణుసుకి గొప్పశరీరం, అవయవపుష్టి ఎంతో అవసరం, చక్కగా నాలుగు కాలాలపాటు బతికుండాలంటే! అలాగే మేముకూడా ఒడ్డు పొడుగు లేనిదే శత్రువుల చేతులలో చిక్కిపోతాం." వీరదొర కొంచెం సేపు ధ్యానించగా "అయితే మా హ్రస్వానికి కారణమేమిటి?" అనే ప్రశ్న మొలకెత్తింది. అతను ఆలోచన చెయ్యగా చెయ్యగా ఒక విషయం స్ఫురించింది. "పూర్వం మాలో

ఇంకా

పడ్డాడు. అతని వర్ణం చూసి కాలజాతివారు దేవుడు అతనిలో ప్రవేశిస్తున్నాడని అనుకొనేవారు.

దేవదొర మతాధికారి. పూజలు, కొలుపులు, జాతర్లు చేయించడం, మంత్రాలు వెయ్యడం, శుభకార్యాలూ అశుభకార్యాలూ జరిపించడం అతని పని. అతన్ని కాలజాతివారు దగ్గర్లో రాజులాగ చూసుకుంటారు. వారికి వీరదొరయందు గౌరవం కుదిరితే దేవదొరయందు భక్తి కుదిరింది.

వీరదొర దేవదొరని పిలిపించి అతని అభిప్రాయం తెలుసుకోవాలని తొందరపడ్డాడు. ఒకరోజు పొద్దున్న వీరదొర దేవదొరకోసం కబురు పంపించాడు. దేవదొర తొందరలోనే జరుగనున్న కొండదేవర జాతరకోసం ప్రయత్నం చేస్తున్నాననీ, ఎలాగో తీరిక కలుగజేసుకొని త్వరలోనే వస్తాననీ జవాబు పంపించి, తొందరపనులు ఎలాగో కట్టిపెట్టి, దొర దగ్గరికి వెళ్ళాడు. వీరదొర దేవదొరని పులిచర్మంమీద కూర్చోమని కోరాడు. అతని కుశలం ప్రశ్నించాడు. దేవదొర ఉచిత సమాధానాలు చెప్పాడు. అటు తర్వాత దొర దేవదొర తలపెట్టిన కార్యాలగురించి అడిగాడు. దేవదొర రానున్న కొండదేవత జాతరని గురించి చెప్పగా దొర "అవసరమైన ఏవిషయమైనా సరే నాకు తెలియజేస్తే తప్పకుండా జరిగేటట్లు చూస్తా" నని మాట యిచ్చాడు. దేవదొర ఎంతో సంతోషించాడు. కొంతసేపయేక వీరదొర కొంచెం విచారం కనబరిచి "దేవదొరా! జాతినిర్వీర్యత చూసి నాకు ఎంతో చింతగా ఉంది" అని తలవంచి నిట్టూర్పు విడిచాడు.

దేవదొర శ్రద్ధగా వింటున్నాడు. వీరదొర తలఎత్తి "వెనక మనవాళ్లు ఇంతేసి ఎత్తు మనుష్యులు, అంతేసి లావు మనుష్యులు అని చెప్పుకుంటూ ఉంటాము. ఇప్పుడు మచ్చుకి మాత్రం తాడిదొర కనబడుతున్నాడు. ఈ లోటు విషయమై నాకు చాలా చింతగా ఉంది. రేపు పొద్దున్న మనకంటె బలాఢ్యులైన జాతివారు దండెత్తి వచ్చేరంటే మనగతి ఏమి కావాలి? పెద్దపులి లేడి అంతచిన్నదైతే చివరికి లేడేనా భయపడుతుందా? ఎలుగ్గొడ్డు అటువంటి పెద్దపులుల్నే తినడం నేర్చుకుంటుంది. మన క్షీణతని తలవగా ఎంతో బాధగా ఉంది. కాలజాతివారి అభివృద్ధి ఎలాగు జరుగుతుందో ఏమిటో!" అని నిట్టూర్పులు విడిచాడు దొర.

దేవదొర ఆలోచనలోపడ్డాడు. కనుబొమ్మలు పైకెత్తి గుడ్లు మిటకరించి, చేతివేళ్లాడిస్తూ, బుర్ర ఇటూఅటూ తిప్పుతూ ఒక నెల్లాళ్ళపాటు అహోరాత్రాలు మాను దేవునికి పూజ చెయ్యాలి. దానికి కొన్ని వందల పశువుల్ని బలియ్యాలి. నాలుగైదు వందలమంది అహోరాత్రాలు పూజలతోటి, భజనలతోటి తంటాలు పడాలి. అది బ్రహ్మాండమైన కార్యం. పెద్ద అగ్నిగుండం అవసరం. అగుండంలో అనేకవనాంతరాలేగాక కొన్ని జంతువులు కూడా ఆహుతి అవుతాయి. ఇది జరిగితే తీరనికోరిక ఏముంటుంది!" అని పలికి ప్రశాంతంగా చూశాడు.

వీరదొరకి అటువంటి తంతులో నమ్మకం పూర్తిగా లేదు. ఏమైనా అప్పటికి ఏసంగతీ నిశ్చయంగా చెప్పక దేవదొర అప్పటిదాకా చేస్తూన్న పూజలు సక్రమంగా జరుగుతున్నాయా లేదా అని ప్రశ్నించాడు. అవిచ్ఛిన్నంగా జరుగుతున్నాయని విని సంతోషించి, ఊరుకున్నాడు. కొంతసేపు ఇద్దరూ ఏవో లోకాభిరామాయణం మాట్లాడుకున్నారు. దేవసన్నిధిని విడిచిపెట్టి రావడంవల్ల ప్రతిక్షణం దండగయి పోతూందని బెంగపెట్టుకుంటూన్న దేవదొర వీరదొరని సెలవడిగి గభాలున లేచి, ఏదో మునిగి పోతూన్నట్టుగా పరిగెత్తాడు. తాను తలపెట్టిన విషయమై దేవదొరని అడగడంవల్ల ప్రయోజనం లేదని వీరదొరకి పూర్తిగా నమ్మకం కలిగింది. ఒక వారంరోజులపాటు వీరదొర తీవ్రంగా ఆలోచించాడు. తాను చేయదలచుకొన్న పనియొక్క సాధకబాధకాలన్నీ జాగ్రత్తగా విచారించాడు. ఒక నిర్ణయానికి వచ్చి ఒక శుభముహూర్తాన్ని లోవ గూడెంలో ఇలాగ చాటింపించాడు: "ఈ శాసనంతో కాలజాతివారు చేసుకొన్న పెళ్లిళ్లన్నీ రద్దయాయి. అంతేకాకుండా కొత్తగా పెళ్లి చేసుకో కూడదు. ఈ ఆజ్ఞని తప్పిన వారికి శిరచ్ఛేదనశిక్ష. ఈ శాసనం పేరు అవివాహశాసనం."

లోవగూడెంలో హాహాకారాలు బయలుదేరాయి. గుంపులు గుంపులుగా జనులు గూడి మాట్లాడుతున్నారు. ఆరోజున ఒక్క కొంపలోనూ పొయ్యిలో నిప్పు వేసుకోలేదు. కొందరికి ఈ ఆజ్ఞ అసలు అర్థమే కాలేదు. మరికొందరు ఇది ఆజ్ఞే గాదన్నారు. ఇంకా కొందరు ఇటువంటి ఆజ్ఞ దేవదొర చెయ్యాలి కాని వీరదొర చెయ్యకూడదు. వీరదొర ఎంతసేపూ యుద్ధం చెయ్యవలసినవాడే గాని లేనిపోని సాంఘిక నియమాలు నెత్తిని పెట్టుకోవలసిన వాడు కాడు అన్నారు. పెద్దదొర "వీరదొరకి పిచ్చెత్తిందేమో, ఒకమారు చూసి రావలసిందే. పదిమంది కలిసి వెళ్ళి చూసొద్దాం, రండి" అన్నాడు.

గూడెంలో సంచలనం వీరదొర గమనించాడు. మరికొంత కట్టుదిట్టం చేసి ఆజ్ఞ ఇయ్యవలసిందా అని తలపోశాడు. ఏమైనా ఇప్పుడు వెనుతియ్యడానికి వీలు కాదు. స్పష్టంగా నిలబడి తిరగబడే వాళ్ళని ఎదుర్కోవలసిందే అని నిశ్చయించుకున్నాడు. వెంటనే అతను తన సన్నిధిలో ఉన్న సైనికుల్ని ఎప్పుడూ విల్లంబులతోటే కాకుండా, బల్లెములతో కూడా సిద్ధంగా ఉంచమన్నాడు. అంగరక్షకుల సంఖ్య వృద్ధి చేశాడు. మిగతా వాళ్ళకి యుద్ధశిక్షణ ఇయ్యవలసిందని హుకుం జారీ చేశాడు.

ఒక పెద్ద జట్టు బయలుదేరి దేవదొర గుడిసె దగ్గిర చేరింది. దేవదొర కొండదేవత పూజలో ఉన్నాడు. జట్టు తాము వచ్చినట్టుగా దొరకి తెలియజేశారు. పూజ అవందే కదలడానికి వీలులేదని దొర అనడం చేత నాలుగు గంటల కాలం అక్కడే కనిపెట్టుకు కూచున్నారు. చిట్టచివరికి దేవదొర పూజనుంచి లేచి మొహాన్ని కుంకం తోటి, ఒంటిని పసుపు తోటి, తలలో పువ్వుల తోటి, చేతులనీ కాళ్ళనీ వనాంతరాలతోటి, ఇవతలకి వచ్చాడు. జట్టంతా నమస్కరించారు. ఒకరిద్దరు నాయకులు అనగా పాలదొర, పులిదొర మిగతా వారి తరఫున ఇలాగ మనవి చేశారు. "వీరదొర ఆజ్ఞ మీరు వినేవుంటారు. ఇప్పటి వరకూ జరిగిన పెళ్ళిళ్ళన్నీ రద్దయాయిట! కొత్తగా ఎవ్వరూ చేసుకోకూడదుట!" దేవదొర ప్రశాంతంగా "ఔను. విన్నాను. అలాగ రద్దవడానికి వీలులేదు. పెళ్ళిళ్ళంతు ఎంత పుణ్యందో చూశారా! అందులో కొండదేవత ఎదుట జరిగినవి. ఇంతే కాదు. భూదేవి, ఆకాశదేవి సాక్షిగా మీరు వివాహమాడారు. కాబట్టి అమ్మగారు దేవతల అనుజ్ఞ లేనిది అసలు పెళ్ళిమాట ఎత్తకూడదు. రద్దు చెయ్యగలిగినది వారుగాని మనుష్యులు కారు. ఏదో దొర తెలియక చేసిన ఉత్తర్వు. ఇది జరుగవలసిందీ కాదు, జరగదీ కాదు" అన్నాడు తేలికగా.

పులిదొర "అయితే మమ్మల్ని ఏమి చెయ్యమని సెలవు?" అన్నాడు తొణుకుతూన్న రౌద్రంతోటి.

"తొందర ఏముంది! తొందరకి ఇందులో అవకాశమే లేదు. వీరదొర ఉత్తర్వుని ఉపసంహరించుకుంటాడు. ఒక వేళ ఉపసంహరించుకో లేదనుకోండి. మీరు ఏలాగా ఆచరించరు కాబట్టి ఆజ్ఞ దానంతటదే నశించి పోతుంది" అన్నాడు దేవదొర అందులో అణుమాత్రమైనా ప్రమాదం లేనట్టు. దేవదొర సాయంత్రం జపంకోసం తొందర పడ్డాడు. అప్పుడు కోసిన పువ్వులు అవసరం. అవి వచ్చిన వెంటనే జపం ప్రారంభించాలి. వాటిని తెచ్చే దొర చేతిలో పువ్వుల సజ్జ మారుమూలనుంచే దేవదొర కంట పడింది. గబాలున లేచి పూజకి వేళయిపోయిందంటూ గుడిసెలోకి పరిగెత్తాడు. అతను తెల్లారగట్టనుంచీ పచ్చిమంచినీళ్ళైనా గొంతుకలో పోసుకో లేదు. మళ్ళీ పూజల్లో కూచుంటే అటూఇటూ కదలడానికి వీలులేదు. అంచేత ఒక అరటిపండు నోట్లో వేసుకుని, నాలుగు నీళ్ళచుక్కలతో గొంతుక తడుపుకున్నాడు. ప్రమిద వెలిగించి జపానికి సిద్ధపడ్డాడు. వచ్చినవారలంతా ఎవరింటికి వారు వెళ్ళిపోయి, భార్యలని వంటచెయ్యమని తొందరచేసి, వాళ్ళ చేతులనుంచి ఇదే కడపటిసారి కతకడం అన్నట్టుగా తిన్నారు.

గూడెంలో విషయాలన్నీ చారులవల్ల వీరదొర తెలుసుకున్నాడు. ఒక పెద్దగుంపు దేవదొర దగ్గిరికి వెళ్ళడం, ఒకరిద్దరు దేవదొరతో మాట్లాడడం, ఏమీ

భార్యాలేదని దేవదొర అనడం మొదలైన విషయాలన్నీ వీరదొర విని, మొగ కాసావాళ్లకి తొందరగా యుద్ధతర్ఫీదు ఇయ్యవలసిందని అనుచరులకి ఆజ్ఞ ఇచ్చాడు.

దేవదొర తమ్ముడు వెల్లదొర. వెల్లదొర కొడుక్కి ఇరవైయేళ్లవాడు. పెళ్లి ప్రయత్నంలో ఉన్నాడు వెల్లదొర. దేవదొర కూడా తమ్ముడి కొడుకు పెళ్ళి కోసం తొందర పడుతున్నాడు. గూడెంలో ఒక ముఖ్యుడైన వింతదొరకుమార్తెని వెల్లదొర కొడుక్కి ఇయ్యడానికి ఏర్పాటయింది. ముహూర్తం ఇంక మూడు రోజులలో ఉంది.

వీరదొరకి పెళ్ళివిషయం తెలిసింది. అతను కొంచెం విచారించి ఇది దేవదొరతో వ్యవహారం అని మనస్సులో అనుకొన్నాడు. అతను దేవదొరకి ప్రత్యేకంగా ఇలాగ వర్తమానం పంపాడు. వెల్లదొర కొడుకు పెళ్లి అవివాహశాసనం ఉల్లంఘించడంకింద వస్తుంది కాబట్టి వెంటనే నిలుపు చెయ్యవలసింది అని. ఆ వర్తమానం విన్న దేవదొర ఉగ్రుడై పోయాడు. నా వంశం విషయంలో వీరదొర పెత్తన మేమిటి! అని తలచి తిరిగి వీరదొరకి 'నిలుపుదలకి వీలయిన విషయం కాదు. కాబట్టి క్షమించవలసింది' అని సమాధానం పంపాడు. వీరదొర మళ్లీ అవివాహశాసనాన్ని తిరస్కరించిన వారికి శిరచ్ఛేదం శిక్ష అని తెలిసికోవలసింది అని దేవదొరకి సందేశం పంపాడు. దేవదొర చిందులు తొక్కాడు. సన్నటి అతనిశరీరం పెనుగాలికి తీగెలాగ ఆడిపోయింది. "నేను దేవదొరననే సంగతి వీరదొర మరిచిపోయి నట్టు కనబడుతుంది. అయినా చూస్తాను, ఏ మోస్తరుగా జరగదో" అన్నాడు. దేవదొరమాటలు తీసుకెళ్ళి హర్కారులు వీరదొరకి తెలియచేశారు. వీరదొర తల నిలువుగా రెండుసార్లు ఆడించాడు.

దేవదొర తన నిశ్చయాన్ని లోవగూడెంలో ఇలాగ తెలియ చేశాడు. "అనాదిగా వస్తున్న ఆచారానికి ఆపత్తు వచ్చింది. అవివాహశాసన విషయమై గూడెం అభిప్రాయం వీరదొరకి తెలియబరచ వలసుంది. వీరదొరతో సమాధానం కుదరకపోతే కాల్వ నారంతా ఏకమయి అతని మీదికి దండెత్త వలసి వస్తుంది. ఎల్లుండి పెళ్ళి జరిపి అవివాహశాసనం తిరస్కరించవలసుంది. ఆ సమయంలో మీరంతా కత్తులు, కటార్లు ధరించి హాజరు కావాలి."

వెల్లదొరకొడుకు ముహూర్తం సమయంలోనే మరి కొందరు పెళ్ళిళ్లు చెయ్యదలచుకొన్నారు. వేగుల వాళ్లవల్ల వీరదొర ఎప్పటి సంగతులు అప్పుడు తెలుసుకొంటున్నాడు.

వివాహదినం రానే వచ్చింది. మొదట వాళ్ళు పెళ్ళిళ్ళు జరుగుతాయనుకున్నారు. తర్వాత ఆగుతున్నారు. అప్పటి కప్పుడు మరముగ్గులు కలియపెడుతూ తోస్తున్నారు. చివరికి పదని తేలింది. పది పెళ్ళిళ్ళు జరగబోతున్నాయి. బాకాల, కొమ్ముల, డప్పుల ధ్వనులు శబ్దాలు మారుమోగుతున్నాయి. ఇంతహడావిడి చూసి దేవదొర వీరదొర శాసనవిషయం మరిచిపోయి తన యిష్టం వచ్చినట్లు చెయ్యవచ్చు ననుకొన్నాడు. అతను మూర్తీభవించిన దేవుడి లాగున్నాడు. అవివాహశాసనం తలచుకొని ఉగ్రంలోనే శాంతం, శాంతం లోనే ఉగ్రం కనబరుస్తున్నాడు. అనేకమంది విలుకాండ్రు బాణాలతోటి, విల్లుతోటి, విచ్చుకత్తులతోటి సిద్ధమయి ఎటువంటి పరిస్థితులనేనా ఎదుర్కో దలచుకొన్నారు.

మహాయోధులైన వీరులు మూడువందలమందితో వీరదొర బయలుదేరాడు. రణభేరులు వాయించారు. బాకాలు, కొమ్ములు పట్టారు. శంఖాలు పూరించారు. దేవదొరయింటికి రెండు ఫర్లాంగుల దూరంలో సేన నిలబడింది. వీరదొర శిరస్త్రాణం ధగధగ మెరిసి పోతూంది. అతను అపరసూర్యుడు లాగున్నాడు.

సైన్యం రావడంచూసి దేవదొర దగ్గిర ఉన్న మనుష్యులు కూడా యుద్ధానికి సిద్ధపడి, బారులు తీరి నిలుచున్నారు. కత్తులు ఝుళిపించారు. శంఖాలు ఊదారు.

వీరదొర ఆఖరిసారి హర్కారుల ద్వారా వార్త ఇలాగు పంపాడు. "పెళ్లిచెయ్యడమనేది గూడెం యొక్క పాలకుని ఉత్తరువుని తృణీకరించడం.

రాజు ఆజ్ఞలు ప్రజలు పాలించాలి కాని ఉల్లంఘించ కూడదు. కాబట్టి దేవదొర లోవగూడెంలో వివాహం జరపకూడదు. ఆ సందేశం విన్న దేవదొర రుద్రుడయి పోయాడు. పరివళ్లు తొక్కాడు. అతను కోపావేశంలో "వీరదొర కాదు ప్రభువు, లోవగూడెం ప్రభువుని నేను" అన్నాడు. పరివారం సంతోషం మిన్నుముట్టింది. చప్పట్లతోటి, బాకాలతోటి, కేకలతోటి ఆకాశం బద్దలయి పోయింది. నేల దద్దరిల్లి పోయింది. హర్కారులు తిరిగి వీరదొర దగ్గరికి వచ్చి దేవదొర మాటలు అప్పగించారు. వీరదొర ఉరుము ఉరిమినట్టు సైనికుల్ని యుద్ధానికి ఆజ్ఞ ఇచ్చాడు. తానే ముందు నడిచాడు. మదపుటేనుగుల సంఘంలాగ కదిలి వస్తూన్న సేనని చూసి ప్రతి సైనికులు కంగారు పడ్డారు. అయినా ఆనాటి హక్కుకోసం యుద్ధం చెయ్యదలచుకొన్నారు. శత్రువుల కదలిక చూసి దేవదొర యుద్ధానికి అనుజ్ఞ ఇచ్చాడు.

రెండు సైన్యాలు రెండు నదులు ఎదురొక్కన్నట్లుగా రెండు మేఘమాలికలు ఢీకొన్నట్లుగా తలపడ్డాయి. బాణాల మోతకి, కత్తుల చప్పుడుకి, బల్లాల కళపెళకి, హుంకారాలకి, బొబ్బలకి చుట్టుపక్కల అడవులలో ఉన్న జంతుజాలం, పక్షులు కంగారుపడి అరుస్తూ దిక్కు తెలియక పరిగెట్టాయి. బొమ్మిలో బయలుదేరిన దుమ్ము మేఘంలాగ సూర్యరశ్మిని అడ్డేసింది. నాలుగు గంటలపోరు తర్వాత రణరంగం పీనుగుల పెంట అయిపోయింది. నేల నెత్తుటితో బురదయింది. గాలిలో దుమ్ము తగ్గింది. దేవదొర పక్షంవారు చచ్చినంతమంది చచ్చారు. మిగిలిన వాళ్లు కొండలంట, అడవులంట పారిపోయారు. వీరదొర జయించాడు. అతని ఒళ్లు సింధూరం అద్దినట్టుగా, మోదుగచెట్టు పూసినట్టుగా ఉంది. ఇంటి ముందర పులిచర్మంమీద దేవదొర మాట్లాడకుండా రక్తం ముద్దలాగ ఉన్న కళ్లతో కూచున్నాడు. అతన్ని బంధించమని వీరదొర భటులని ఆజ్ఞాపించాడు. దేవదొరని సంకెళ్లతో బంధించారు. వీరదొర ఇంటికి దేవదొరని నడిపించుకు తీసుకువెళ్లారు. ఒక్క వివాహంకూడా కాలేదని వీరదొర పరమానందపడ్డాడు. అతని నవ్వు బెబ్బులి బొబ్బపెట్టినట్టుంది. అతని కంటిఎదుట పడడానికి నాయకులు హడిలిపోతున్నారు.

లోవగూడెంలో గందరగోళం చల్లారిపోయింది. సాధారణ రోజులయింది. కడుపుబాధచేత ఎవరి పనులు వాళ్లు ఎప్పటిలాగే చేసుకుంటున్నారు.

ఒకరోజు పొద్దున్న వీరదొర కొలువుదీర్చి దేవదొరని తీసుకురమ్మని సైనికులకి హుకుం ఇచ్చాడు. దేవదొర సన్నగిల్లి, ప్రాణమాత్రావశిష్టంగా ఉన్నాడు. బందీ అయ్యేక అతను మంచినీళ్లైనా తాగలేదు. వీరదొర అతన్ని [illegible] నియమించాడు. కొంతసేపయ్యేక వీరదొర శాంతంగా "యుద్ధంలో నిన్ను బందీగా తీసుకుని వచ్చాము" అన్నాడు.

"కాని" అన్నట్లుగా దేవదొర చూశాడు.

"ఖైదీ ప్రాణం నా చేతుల్లో ఉంది" అన్నాడు వీరదొర బింకంగా.

దేవదొర తల అడ్డంగా ఊపి "కొండదేవత చేతుల్లో మన ప్రాణాలున్నాయి" అని బిగువైన నెమ్మదైన స్వరంతో అన్నాడు.

"ఆ విషయం కొండదేవతకి తెలుసు" అని వీరదొర ప్రశాంతంగా అని, "ఇప్పుడు నీకూ నాకూ తెలిసిన విషయం: ఒక్క కత్తిదెబ్బతో నీ తలవెళ్లి బంధించిన మేకతలలాగ కిందపడుతుంది. ఎరుగుదువా!" అన్నాడు హుంకారంతో.

దేవదొర ఏ భావమూ కనబరచలేదు.

వీరదొర శాంతంతో "అవివాహ శాసనం ధిక్కరించినందుకు శిక్ష తెలుసా?" అన్నాడు.

దేవదొర ఊరుకున్నాడు. అతని చూపులు ఆ విషయం తెలుసని తెలియజేశాయి. మొహంలో నమరు బెదురు లేదు.

వీరదొర కనుబొమ్మ లెత్తి "శాసనాన్ని ఉల్లంఘించినందుకు జరిగే శిక్షలో నీమట్టుకు కొంచెం మార్పు చేస్తున్నాను" అన్నాడు తీవిగా.

దేవదొర ప్రశాంతంగా చూశాడు.

వీరదొర మళ్లీమాట్లాడాడు: "దేవదొర కనక అవివాహ శాసనాన్ని ఒప్పుకొని ఇకముందు అనువర్తిగా ఉంటానంటే, శిక్షనుంచి తప్పిస్తున్నాను." దేవదొర చలనంలేని దృష్టితో చూస్తూ తలఅడ్డంగా ఊపి "కొండదేవత ఆజ్ఞలేదు" అని ముక్తసరిగా అన్నాడు.

వీరదొర ఉగ్రుడయి పోయాడు. అతని నల్లటి మొహం నిప్పులలాగ ఎర్రదనం వహించింది. "కాలజాతి పరిపాలకుణ్ణి అవమానిస్తున్నాడు దేవదొర" అన్నాడు వెర్రికోపంతో. "తలకొట్టు" అని పక్కనున్న భటుడికి ఆజ్ఞ ఇచ్చాడు. దేవదొర తలకాయ నాలుగుగజాలదూరంలో పడింది. అతని శరీరం రక్తంలో మునిగి పక్కకి ఒరిగి పోయింది. వీరదొర దగ్గరఉండే దేవదొరకి అంత్యక్రియలు జరిపించాడు. అతని సుగుణాలని తలచుకొని పరివారంతోటి "దేవదొర ఒకరికి అపకారంచేసి ఎరగడు. అతను ఆదర్శపురుషుడు. కర్మఎంతటి వాడికేనా తప్పదు" అని గోడుగోడున దుఃఖించాడు. పరివార మంతా దుఃఖసముద్రంలో మునిగిపోయింది. దేవదొర స్థానంలో తెల్లదొరని వీరదొర నియమించాడు. తెల్లదొర అవివాహశాసనాన్ని మత సూత్రాలలో ఒకటిగా చేసి కాలజాతివారికి బోధించాడు.

ఏడెనిమిది తరా లయింది. ప్రపంచ మంతటా ఏర్తియిన, సాహసవంతులయిన ప్రజ ఎవరంటే కాలజాతి వారని అన్ని దేశాలలోను చెప్పుకొంటున్నారు. మల్లిదొర, నల్లదొరల తర్వాత వీరదొరే జాతికి మహత్తరమైన ఉపకారం చేసిన వాడని కాలజాతి వారు పాటలు, పదాలు పాడుతున్నారు.

# ప్రాతఃకాలము

**దేవరకొండ బాల గంగాధర తిలక్**

చీకటి నవ్విన
చిన్ని వెలుతురా!
వాకిట వెలసిన
వేకువ తులసివా!

*

ఆశాకుంతల ధ్వాంతములో
నవసి యిలపై వ్రాలిన
అలరువా!—అప్స
రోంగనా సఖీ చిరవిర
హనిద్రాపరిష్వంగము విడ
ఉడుపథమున జారిన
మంచుకలవా!

ఆకలి మాడుచు
వాకిట వాకిట
దిరిగే పేదల
సురిగే దీనుల
సుఖసుప్తిని చెరచే
సుందర రాక్షసివా!

యుద్ధాగ్నికి పొగవో—వి
రుద్ధ జీవుల రుద్ధకంఠాల
రొదలో కదలెడి యెదవో!
అబద్ధపు బ్రతుకుల వ్యవ
హారాల కిక మొదలో!
కవి కుమారుని శుంభ
త్కరుణా గీతమవా!
శ్రీ శాంభవి కూర్చిన
శివపాల విలసితమౌ
వెలుగుల విబూదివా!

దేశభక్తులూ ధర్మపురుషులూ,
చిట్టి తల్లులూ, సీమంతినులూ,
ముద్దుబాలురూ ముత్తైదువలూ,
కూడియాడుచు కోకిలగళముల
పాడిన శుభాభినవ ప్రభాత
గీతా ధవళిమవా!

# సాహిత్య దార్శనికత

జమ్ములమడక మాధవ రామ శర్మ

సాహిత్యానికి దార్శనికత్వం ఉన్నదని కొందరు శాస్త్రకారులు గ్రహించలేదు. కర్కశభావంతో కూడు కొన్న శాస్త్ర హృదయాలకు సాహిత్యపరమార్గం తెలియలేదంటే వ్యథపడనక్కరలేదు. సాహితీసుధను సేవించుతూ కూడా దార్శనికత్వమును గ్రహించనివారిని చూస్తే జాలివేస్తుంది. ''సాహిత్యము'' అనేది సంస్కృతి భాషా పదము కాబట్టి దాన్ని అనుసరించి నిగూహితమైన తత్త్వమును తెలిసికొనడము అవశ్య కర్తవ్యము. సాహిత్యంలోని దన్నన తత్త్వము చిరంతనమైనా అభినవము. అందువలననే సాహిత్యము నవ్యమవు తున్నది. సాహిత్యానికి ప్రాతతనమంటూ లేదు. అది ఆస్వాద్యమానాభినవము. అనందుకు—

> చుంబ్యతే అసకృత్ అవరుధ్యతే సహస్రకృత్వః
> విరమ్య పునారమ్యతే ప్రయోజనే నాస్తి పునరుక్తమ్॥

అంటున్నారు. సాహిత్యముకూడా అంతే. రామాయణము శాకుంతలము ఉత్తరరామచరితము మొదలయి నవి ఎన్నిసార్లు చదివినా నవ్యసాహిత్యం మాదిరిగే ఉంటుంది.

## వ్యుత్పత్తి

సాహిత్య శబ్దాన్ని నిర్వచిస్తూ ఈ విధంగా అంటున్నారు.

౧. హితేనసహ, సహితం - సహితస్యభావః సాహిత్యం
౨. సహితస్య మిలితస్య భావః కర్మ సాహిత్యం
౩. సహ - తృప్తౌ - సహితం తృప్తం తస్యభావః
౪. సహితం రసేనయుక్తం విశిష్టం సాహిత్యం
౫. హితేన నిరతిశయ ప్రేమాస్పదేన సహితం తస్యభావః
౬. హితం - పిహితం, ఆవృతం తత్సహితం - తస్యభావః
౭. హితం సన్నిహితం నేదిష్ఠం తేన సహితం తస్యభావః
౮. సమ్యక్ నిహితం రక్షితం కవిభిః - తస్యభావః
౯. సహితం = ప్రహితం ప్రేషితం పరమానందరూపేణ పరశివేన
౧౦. సహితం = అవహితం, నిగృహీతేన మనసా ధ్యాతం.
౧౧. హితం = సుహితం తత్సహితం తస్యభావః అక్షయ్య తృప్తి సంపాదనం సాహిత్యం.
౧౨. శివః శక్త్యా సహ అస్మిన్ ఇతి సహితం - తస్యభావః
౧౩. దధాతేర్హి హితం = ధృతం విశ్వస్యధారకం సాహిత్యం
౧౪. సచ, హశ్చ సహౌ = జీవాత్మానౌ అస్మిన్ తస్య భావః
జీవముద్దిశ్య ప్రవర్తమాన మిద మాత్మానం బోధయతి.
౧౫. స,హ, ఇతి మంత్ర బీజాక్షర ద్వయ మస్య సంజాత మితి సహితం, తస్యభావః.
౧౬. సహ పరిణామే హంసభవతి - తద్యుక్తిస్యభావః
అజపా తత్త్వయుక్తం సాహిత్యం.
౧౭. స,హ = అంతరం బాహ్యావర్థః - తద్యుక్తతాస్యేతి సాహిత్యం.

ఈ చెప్పిన వ్యుత్పత్తులు సాహిత్య తత్వమును తెలియజేయడానికి ఉపకరించునవి. ఇవన్నీ వాస్తవములు అని కాదు. బుద్ధిగత చమత్కారాన్ని ఈ విధంగా వికల్పించడానికి అవకాశము ఉన్నది. ఇంకా సుబుద్ధులు ఊహించవచ్చు. వీనిలో కొన్ని ఏకార్థములు. కొన్ని తమాషాగా కనపడేవి. కొన్ని ఆనందసంగా కనపడేవి ఉన్నవి. వీటి నన్నిటినీ సూక్ష్మదృష్టితో విమర్శించితే కొన్నిటిని పూర్వపక్షంగా చేసికొని, కొన్ని ఆధారంగా సాహిత్య దార్శనికత్వమును స్థిరీకరించవచ్చు.

## శాస్త్రాల కలయిక

సాహిత్యము అనగానే ఇది సహితముయొక్క ధర్మము అని అంటారు. సహితము అన్నప్పుడు సాహిత్యము కలది సహితము అవుతుంది అనవచ్చును. సహితము అంటే కూడిఉన్నట్టిది అని అర్థము. ప్రకృతములో ఏవేవి కూడుకొని ఉన్నవో వానిని విమర్శించి తెలుసుకోవాలి. సాహిత్యము అనబడే ఈ కావ్య విద్యలో ఏవి కూడుకొని ఉన్నవి? అనే ప్రశ్న రాగానే – దీనిలో శాస్త్రాలు కూడుకొని ఉన్నవి అని వెంటనే సమాధానము చెప్పేవారున్నారు. సాహిత్యము అంటే శాస్త్రాల కూడికయే కాని ప్రత్యేకం కాదు, అని వారి అభిప్రాయము. వారికి శాస్త్రాలు అని అనబడే వాటిమీద ఉన్న అభిమానం సాహిత్యంమీద లేదు కాబట్టి ఈ విధముగా అంటున్నారు. అభిమానం బాగా ఉంటే వేరొక విధంగా అనకపోరు. ఆ విధముగా అనడము అన్నది అభిమానికము కాదు. అసలు విషయం తెలిసింది కాబట్టి.

సాహిత్యములో శాస్త్రములు ఎందుకు కూడుకొన్నవి? ఏ విధముగా కూడుకొన్నవి? ఏయే శాస్త్రాలు కూడుకొని కూడుకట్టుకున్నవి? అని పరిశీలించుకోవాలి. ఇదివరకు ఏలాంటి స్వరూపనిష్పత్తి లేకుండా ఉన్న ఒకటి, శాస్త్రాలు గబగబా వచ్చి కలిసేటప్పటికి స్వరూపమును సంపాదించుకొని సాహిత్యమయిందా? అస్పష్టసాహిత్యంగా ఉన్న ఒకటి (కావ్యవిద్య) శాస్త్రాల సంబంధంవలన స్పష్టసాహిత్యము కాగలిగిందా? అసలు "సాహిత్యము" అనబడేదాన్ని ఆ విధంగా అనకపోతూఉంటే అట్లా అనిపించటానికి శాస్త్రాలు కలిశాయా? శాస్త్రాలు కలియకపూర్వము పేరులేకపోతే శాస్త్రాలువచ్చి కలిసి నాట్లాడుకొని 'సాహిత్యము' అనే పేరు పెట్టినవా! దీనికికూడా ఒకవంటి ప్రతీకస్థలు ఇవ్వంచుదామను దీని తాతలు శాస్త్రాలను కలిపినారా? అట్లా కలగలుపు చేసినతరువాతనే ఇది సాహిత్యమయిందా! అనే ప్రశ్నల సమాధానాలనుగూడా నెమ్మదిగా భావించితే సాహిత్యదర్శనపథంలో కొంత అవలంబనం కలుగుతుంది. ఏయేవిధంగా శాస్త్రాలు కూడుకొన్నవో భావించడానికి ఇది ఒక ప్రణాళిక.

## వ్యాకృతి మేళనము

కావ్యవిద్యలో శబ్దార్థాలకు అనుప్రవేశం ఉన్నది. శబ్దములు కావ్యద్వారంలో ప్రవేశించేటప్పటికి శబ్దాలతోపాటు వ్యాకరణంకూడా జొరబడింది. వ్యాకరణవిద్యకు కావ్యవిద్యాతిరిక్త స్థలంలో తృప్తిని కలుగజేసే అవకాశం కన్పడలేదు. అన్ని ధాతురూపాలకు గాని అన్ని సుబంతరూపాలకు గాని ఇతరత్ర ఎక్కడ వినియోగంలేదు. విశిష్ట శబ్దనిబంధనంలో వేదశాస్త్రాలకు పురాణేతిహాసాలకూ అభినివేశంలేదు. అందువలన ఈ వైయాకరణాభిమతసుబంతతిజంతాలు ఇక్కడ అడిగి స్వాగతం పుచ్చుకొన్నవి. "సుపాం తిఙాంచ వ్యుత్పత్తిః సౌశబ్ద్యం పరికీర్త్యతే" అనే కావ్యమార్గంలోని సూత్రము ఈ అర్థాన్ని విశదం చేస్తున్నది. ఇట్లాగే వ్యాకరణ శాస్త్రానికి సంబంధించిన నియమాలు సంప్రదాయాలు సాహిత్యపథంలో ప్రవేశించినవి. ఈవిధంగా ప్రవేశించిన వ్యాకరణం మితిమీరిపోయి చాలా స్థానాలు ఆక్రమించుకొని సాహిత్యంలో కూడా తానే ప్రధాన మనిపించింది. అందువలననే సాహిత్యము వ్యాకరణపశువుకు పుచ్ఛభూత మన్నారు.

చివరకు వైయాకరణులు "ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః।—వ్యాకరణమూలత్వాత్ సర్వవిద్యానాం" అని వ్రాయించుకొన్నారు. ఈ కారణాలవలన సాహితీకన్య తన మృదులపదాలను వ్యాకరణస్ఫటికఫలకాలమీద ఉంచవలసి వచ్చింది. ఇంతటి వ్యాకరణపు పులుముడును చూచిచూచి అప్పయ్యదీక్షితులు— "ఈశబ్దశాస్త్ర నియమాలు అలంకారశాస్త్రంలో అంతగా వ్యుత్పాదకములు కావు—" అని అన్నాడు.

## న్యా య ప్ర వే శ ము

శబ్దాన్ని బట్టి శబ్దశాస్త్రం ఈవిధంగా రాగా అర్థాన్ని బట్టి ఇతరశాస్త్రాలు ప్రవేశించడానికి తలపడినవి. సాహిత్యంలో నిరూపించబడే అర్థాలు నానావిధంగా ఉంటవి. లోకసిద్ధములయిన సర్వసంప్రతిపన్నార్థములు కొన్ని కవికల్పనారూఢములు కొన్ని. వీటిలోకూడా యుక్తిప్రమాణానుభవాలనుబట్టిన అర్థాలు కొన్ని ఉంటవి. కవిలోనుండి కవితాకృతి ఏవిధంగా వచ్చేదీ ముందు మనవిచేస్తాను. యుక్తిసిద్ధార్థ నిబంధనములో తర్కము ప్రవేశించింది. హేతువాదమనేది తార్కికుల సొమ్ము. సాహిత్యంలోఉండే హేతువాదానికీ సంబంధము కుదిర్చి తర్కమును ఇందులో కుదించారు. ఈతర్కము సాహిత్యమార్గంలో అర్థాల హేతుహేతుమద్భావ నిర్ణయములో ఉండడమే కాక అలంకారాలలో ప్రవేశించింది. అందువలననే తర్కన్యాయమూలాలంకారాలు పుట్టినవి. ప్రత్యేకంగా "అనుమాన"మనికూడా ఒక అలంకారం. చివరకు రసవాదంలో కూడా శ్రీశంకుకవాదము తార్కికమే. [ఈ వాదము ప్రతిభ 2వ సంపుటము 3 సంచికలో ముద్రితమైంది] ఇట్లా తర్కం తన ఇనపపాదాలను పెట్టడమువలన కొన్ని భావసుమాలు నలిగుడుపడ్డవి. ఆలంకారికులు తమ కొన్ని గమనికలను తర్కచ్ఛాయలోకి దించారు. అట్లా రచనచేస్తేనే గౌరవమనికూడా భావించారు

## మీమాంసాను ప్రవేశము

ఏదైనా ఒకఅర్థమును నిరూపించితే ఇది ప్రమాణసిద్ధమవునా! కాదా? అని శంకకలుగుతూ ఉంటుంది. అందువలన సాహిత్యవిద్యార్థములు ప్రమాణానుసారముగా ఉండాలని తలచేటప్పటికి ముసుగువేసికొని మీమాంస ప్రవేశించింది. తన అధికరణ నిబంధన చేయుమంటూ వ్యధికరణం ప్రారంభించే సరికి కొన్ని మీమాంసామూలకాలంకారాలు బయలుదేరినవి. వికల్పము, పరిసంఖ్య, అర్థాపత్తి ఇటువంటివే. అప్పయ్యదీక్షితులవారు అదేమిదేమని మాంసవృష్టి కలవారు కావడముమూలాన ప్రతిచోటా మీమాంసాగంధమును అంటించాడు. భట్టలోల్లటుని రసవాదం మీమాంసకమతానుసారంగానే ఉంటుంది. మీమాంసకుణ్ణి నపుంసకు డన్నారు. కాని సాహితీప్రియులు భయపడినారో యేమో తమ గ్రంథాలపేర్లలో మీమాంసాపదమును కలిపారు. కావ్యమీమాంస, సాహిత్యమీమాంస, రసమీమాంస, చిత్రమీమాంస ఇటువంటివే.

## సాం ఖ్య ప్ర వే శ ము

సాహిత్యములో ప్రతిపాద్యాంశమును బట్టి ఇతరశాస్త్రాలు ప్రవేశము పొందుతున్నవి. అన్నిటి ప్రతిపాద్యమూ ఒకటే అయినా ప్రతిపాదనలో విచిత్రత ఉంటుంది. ప్రతిపాదన విచిత్రతను బట్టి ప్రస్థానభేదము కలుగుతున్నది. సాహిత్యప్రస్థానములో ఇతరప్రస్థానముల సంబంధసామ్యము ఉండకపోదు. సాహిత్యరీతిలో ప్రసంగవశాన సాంఖ్యసిద్ధాంతము నిరూపితమైంది. సాంఖ్యాభిమానం కలిగిన కవులు కొందరు నానావిధాల జగద్బాధలను పొందుతూ ఆ బంధత్రయవిముక్తికొరకు ప్రకృతిపురుషవివేకానికి సంబంధించిన విశేషాలను కావ్యాలలోకూడా నిబంధించారు. రసవాదాలలో భట్టనాయకవాదము సాంఖ్యసిద్ధాంతం మీదనే ఆధారపడి ఉన్నది. రజస్తమో గుణాలు నశించిపోతే ఉద్రిక్తమై సత్వోద్రేకం వలన ప్రకాశానందమయ నిజసంవిద్విశ్రాంతి సాత్త్వికానుభూతి కలగడమంటే సాంఖ్యప్రణాళికను ప్రవేశింప జేసినట్లే అని భావించాలి.

## వేదాంత ప్రతిబింబనము

ఈ విధంగానే ఉత్తర మీమాంసకు ప్రతిబింబనము కలుగుతున్నది. వేదాంతములో కూడుకొన్న విభేదాలుకూడా ఆయా కవుల అభిమానానుసారంగా ప్రవేశ పెట్టబడినవి. ఆరోపమూలకాలంకారాలు అధ్యవసాయ మూలకములు అహార్యాత్మకములూ వేదాంతమూలకములే అని గ్రహించవచ్చు. రసవాదులలో సిద్ధాంతభూతమైన అభినవగుప్తుని రసవాదమును కొందర ద్వైతవేదాంత పరంగా సమన్వయించారు. పండితరాజ జగన్నాథుడు ఈ వాదము నిర్గుణ పరబ్రహ్మపరమని గట్టిగా పలుకుతున్నాడు. తాను రసగంగాధరంలో రసచర్చ చేసినపుడు కూడా అద్వైత బ్రహ్మభావపరక సమన్వయమునే ప్రదర్శించాడు. భావచర్వణలోకూడా ఇదే ప్రక్రియ ఊహించాలి. స్థాయి చర్వణలో ద్వైతవిశిష్టాద్వైతములను అనుబింబనమును కొందరు ఉపలక్షించుచుకొంటున్నారు. శృంగారాది రసాలకు భరతుడు కూడా దేవతాగుణరూప విశేషాలను చెప్పడమునుబట్టి సగుణ వేదాంతవాదాలకు సాహిత్యంలో అనుప్రవేశం ఉన్నదని కొందరు నిశ్చయించడానికి అవకాశం కలిగింది నవరసాధిపులయిన ఆయా దేవతావాదాలకు కూడా సాహిత్యంలో అవకాశం వున్నదని అభిమానికంగా కొందరు చెప్పడంకద్దు. ఆయా గుణాలంకారాలను రసాలకు సంబంధించేటట్లుగా మంత్రోద్ధారం కూడా చేస్తే మంత్రశాస్త్ర ప్రవేశం ఈ విధంగా కూడా వున్నదని చెప్పడానికి అవకాశం వుంటుంది.

## ఇంకా శాస్త్రాల కలయిక

సాధనాంశములను సాహిత్యము నిరూపించుతుంది. అందువలన వాటి ఆధారమునుబట్టి యోగాను ప్రవేశమును కూడా చెప్పడానికి అవకాశం వున్నది. సాహిత్యంలో వాదానుసంధాన ప్రణాళిక వున్నది. ఇది యోగమర్యాదే కావచ్చును. మానవ జీవితాన్ని సంస్కరించడానికి సాహిత్యం ప్రయత్నించుతుంది. కాంతవలె ఇది వుపదేశిస్తుంది. కర్తవ్యాకర్తవ్యములను ఇది బోధించుతుంది. కాబట్టి ధర్మశాస్త్రము కూడా తనకు ప్రవేశాన్ని వుడికి పుచ్చుకొన్నది. ధర్మశృంగారము ధర్మవీరము అనేకసభేదాలు సాహిత్య ధార్మికతను సూచనము చేస్తున్నవి. రసాభాసను వ్యవస్థ చేయవలసి వచ్చినపుడు ధర్మమును అనుసరించకతప్పదు. శ్రౌతస్మార్త విధులను సాహిత్యము నిరూపించక పోవడము లేదు. కాబట్టి ధర్మస్తంభం కూడా సాహిత్యానికి కొంత అడ్డురాకపోలేదు.

ఇట్లాగే కామందకీయాది నీతిశాస్త్రపాండిత్యాన్ని కొందరు కవులు సాహిత్యంలో విప్రకీర్ణం చేశారు. అర్థాంతరన్యాసాలంకారములో నిరూపించబడే సామాన్యరూపమైన అర్థము లోకాతిక్రాంతార్థ నిబంధనము, సాహిత్యానికి అభీష్టము. అక్కడ జ్యోతిషానికి భూగోళశాస్త్రానికీ ప్రవేశము వున్నదట. ఈ విధంగానే ఒకటేమిటి? రత్నశాస్త్రం, గజశాస్త్రం, అశ్వశాస్త్రం, సాముద్రికం అన్నీ సాహిత్యంలో కొంతకొంతగా వున్నవి. ఈ విధంగా నిబద్ధసాహిత్యంలో శాస్త్రచ్ఛాయలు కనపడుతున్నందువలన "సాహిత్యము సర్వశాస్త్ర పామరస్యాత్మకము" అని అంటున్నారు.

## శాస్త్రాలు కూడి ఉంటే సాహిత్యమా?

ఇది సత్యమని అంగీకరించడానికి సహృదయులహృదయం బాధపడుతుంది. పై విధంగా శాస్త్రాలప్రవేశం వున్నదని ఒప్పుకోవడానికి అభ్యంతరం లేదు. కాని సాహిత్యానికి ఆయా శాస్త్రాలకంటె అతిరిక్తంగా స్వరూపం లేదంటేమట్టుకు సహించి లేము. ఒక గ్రంథంలో ఈ శాస్త్రాలుఅన్నీ కలుసుకట్టి వున్నవనుకోండి. ఆ గ్రంథాన్ని విభాగించి విభాగించి ఆయాశాస్త్రాలను విడివిడిగా తీస్తే సాహిత్యానికి స్వరూపం వుండ

దంటారా? అది గోచరం కాదంటారా? ఒక దేహంలో వున్న కరచరణాద్యవయవాల నన్నిటినీ విడివిడిగా ఊడదియ్యండి. ఆ అవయవాలకంటె అతిరిక్తంగా ఆ దేహంలో ఆత్మ అనేది లేదా! అవయవాలు తీస్తే పోయిందంటారు కాబోలు అయినా ఆ ఆత్మ ఆ అవయవాలస్వరూపమే కాదుగదా! ఇంతకన్న అతిరిక్తమేగా? అదేగా దేహానికి దేహత్వాన్ను ఇచ్చింది! అట్లాగే సాహిత్యవిద్యలో శాస్త్రాల అనుప్రవేశ ముండుగాక. ఇంతకన్న అతిరిక్తంగా ప్రత్యేకస్వభావము దానికి వున్నది. ది అనపలపనీయమే. అసలు అ స్వరూపసంపాదకం కాని శాస్త్రీయాంశాలకంటె భిన్నంగా గోచరమయ్యే తత్వం సాహిత్యంలో లేదు అని అనడంమట్టుకు పరమార్థం కాదు.

శాస్త్రాలు కలిసినా సాహిత్యానికి స్వరూపం వున్నది. అదికూడా శాస్త్రీయాంశాలమాదిరిగా గోచర మవుతూనే వున్నది. దర్శనాలలో పరస్పరము సంబంధము వున్నందువలన సాహిత్యదర్శనంలో ఈ శాస్త్రాల కలయిక వచ్చింది. అంతమాత్రాన సాహిత్యమును శాస్త్రాలకలయిక అనవద్దు. సాహిత్యానికి ప్రత్యేకత్వము ఉన్నది. మీరు నేటిని "శాస్త్రాలు" అని అంటున్నారో వాటిలో ఇతర శాస్త్రసంబంధం ఉన్నందువలన వాటి వివిక్త విషయత్వము నశిస్తున్నదా? మీమాంసలో ఇతర శాస్త్రాలు అనేకం కలసినవి, అంతమాత్రాన దానికి స్వరూపహాని లేదు. ధర్మ శాస్త్రంలో అర్థిక విషయాలు కామవిషయాలు మోక్ష విషయాలూ వున్నవి. అయినా అది ధర్మశాస్త్రమే. అట్లాగే అర్థశాస్త్రంలో ధర్మ కామమోక్షాలూ, కామశాస్త్రంలో ధర్మార్థ కామమోక్షాలూ వున్నవి. వాని వానికి స్వరూపనాశము ఏమీ లేదు. సాహిత్యంలో ఇతర శాస్త్రాలు కలిసినప్పుడు స్వరూపం పోతు దని ఎందు కనుకోవాలి? ఇతర శాస్త్రాలు కలియనూ వచ్చు. సాహిత్య స్వరూపమూ వుండనూవచ్చు. సాహిత్య విషయాలకూ శాస్త్రీయాంశాలకూ పరస్పరసామ్యము వుండడమువలన సాహిత్యాంగములుగా నిరూపించబడిన శాస్త్రీయాంశాలు సంవాదభరముతో సాహిత్యంలో కనపడుతున్నవి.

సాహిత్య నిబంధనానికి పూనుకొన్న కవులు అంతకుపూర్వం నానాశాస్త్రాలను వ్యాసంగము చేసి వుంటారు. కాకపోయినటయితే సాహిత్య నిబంధనానికి తగిన పరిణత వాక్కు వుదయించదు. సాహితీ రసికత్వంలో వున్న సమయంలోకూడా తదితర శాస్త్రాల సంస్కారము విడనాడలేక పోవడం మూలాన, ఆ పరిచయ గంధమును విడిచి వుచ్చలేక శాస్త్రీయ విషయములను నిబంధనము చేస్తారు. అట్లాగే నిబంధించారు. తాను రచించే సాహిత్యంలో శాస్త్రీయాంశాలను నిబంధించాలి అని కవి అనుకున్నప్పటికీ శాస్త్రీయాసక్త బుద్ధికంటె పూర్వ కాలంలో కవిహృదయాల్లో సాహిత్యానికి సిద్ధస్వభావము వున్నది. శాస్త్ర వాసన సాహిత్యంలో శాస్త్రాలను దింపింది. ఎక్కడైనా సాహిత్యరంగంలో శాస్త్ర పరిభాష కనపడిందంటే అక్కడ ఈ చెప్పిన గతిని సమన్వయించుకోవాలి. శాస్త్రీయము లనబడే ఆయా విషయాలుకూడా సాహిత్య శాస్త్రీయములే అవుత వని అసలు సిద్ధాంతము. ఎన్ని శాస్త్రాలనైనాసరే నిబంధించండి. శాస్త్రాల సహితత్వము సాహిత్యానికి సాహిత్యత్వమును సంపాదించలేదు. అట్టి సాహిత్యత్వ సంపాదకమైన సాహిత్య ధర్మము వేరే వున్నది. సాహిత్య పరమార్థము తెలియనివారు శాస్త్రాల కూడిక వుంటే సాహిత్య మనుకుంటారు. అది కేవలమూ పొరపాటు. అనుభవం దీనికి వ్యతిరేకంగా వున్నది. శాస్త్రవాసనలేనివాళ్లు కూడా సాహిత్యాన్ని వేరుగా గ్రహించు తున్నారు. సాహిత్యము ప్రత్యేక పదార్థ మని వారి హృదయానుభవము. సాహిత్యానికి వివిక్త విషయత్వము లేకపోతే అటువంటి అనుభవము కలుగనే కలుగదు.

## ప్రత్యేకత

సాహితీ చర్వణ చేసేటప్పుడు ఒక అనిర్వాచ్యమైన హృదయ పరిస్పందమును ప్రతిమానవుడూ అనుభవించుతాడు. ప్రతివస్తువుకూ కూడా సహజంగా స్పందం ఉన్నది. అచేతన మనబడే పదార్థముకూడా తనలో

తాను స్పందించి స్పందించి మహాలక్ష్యమును చేరుకొనడానికి నిరంతరమూ దీక్షతో ప్రయత్నించుచుతూ ఉన్నది. జడవస్తువుకు అస్పందం ఏ విధంగా వస్తుంది? అనే ప్రశ్నకు ఇక్కడ అవకాశం లేదు. అది అంతా కూడా పరశివాభిన్న మైన కరణేశ్వరీప్రభావము. అస్పందసామాన్యానికి అంతకూ ఆనందధామము లక్ష్యము. అస్పందిము ప్రపంచవిలాసముతో కూడుకొని కూడా నిర్లిప్తంగా ప్రవర్తించుచున్నది. ఈ విషయమునే సాహిత్యము నిరూపించుచుంది.

ప్రజాపతిలో నుండి సృష్టి నిర్నిమిత్తంగా వచ్చింది. కవిలో నుండి కవిత నిర్నిమిత్తంగా వస్తుంది. కవిత లోక స్వభావమును ఏమీ అపేక్షింపదు. ప్రాకృతిక మైన వస్తువు ఏదైనా ఒకటి కవితలో హేతువుగా ఉండాలి అని కొందరనుకుంటారు. అది కేవలమూ దుర్లలితక్రీడ. కవిలో కూడుకొన్న ఉన్మేషప్రసారమే కవిత. కవిత యొక్క నిమేషగ్రహీతి సహృదయునిచర్వణ. శక్తిచక్రానికి సంబంధించిన ఉన్మేషనిమేషములు ప్రపంచసర్గ వినాశములకు హేతువులని పరమార్థము. ప్రపంచవిలాస మంతా కూడా ఉన్మేషనిమేషాంతరములలో ఉన్నది. కవిలో బయలు దేరిన స్పందము ఆనందధామమును లక్ష్యముగా చేసుకుంటున్నది. అతని ఉన్మేషప్రసార మని చెప్పదగిన ప్రపంచవిలాసంతో కూడుకొన్న అతని కవిత నిర్లిప్తంగానే ప్రవర్తించుచున్నది. కవిహృదయ కుహరంలో సర్వసాహిత్యశక్తులూ కూడుకొని ఉన్నవి. అవి ఉబికి బయటికి వచ్చినపుడే కవితారూపమును పొందుతున్నవి రామాయణ మహాకవి శాంతసమాధిలో ఉన్నపుడు రామాయణ మహాకావ్య మంతా ఒకే పర్యాయము ఆకస్మిక ప్రత్యవభాసము పొందింది. వ్యాసభట్టారకుని నీరవసమాధిలో భారతగాథ అంతా గోచరించింది. కవులు అయిన వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, భవభూతి మొదలయినవారి హృదయ భూము లను విచ్చుకొని కవితాంకురములు బయలుదేరినవి వారు నిరూపించేది అంతా కూడా నిర్లిప్తమైన మహా భోగం. ఈ విశేషంలో కూడుకొని ఉండే సాహిత్యము ఇతరశాస్త్రాలకు సంబంధించింది ఎందుకు కావాలి?

## సా హి త్య ప్ర త్య భి జ్ఞ

సాహిత్యతత్వంలో ప్రత్యభిజ్ఞావాదము కూడుకొని ఉన్నది. ఈ వాదమునకే స్పందవాదము అని పేరు. ప్రతీకకు అభిముఖముగా ఉన్న జ్ఞానమును ప్రత్యభిజ్ఞ అంటారు. నిస్తరంగమైన పరమాత్మయొక్క నిర్వికల్పమైన సత్వతో ముఖవృత్తికి స్పందము అని పేరు. పరమాత్మలోని సక్రియత్వము స్పంద మనబడుతుంది. నిర్వికల్పనిరాకారు డయిన పరశివునిలో శక్తిరూప మయిన స్పందనము ఉన్నది. సృజింపబడిన సర్వపదార్థములూ స్తంబాది బ్రహ్మపర్యంతము శివాత్మకములే. పరశివునిలోని స్పందశక్తివలన జగత్తుకు వున్మేషము కలుగుతున్నది. స్పంద తత్వములో దుఃఖము లేదు. సుఖము లేదు. గ్రాహ్యము లేదు. గ్రాహకము లేదు. మూఢభావము లేదు. ఆ పరశివునితో అటువంటి అభిన్నానుభవము పొందుట ప్రత్యభిజ్ఞా పరమార్థసారము. ఈ ప్రత్యభిజ్ఞలో అందరూ అధికారులే. ఈ అధికారితా సంపాదనకు ఏ నియమమూ లేదు. పరమార్థప్రాప్తి నిర్లిప్తానుభవ వలన కాని రాదు. ప్రాణాయా మాది కష్టసాధ్యములయిన సాధనలు దీనిలో అవశ్యకములు కావు. శివాత్మక మైన ప్రతివస్తువునూ సమ్ముఖీనము చేసి కొని ప్రత్యభిజ్ఞారూపముగా భావించినపుడే నిరావరణమైన చైతన్యస్వరూపము భాసించుతుంది. ఇది స్పంద వాదముయొక్క సామాన్యస్వరూపము. ఈ స్పందదర్శన పరమార్థము సాహిత్యంలో కూడుకొని వున్నది. అందువలన సాహిత్యము దర్శన మైంది.

## ఆ నం ద ము గ మ్య ము

ప్రతి శాస్త్రానికి ఆనందము గమ్యము. అట్టిది పరమప్రాప్యంగా లేకపోతే వానికి ప్రవృత్తే లేదు. వ్యాకరణము పరాశబ్దవేదనముకొరకు ప్రయత్నము చేస్తున్నది. అకర్మణ్యతాసిద్ధికి మీమాంస, సకల బంధవిచ్ఛేదానికి

సాంఖ్యము, జడములైన అణువులకు కారణీభూతుడైన ఈశ్వరప్రాప్తికి న్యాయము, సహస్రారామృతప్రాప్తికి యోగము, బ్రహ్మీభావానికి వేదాంతము ప్రయత్నము చేస్తున్నవి. అంటే ఆనంద తేజమును చూడడానికి హోమము లెత్తుకున్న దన్నమాట. ఈవిధంగానే స్వరూపసముపలబ్ధికి సాహిత్యము యత్నము చేస్తున్నది.

## సాహిత్యము

మొదట్లో నిరూపింపబడిన సాహిత్యశబ్దముయొక్క అర్థములను బాగా భావించితే ఈ భావము విశద మవుతున్నది. శబ్దార్థములు సాహిత్యములో స్వరూపమును సంపాదించుతున్నవి. "సహితయోర్భావః సాహిత్యమ్" శబ్దార్థాలు రెండూ సాహిత్యములో సమరసీకృతములై ప్రవర్తిస్తున్నవి. శబ్దము శక్తి. అర్థము శివుడు. శివశక్తుల సామరస్యము సాహిత్యములో వున్నదన్నమాట "వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే" అని స్తవము చేస్తూవున్న కాళిదాసు ఈ అర్థమునే విశదం చేస్తున్నాడు. చక్రేశ్వరితో కూడుకొన్న పరశివుడు సాహిత్య సింహాసనములో శోభించుతున్నాడు. కాబట్టి "శబ్దార్థౌ కావ్యం" అని కావ్యస్వరూప నిరూపకులు చెప్పుతున్నారు. అర్థము ప్రకాశాత్మకము. శబ్దము విమర్శరూపము. ప్రకాశవిమర్శాత్మకమైన తత్వము సాహిత్యములో ఉన్నది. శబ్దమే కావ్య మనేవారు లేకపోలేదు. పండితరాజు "రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యం" అని అంటున్నాడు. అర్థమే కావ్య మని ఎవరూ అనరు. ఏవిధమైన సృష్టిఅయినా శక్త్యధీనము కాబట్టి సకలసృష్టికూడా శబ్దమునుండి వస్తున్నది కాబట్టి కవితాసృష్టికికూడా శబ్దమే మూలకారణము కావడముమూలాన "శబ్దము కావ్యము" అని అనడము అసముచితము కాదు.

## దర్శనకారులు - ప్రపంచము

ఇతర దర్శనకర్తలు ప్రపంచములో ఉండిన్నీ ప్రపంచానుభవము పొందుతూకూడా తాము ప్రపంచాత్మకులై కూడా ప్రపంచమును ద్వేషించుతున్నారు. నీరసమంటున్నారు. ఇంకా ఏమేమో ఇష్టమువచ్చినట్లల్లా అన్నారు. సాహిత్యదార్శనికులు ప్రపంచమును విమర్శించి శివాత్మకమని భావించుతారు. నీరస మనరు. ప్రపంచంలో ఉపభోగ్యతనే నిరూపించుతారు. అందువలన సాహితీసేవకులపై శాస్త్రకారులకు కోపంవచ్చింది. ఆ కోపబాధను భరించలేక "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అన్నారు. ఈ వచనానికి స్వార్థంలో అభిప్రాయం లేదు. తమ తమ శాస్త్రాలను రక్షించుకొనడమే ఇందులో ముఖ్యాశయం. ఈ మాట ప్రత్యేకించి వారు ఎందువలన వినవలసివచ్చిందో ఇదివరకు ప్రతిభలో ప్రకటింపబడిన 'కావ్యసౌందర్యము' అనే వ్యాసంలో నిరూపించాను.

## కావ్యకాంత

సాహిత్యము కాంతాసమ్మితమని సాహిత్యకారులు అంటున్నారు. అందువలన కావ్యాలాపాలను విడవాలని శాస్త్రకారులు అంటారు కాబోలు. కాంత అంటే దోష మేమిటి! శాస్త్రకారులకు కాంత అక్కరలేదా! కాంత ఉన్నంతమాత్రాన కచకుచాదులు ఉంటవని శ్రోత్రియులు బెదిరిపోనక్కరలేదు. సాహిత్యము కాంతామయమైన ఉపాస్తిని బోధించుతున్నది. "స్త్రీతి నామాపి మధురం" అని కుంతకుడు అంటున్నాడు. అన్ని ప్రాణులలో కంటె మానవప్రాణిలో స్త్రీజాతికి సౌందర్యం ఉన్నది. ఇతరప్రాణులకంటె మానవులు అధికంగా కామసేవనానికి అర్హులయి ఉన్నారు. పుష్కలమైన ఉపభోగ్యము ఉండగా సమర్థమైన శక్తి ఉండగా నిగ్రహించుకొని ఉపాసించాలి అని కవితలో కామినీత్వాపాదనము చేయడములోని పరమార్థము. సాహిత్యము శ్రీవిద్య. స్త్రీత్వారోపము ఉన్నందువలన స్త్రీవిద్య అయినా కావచ్చును. సాహితీసేవ స్త్రీమూర్తిని భావింపచేస్తున్నది. శ్రీదేవిని ఆరాధింపచేస్తున్నది. ఇటువంటి ఆరాధనాదృష్టిని మాని ఏమో ఉన్న దని భయపడి పరుగులెత్తేవారి పలుకులకు అర్థము లేదు.

# సాహిత్యోపాసన

సాహిత్యములో ప్రణయము ప్రతిపాదింపబడుతున్నది. అసలు సృష్టిప్రక్రియ అంతా కూడా ఐంద్రియికము కాని ప్రేమవలన వెలువడుతున్నది. అటువంటి లోకోత్తరప్రేమభావాన్ని సాహిత్యము నిరూపించుతున్న దంటే సంతసించడానికి బదులు ద్వేషించేవాళ్ళు మాందసులు. వాళ్ళను చూస్తే జాలివేస్తుంది పాపము' వాళ్లకు ఉపాసన తెలియదు. సాహిత్యము అద్భుతము మధురము అయిన ఉపాసనను బోధించుతున్నది. సాహితీ పథంలో మొదట భాసించేది శబ్దము. ఈ శబ్దమును ఉపాసించడము సాహితీపరమార్థము. శబ్దము నాలుగు విధములు – పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని. ఇట్టి శబ్దోపాసన స్పందతత్త్వములో విశేషము. అభినవ గుప్తుడు ధ్వన్యాలోకగ్రంథానికి వ్యాఖ్యానం వ్రాస్తూ—

యయ స్వాలనశక్త్యైవ విశ్వ మున్మీలతి క్షణాత్
స్వాత్మాయతనవిశ్రాంతాం తాం వందే ప్రతిభాం శివామ్.
ప్రాజ్యం ప్రోల్లాసమాత్రం స ద్భేదే నానూత్ర్యతే యయా
వందేఽభేసపగుప్తాహం పశ్యంతీం తా మిదం జగత్.
అసూత్రితానాం భేదానాం స్ఫుటతాపత్తిదాయినీమ్
త్రిలోచనప్రియాం వందే మధ్యమాం పరమేశ్వరీమ్.
స్ఫుటీకృతార్థవైచిత్ర్యబహిఃప్రసరదాయినీమ్
తుర్యాం శక్తి మహం వందే ప్రత్యక్షార్థనిదర్శినీమ్.

అని ఈ నాలుగువాక్కులనూ స్తవం చేస్తున్నాడు. తద్వారా ఉపాస్తి పరమార్థమును సూచించుతున్నాడు. ఈ శబ్దోపాసనావిషయంలో వైయాకరణుల స్ఫోటతో సామ్యము వుండవచ్చు అని ఆనందాదులు నిరూపించారు. శాబ్దికులకు శబ్దాల సాధుత్వాన్వయంతో తృప్తి కలిగింది. సాహిత్యవిదులు అంతటితో తృప్తిపడరు. సుబంతతిఙంతసాగరాలలో వైయాకరణులు మునుగుతూ తేలుతూ వుంటారు. వీరు వాటిలోనే ఈదు లాడరు. వర్ణపదవాక్యరచనా ప్రబంధరీతిలో శబ్దారాధన చేస్తారు. శబ్దగుణాలు శబ్దాలంకారాలు ఈ నాదోపాసననే సూచనచేస్తున్నవి. వర్ణాలలోకూడా మధురవర్ణాలను ఎంచి ఇంకాఇంకా ఇతర వర్ణాలను కూడా గణించి ఉపాసించుతున్నారు. ఆ అర్థాన్ని చెప్పడానికి అనేకపదా లున్నప్పటికీ విశిష్టమైన ఏ ఒక పదమో సాహితీవిదునకు వుపయోగించుతున్నది. సమాసాలలోచిత్రవిచిత్రపద్ధతులతో శబ్దమును ఉపాసించడము కనపడుతున్నది. రచనలో, రీతి వృత్తులలో, ప్రబంధభేద ప్రభేదాలలో ఈ శబ్దోపాసన ఎంతగా పల్లవించి లాస్యము చేస్తున్నదో సాహితీనేత్రమాత్రమే తెలుసుకుంటాడు. ఇతర శాస్త్రాల రూపితత్త్వము సాహిత్యము మీద కొంత ప్రసరించడము మూలాన వాచకారాధన, లక్షకారాధన, వ్యంజకారాధనకూడా సాహిత్య విదుని హృదయంలో విపులావకాశం పొందినవి. అర్థ ప్రతిపాదనలో శబ్దసుందరత అక్కరలేదు అని అను కుంటే అది "నగ్నారాధన" అని అనక తప్పదు. అట్టి దిగంబరమైన అనుభవమును సాహితీసాధు డాకాంక్షించడు. సాహితి అటువంటి మడి కట్టుకోనక్కరలేదు.

అర్థముయొక్క ఆరాధన నానావిధాలు. శబ్దములచేత సంపాదింపబడిన జగద్వస్తువును ఆరాధించుట దీనిలో ఉంటుంది. ప్రపంచ పదార్థమును భావనలో వదవపోత పోసికొని ఆరాధన చేయుట ఆరాధనలోని విశేషము. కావ్యముచేత ప్రతిపాదింపబడిన పదార్థానికి ప్రపంచప్రసిద్ధి అవశ్యకము కాదు. కావ్య వస్తువునకు జగద్వస్తువుగా ఉపభోగ్యత్వము లేదు. భావనామయమైన వస్తువుగా అది ఉపభోగ్య మవుతుంది. కావ్యవిశేషము వలన ప్రతిపాదింపబడే అర్థము అనంతవిభావరూపంగా ఉంటుంది. అవన్నీకూడా లోకదృష్టిలో జడా

త్మకములే. సర్వజడపదార్థములు సంవిత్తులో సమన్వయము పొందుతవి. ఆ సంవేదనము అహమాత్మక మయిన భోక్తలో సమన్వయము పొందుతుంది. నానావిధాహంకారాలతో కూడుకొన్న అభోక్తృవర్గ మంతా శివాత్మకమయిన మహాభోక్తలో స్వాత్మ సమావేశము పొంది సమన్వయము పొందుతుంది. ఈ విధముగా భావనామయ ప్రనాడికాపతిత వస్తువులే ఉపభోగ్యము లవుతున్నవి. కాబట్టి కవితను నిబంధించే కవి ఏవస్తువు నైనా స్వీకరించుతాడు. చంద్రుడు - సముద్రము - మేఘము - పుష్పము - వెన్నెల - మంజీరము - రశన - సీమంతమణి ఏదైనాసరే కవికి స్వీకార్యములే. వస్తువుకు జాగతికత్వము ఉన్నప్పుడే ఇది స్వీకార్య మవునా కాదా అనే సందేహము కలుగుతుంది. కాని భావనామయ భావరూపత్వములో కవికి అన్నీ సుందరములే. ఈ విధంగా ఒకవిధమైన భావనా జగద్వస్తువుయు ఉపాసించడము ఇక్కడ గోచర మవుతుంది.

భావనామయ మయిన సుందరత వస్తువులో బాగా అనుగతమయితే చిత్రత కలుగుతున్నది. అపుడు చిత్ర వస్తూపాసన సిద్ధమవుతుంది. ఇదే సాహిత్యపరిభాషలో అలంకారము. అలంకార ప్రపంచములో లోకాల నన్నిటినీ తిరగడము ఉంటుంది. అన్నిటికీ భౌతికసమన్వయము ఉంటుంది. ఆరోప సౌందర్యము, ఆహార్య సౌందర్యము, ఆధ్యాత్మిక సౌందర్యము దీనిలో ఆస్వాద్య మవుతుంది. ఈ సౌందర్యచర్వణ అంతర్వికాస హేతువు.

శబ్దోపాసనావిషయంలో దండి వామనాదుల గ్రంథాలు విదగ్ధముఖమండనాదులు ఒకవిధమయిన ప్రస్థానమును ఏర్పాటు చేసినవి. చిత్రార్థ విషయములో భామహరుద్రటాదుల గ్రంథాలు గతిశోధనము చేయడానికి ప్రయత్నించినవి.

ఈ శబ్దప్రపంచము ఈ అర్థప్రపంచము అంతా కరణేశ్వరీ ప్రభావమును అనుసరించిన ఉన్మేషము. వీటికి స్వాత్మ సమన్వయము సంపాదించుట నిమేష మవుతుంది. నిమేషావస్థలో శబ్దార్థ ప్రపంచములన్నీ స్వరూప లగ్నములై రమణీయతత్వమును పొందుతున్నవి. అన్నిటికీ రసాత్మ పర్యవసానము ఉండాలి. రసాత్మ పర్యవసానము పొందకుండా వేరుగా ఎడతెగకుండా ఉండేది ఏదీలేదు. రసాలు ఉపాసనలో పరమావధిని సూచించుతున్నవి. ఇదంతా గొప్ప ఉపాసన కాబట్టి శోక భయజుగుప్సలు కూడా ఆస్వాద్యము లవుతున్నవి. స్వాత్మ సమావేశమును సంపాదించుతున్నవి. ఆత్మరసానుభూతిని కలిగించుతున్నవి. ఇదీ సాహిత్య దార్శనికత.

## ఈ దర్శన గ్రంథ సరసత

సాహిత్యములో దార్శనికతత్త్వము వున్నదని నిరూపించడానికి ప్రత్యభిజ్ఞావాదగ్రంథము లాధారములు. ఈ వాదము వసుగుప్తునిచేత ఉన్మీలితమైనా అభినవగుప్తునిచేత సమున్మీలిత మయింది. అసలు ఈ స్పందవాదము వసుగుప్తునితో ఆరంభమయిం దని అనుకో నక్కరలేదు. సాహిత్యము ఎపుడు పుట్టిందో అప్పుడే ప్రారంభ మయింది అని నిశ్చయించాలి. భరతముని నాట్యశాస్త్రము స్పందవాదమును నిరూపించుతున్నది. సాహిత్య శాస్త్రము కాశ్మీరదేశములో పుట్టింది. ప్రత్యభిజ్ఞావాదంకూడా అక్కడే పుట్టిం దనాలి. ఆచార్య దండి స్పందవాది కాదని అప్పటి ఆలంకారికులు నిరాదరణ చేశారు. దాక్షిణాత్యత్వము కూడా అందులో హేతువు కావచ్చు. కాని దండి స్పందవాది కాకపోడు. ఆ విషయమును భోజరాజు గ్రహించాడు. అందువలననే తన సరస్వతీ కంఠాభరణములో దండిమతమును అనుసరించాడు. ఆలంకారికులకు అందరికి స్పందాభిమానము అధికంగా ఉన్నది. అసలు రసవాదము స్పందవాదమే కాని కొందర నుకున్నట్లు అద్వైతనిర్గుణపరబ్రహ్మ

పరము గాదు. అభినవగుప్తుడు రసవాదములో పైచేయి. అతడు స్పందవాదికదా? ఉపనిషద్వ్రష్టను చెప్పుతాడా? శారదాతనయుడు తనభావప్రకాశంలో రసవాదమునంతా స్పందవాదపరంగానే సమన్వయించాడు. ఇదే అభినవగుప్తునివాద మని ధ్రువపరుసున్నాడు. అలంకారికు లందరూ స్పందవాదులు కాబట్టి తమ గ్రంథాలకు కూడా పారిభాషికమైన పేర్లను పెట్టుకొన్నారు. ధ్వన్యాలోకము, కావ్యాలోకము, కావ్యప్రకాశ, భావప్రకాశ, మొదలయినవి ఇటువంటివే. ఈవిషయము తెలియని కొందరు ఏవో తమ ఇష్టమువచ్చిన పేర్లను పెట్టుకున్నారు. అసలు నాట్యముకూడా స్పందవాదమే. నాట్యము రసమూ ఒకటే. నాట్యశాస్త్రానికి ధ్వన్యాలోకానికి వెర్రి వ్యాఖ్యానాలవలన స్పందసంప్రదాయం పోతుందని అభినవుడు వ్యాఖ్యానాలను వ్రాశాడు. అభినవభారతిలో, లోచనములో అతడు నిరూపించినది స్పందార్థమే. అభినవశిష్యుడయిన క్షేమరాజు లోచనానికి వ్యాఖ్యాకర్త. అది ప్రకటితమయితే మన కేమీ సందేహము ఉండదు. సాహిత్య దార్శనికత చిరంతనమే అయినా ఆనందవర్ధనాభినవగుప్తులద్వారా దాని దార్శనికత స్థిరపడింది. ఉజ్జ్వలనీలమణిలో రూపగోస్వామి సాహిత్యతంత్రపక్షాన్ని మార్చడానికి ప్రయత్నించాడు. వంగదేశీయభక్తిసంప్రదాయమును. మాధుర్యభావమునూ రసంలో కలపాలనుకున్నాడు. సాహిత్యకౌముదీకర్తకూడా మమ్మటకారికలకే ఎసరుపెట్టాడు. కాని సాహిత్యవిషయంలో ఈ వంగవాదము స్వీకృతమయినట్లు కపడదు.

## కవుల స్పందశక్తి

అంతకుపూర్వము సంస్కృతకవులు సాహిత్యదర్శన నేత్రాలే. అభిజ్ఞానశాకుంతలము ఈవిషయమును చెప్పుతున్నది. అభిజ్ఞాన అనేపదమే ప్రత్యభిజ్ఞాసంప్రదాయసూచకంగా ఉన్నదని విమర్శకులు నిశ్చయించారు. కేవలమూ కథాప్రతిపాదనము వారి ఆశయము కాదు. అటువంటి ఆశయము ఉండరాదని కూడా ఆనంద శాసనము. రసనిబంధనము వారి ముఖ్యాభావము. సాహిత్యయందు కామినీకాంతసమారోపణమువలన నాయికానాయకసన్నివేశమును కవులు గ్రంథాలలో అంతటా కూర్చారు. కవుల గ్రంథాలలోని కథలను అన్నిటినీ స్పందవాదపరంగా సమన్వయించి చూడవచ్చు. కామినీకాముకులలో శృంగారము నిబంధింప బడుతున్నదీ అంటే అది ఉన్మేషప్రభావము. వారి వియోగనిబంధనంలో నిమేషవిలాసము ఉన్నది. అందువలనే వియోగమును వర్ణించాలని కవులాసక్తి పడ్డారు. విప్రలంభరచన లేనిది శృంగారపరిపోషణమే ఉండదని కూడా అన్నారు. ఆంధ్రుడయిన భవభూతి పరావాగుపాస్తిని సూచించుచూ గ్రంథరచన చేశాడు. అతని కథాస్పందకథ చాలా సుందరము. ప్రత్యభిజ్ఞావాదము స్పష్టముగా ఉన్న గ్రంథాలను అలంకారికులు ఉదాహరించారు. వానికి ప్రశస్తి వచ్చింది. కావ్యాలూ అటువంటివే. రఘువంశశ్లోకాలకు కొందరు కొన్నిసంప్రదాయాలలో స్పందపరంగా అర్థము చెప్పుతున్నారు. నైషధమును రచించిన శ్రీహర్షుడు తన గ్రంథములో ఆదినుండి అంతమువరకూ స్పందార్థమును నిబిడముగా నిబంధించాడు. గ్రంథగ్రంథులను తాను బుద్ధిపూర్వకంగా ఉంచినట్లు చెప్పుకున్నాడు. రామాయణభారతాలుకూడా ఇందుకు విరుద్ధములు కావు. ఈవిషయ విస్తృతికి నా "ఉపేక్షిక"లో విపులావకాశం ఇస్తాను.

## భావకవిత్వ స్పందము

ఆంధ్రుల మధ్యయుగంలో సాహిత్యసేవ అద్భుతంగా ఉన్నది. అప్పటి సాహిత్యంలో దార్శనికత్వమును వారు స్పష్టంగా నిరూపించారు. సాహిత్యంలో దార్శనికత్వం ఉన్నదని మరచి పోయిన ఈ కాలంలో భావకవిత్వము ఆ విషయాన్ని జ్ఞాపనంచేసింది. "భావకవిత్వము" అనేపదాన్ని వెగటుగా చూచేవారు సాహిత్యతత్వాన్ని, సరిగా తెలుసుకోరు. ఉద్భటుని కావ్యాలంకారసారసంగ్రహంలో ప్రతిహారేందురాజు లఘువృత్తి వ్రాస్తూ

ప్రతిభ

“ఏషాం రత్యాదికానాం భావానాం పంచాశత్సంఖ్యానాం యాన్యనుభావాదిభి శ్చతుస్సంఖ్యైః సమస్తైర్వ్యస్తైశ్చ యథాయోగం సూచనాని స్వలక్షణస్వరూపాణాం సామాన్యావస్థాపాదితానాం ప్రతిపాదనాని తైః కావ్య ముపనిబధ్యమానం ప్రేయస్వత్। ప్రేయశ్శబ్దవాచ్యేన ప్రియతరేణ రత్యాలంబనేన విభావేన రతి రుపలక్ష్యతే. తయాచ సాహచర్యాత్ రత్యాదయో భావాః పంచాశ దవగమ్యంతే: ఏవంచ భావకావ్యస్య ప్రేయస్వ దితి లక్షణయా వ్యపదేశః”.

అని అంటున్నాడు. అతడు భావకావ్యపదాన్ని ఉపయోగించాడు. భావశతక మని ఒక పుస్తకంకూడా ఉన్నది. ఇప్పుడు భావకవిత్వ మని ప్రయోగించితే దోష మేమిటి? కాబట్టి ఇప్పు డొక అలంకార శాస్త్రము కావాలి. ఇప్పటి గమనికలను అర్థంచేసుకుంటూ అభినవపథమును అనుసరించిన అలంకారశాస్త్రం కావాలి. ఇప్పటి కవితారీతులలో అనేకవిధములయిన పోకడలు ఉన్నవి. నానావిధంగా ఉండే అన్నిటినీ కలగలిపితే వెగటు పుట్టుతుంది. అట్లా కాకుండా ఏ ప్రస్థానానికి ఆ ప్రస్థానం విడివిడిగా ఉంటే సహృదయుల చర్వణకు అనుకూల్యం కలుగుతుంది. నానావ్యక్తిప్రస్థానాలతో కూడ కొన్ని నానారీతుల్ని నానావిధంగా చూడడమే మంచిది. ఒక విధానంతో వేరొకవిధానాన్ని ఖండించడం యుక్తం కాదు. ఆడ అపసంయోజక చేష్ట కూడాను. విజాతీయతత్త్వానుసంధానానికి ముందుగా సాహిత్యశాస్త్రగ్రంథాలు ఏమిటో తెలుగులో చూడాలి. ఇప్పటి అభినవకవిత్వాన్ని ఆదరించడానికి యోగ్యతను సంపాదించే సాహిత్య దార్శనికత్వాన్ని గ్రహించాలి. అప్పుడు చర్వణాసామర్థ్యం పుట్టుతుంది.

## ఈ దా ర్శ ని కు డు

ఈ సాహితీదర్శనతత్త్వగ్రహీత సహృదయుడే. సహృదయుడు సాహిత్యయోగి. నిర్మలీభూతమయిన మనోముకురం కలవా డయితేనే సాహిత్యదార్శనికత్వాన్ని గ్రహించగలడు. రసోల్లాసంతో నిర్భరమైన కవీశ్వరుని ఆత్మ గుణప్రౌఢిమకలిగిన స్వచ్ఛ శబ్దార్థదర్పణంలో ప్రతిబింబించుతుంది. శ్రోత ఆ శబలాత్మను భావించుతూ ద్రావితాభ్యంతరు డవుతాడు. మహాభోక్తృతను సంపాదించుతాడు. కవ్యాత్మసంవాదభాజను డవుతాడు. అప్పుడు స్వరూపసంవేదనము కలుగుతుంది. అప్పుడే సహృదయుడు చతుర్వర్గ పరిపుష్టిని సంపాదించగలడు. అదే పరాగతి. అతడే ఈ దర్శనమును సుదర్శనం చేస్తాడు.

రసోల్లాసే కవే రాత్మా స్వచ్ఛే శబ్దార్థదర్పణే
మాధుర్యౌజోయుత ప్రౌఢే ప్రతిబింబ్య ప్రకాశతే
సంప్రీతస్వచ్ఛశబ్దార్థ ద్రావితాభ్యంతర స్తతః
శ్రోతా త త్సామ్యతః పుష్టిం చతుర్వర్గే పరాం వ్రజేత్.

సాహితీ రసానుభూతికి అధికారి ఎవరో శ్రీ వావిళ్లవారి రజతోత్సవ సంపుటిలోని మా “రసానుభూతి”ని చూడండి.

## స్వ స్తి వా ద ము

### ఈ సాహిత్యదర్శనములో

ప్రతిపాద్యము :

రసాత్మ సంవేదనము
స్వరూప సాక్షాత్కారము
పరశివానుభూతి

సాధనము:

ఉపాసన
అనాసక్తితో జగద్వస్తువును స్వీకరించుట
నిర్లేపముగా ప్రపంచ విలాసమును అనుభవించుట
అనుత్కంఠతో ఇంద్రియవిషయములను సేవించుట.

సంస్కారము:

ఉన్మేష నిమేషాంతరదృష్టి
సాధారణీకృతి
భావనాసంస్కారము
ఆత్మ శ్రీ విభూతి.

## విరాళి

జీవితనావ భగ్నమయి చిందరవందర గాగ జేసి నీ
పావన మైన ఆశలకు పాదులు చేసి, జలమ్ము పోసి, ప్రే
మావని రోసి నాటుము; భయాకులవృత్తిని మాను మింక; సం
భావన చేయురే పెరిగి ధర్మసుమప్రజనాళి నామనిన్

నాలో పెద్దతుపాను రేపి నిలుచున్ నర్తింపు మో తల్లి! నీ
లీలాలోలత పాడుగాను! తగ దీరీతిన్ విజృంభింపగా!
జాలై పొంగెడుగాక నీ హృదయసంసారమ్ము సంద్రమ్ముగా
వాలాహంకృతి పచ్చినెత్తురులలో కర్మమ్మె జీవింపగా

గండశిలాదికర్కశము గాదు భవన్ముఖవీథి తల్లి, ఆ
గుండె కదెట్లు వచ్చినదొ కొండలు పిండిగ చేయునట్టి ఆ
ఖండలవజ్రభీమ మగు కర్కశసంపద; మారిపోమ్ము బ్ర
హ్మాండము నెల్ల ముంపగల మా పెదతల్లిగ కృష్ణవేణిగా!

ఇమ్ముగ హాసచంద్రికల నెక్కడొ దాచ సుధారసమ్ము లే
తెమ్మని నిద్రలేపుము బలే! సొగ సైన రసప్రవాహమై
కమ్మ నివాసనల్ విరియగమ్ముచు లోకము నిత్యనూతన
త్వమ్మున వెల్గగా తలపు దాల్పుము నీవె రసాధిదేవివై!

# మహో యజ్ఞం

౧

ప్రపంచ మంతట పరంపరాకం,
విపంచి కింతట వసంతరాగం;
ఆహవకర్త — ఆహవభర్త
ఎవడో ఎవడో
మరి
ఎవ దెవడో— ఎవ రెవరో;
ప్రపంచ మంతట పరంపరాకం
విపంచి కింతట వసంతరాగం.

కులగిరులే హోతలుగా,
నుద్గాతలుగా,
విధిదర్శన నేతలుగా,
ఋషిఋషభకోలాహలమే
ఋత్విక్కుల రోమంధముగా,
సముద్రఘోషల సామిధేనితో
హాహాకార స్వాహాస్వనముల,
ఆత్మల హేషల ఆమంత్రణముల,—
స్రుక్స్రువమ్ము లీదిక్కులు నాలుగు;
హవ్యకవ్యములు, ఆమీక్షమ్ములు,
సాన్నాయ్యమ్ములు, చరుపరమాన్నము
లరాఁ-రాజన ఆత్మదేహములు;
ఉపాకృతమ్ములు, వషట్కృతమ్ములు,
కృపాతిరస్కృత కృశానతేజులు;—
స్థండిలమండిత చండాసలునకు
అపవిత్రాశయ ధవిత్రములతో
స్వేదాంకురముల, చిదిమేసేస్తూ,
విషాకోసమై విషాణపూరిత
సురాదానమున పరాధీనుగా
బంధించేస్తూ, బలిభుక్కునుగా
పాతించేస్తూ, పశుతుల్యముగా
గవేషణమ్మౌ సుభీషణముగా;
విషతుల్య మ్మగు విశ్వదాసమును
గగసము నంటే కరాళకాళీ
సుతలము ప్రాకే సుధూమ్రవర్ణా

౨

సులోహితార్చిస్స్ఫులింగినీగణ
మనోజవమ్ముల— మార్తాండాంశల—
ఆహ్వానిస్తూ అవలోకిస్తూ
అండపిండబ్రహ్మాండములను
అండపిండ బ్రహ్మాండము నిండిన
ఆహవనీయము కర్పణచేస్తూ,
ఆకలి తీరని ఆరాటముతో,
అంతులేని హఠయోగముతో,
చేసే ఈయజ్ఞపు
చిద్విలాస మది యేమో
చిత్తవీథిలో చిట్టెమ కట్టిన
మత్తాశయ మది యేమో!
ఎ న్నైనవో!
ఎ న్నైతవో!!

ప్రపంచ మంతట పరంపరాకం,
విపంచి కింతట వసంతరాగం.

వావిలాల సోమయాజులు

# ప్రణయ లేఖ

వట్టికొండ రంగయ్య

ఆదరముతో చదువు చెప్పితి
వాదు లెన్నో భరించి నాకై,
గణ యతి ప్రాసాద్యఖిల ల-
క్షణము నేర్పితివి.

నీప్రభావముచేతనే కద
నే నిటులు కవయిత్రి నైతిని
కాంతునిగ వరియించు టొప్పదె
కవిని కవయిత్రిల్?

ఎంతయో మది వింత వింతగ
సంతసింతును తలచు చెల్లపు
డగుదు నంచు త్వదీయపత్నిగ
నచిరకాలములో.

గగనసౌధము లెన్నో కట్టితి
కాంతునిగ భావించి నిన్నే
మట్టిపాలై పోవు నేమో
మామకాశయమే!

తల్లిదండ్రులు వలదు వల దని
తగవులాడుచు పట్టుపట్టిన
వారిమాట నిరాకరించితి
వరుడ వని నీవే.

అందకత్తెను కాను నే నని
ప్రాణనాథ నిరాకరింపకు
బాహ్యసౌందర్యమ్ముకొరకై
భ్రాంతి చెందకుము.

ఆత్మసౌందర్యమ్మె మాత్రమె
అన్నిటిని మరపించి నాథా,
అమలబ్రహ్మానందసౌఖ్యం
బమరజేయునుగా!

తెలివితేటలు, రూపరేఖలు,
కులము, గోత్రము, ధనము, ధాన్యము,
గుణగణమ్ములు చూచి నే నిక
కోరనే లేదు.

కేవలము నీలో లయించిన
పావనం బగు దివ్యకవితా
వాచ్యమాధురికే పరించితి
వల్లభా, నిన్ను.

కవిని భర్తగ బడయవలె నను
కాంక్ష కల్గెను చిన్ననాడే.
సత్కవీ, నీకరుణ నిపు డది
సఫల మగుగాతన్!

సరససారస్వతములోనే
సంతతము కృషిసల్పి నాథా,
అనుపమానానందవైభవ
మనుభవించెదను.

అందమైన నీ వొప్పియుండ న
ఖండకీర్తి గడింతు నంతట
ఆంధ్రకవయిత్రీమతల్లీ య
టంచు కొనియాడన్-

## ప్రతిభ

సత్కవుల సాహిత్యగోష్ఠికి
సంతతము చనుచుండు నీతో
తోడు నీడగ మెలగు చెప్పుడు
కూడిమాడెదను.

పట్టెమంచముమీద హాయిగ
పవ్వళించిననీకు ప్రేముడి
సత్కవీశగ్రంథజాలము
చదివి వినిపింతుఁ.

తావక ప్రియశిష్యురా లని
దయ వహించెద వంచు నాపై
గాఢవిశ్వాసమ్ముతో నిఁ
కాంక్షచేసితిని.

పరిణయోత్తరకాలమున సం
ప్రాప్తకష్టము లెల్ల నోరిచి
అవసరంబగునేని ప్రాణము
లర్పణము సేతున్.

సంతతము హృదయాధినాథా,
సత్కృపామృతదృష్టి బరపిన
సంతసించెద భక్తిభరమున
స్తవము సేయుచును.

నిక్కముగ నాదేహరాజ్యము
నీకె పట్టము కట్టితిని; నీ
వధివసింపుము హృదయపీఠిక
నమలరాగముతో.

ఒప్పినను, నీ వొప్పకుండిన
నోప్రియా, నీకడ వసించుచు
పాదపద్మములన్ భజించెద
భక్తిభావమున.

ఒల్లకుండిన దీని కేనియు
నుల్లమున నీ మధురనామం
బెల్లవేళల భక్తితో స్మరి
యించుచుండెదను.

కానిచో నీదివ్యరూపము
లోన నాహృదయేశ్వరా, యీ
మానసత్వము విడిచి నే నిదె
లీనమై పోదుఁ.

నీవు నాకు లభింపగల్గిన
నిర్మలానందాబ్ధి మున్గుదు
కానిచో నీ హేయభువిపై
కాంక్ష నా కేలా!

మానసిక సౌఖ్యమ్ము కొరకే
మానవతి యీజగతి నుండుట
అదియె దుర్లభ మైనచో జని
వ్యర్థ మౌను గదా.

అన్నివిధముల నీడుజోడుగ
చెన్నుమీరుచు నుండి నాథా,
వన్నెవాసియు గాంచు మన దాం
పత్య మెల్లెడల.

పాల ముంచిన నీట ముంచిన
భార మంతయు నీదె నాథా,
చరణదాసి నటంచు మాత్రము
జ్ఞప్తియుండు గదా!

# వనలక్ష్మి

రెండుచింతల లక్ష్మీనరసింహ శాస్త్రి

నాప్రియురాలి దీప్తవదనాంచలమందున దోచు లేతన
వ్వీ ప్రసవమ్ము, లీ యళులు, నీ నవకోమలపల్లవవ్రజం,
బీ ప్రథమాళ దోచు మెరు, పీమృదుమంజులకోకిలాస్వనం,
బప్రతిమానశోభలును, నాయువు లయ్యె వనాంతలక్ష్మికిన్.

ఈ నిదురించుపత్రముల కెంతయు నీ డగునట్టి నీడలన్.
తాను నిజాప్తకాంత వెడతక్కువ గాగ కురంగ మిచ్చటన్
మానవకోటిమీద ననుమానము దక్కి తనుల్ మొగుడ్చు నా
హా నను గాంచి లేచునొ భయంపడి పారునొ యావదాళలన్.

ఇది వన మగు నిది మంజుల
మృదులస్వనయుతగభీరమేదురవల్లీ
విదళనకరమధుకరసం
పదలకు కౌముదుల కాలవాల మనదగున్.

విషమసాయకుని తప్పించుక తిరిగె రా
ఘవుడు ప్రియన్ బాసి కానయంచె
వనలక్ష్మితో సహవాస మర్థింతురు
దివ్యాంగనలును ధాత్రీశసుతలు
అది యాటప ట్టగు నది రంగతల మౌను
విరహజ్వరార్త లౌతరుణజనుల
కందు గదా తొల్లి యమరేంద్రతుల్యున
కధికవిక్రమనిర్జితాఖిలారి

కా యయాతికి శర్మిష్ఠ కయ్యె చెలిమి
వన మనగ నేల, యిదియు జవ్వనమె యగును
విహరణస్థల మగు నిది విజ్ఞులకును
ప్రాణి ప్రకృతిని బోల్చుదర్పణమె యగును.

ప్రాణమ్ము గల దీలతాంతమ్మునకు లేమి
యీనిరంకుశకర్కశైకశిలకొ
వృద్ధి యున్నది పూల్ సమృద్ధిగా నింపు నీ
మృత్కాలతకాశ కల్ల యగుట
యీలోహనిర్మితకాలాసలున కేమొ
మారణసాధనాగారమునకొ
చలన మున్నది శైలతలవినిస్సృతఝరి
కణపటపుట సాయుఘనకౌ యేమొ

అణుపణువునందు పులకించునార్తరక్ష
ణనియసమశక్తి యివ్వనమున గన నగు
దీన నా కగు మోదంబు దేవలోక
నందనోద్యానమున పురందరునకట్లు

# వాన వచ్చిన రాత్రి

"పాప"

బయట కొబ్బరిచెట్లు, నిస్సహాయంగా పొడుగైన ఆకులు ఆడిస్తూ అస్పష్టంగా కనపడుతున్నాయి. అంతటా అలుముకుపోయిన బూడిదరంగుతో ఆకాశం అస్పష్టంగా కనబడుతోంది. గదిలో మరీ చీకటిగా మరీ చల్లగా ఉంది. సూర్యుడు ఎప్పుడు అస్తమించాడో తెలియదు. రాత్రి ఎప్పుడు వచ్చిందో చెప్పడం కష్టం. మధ్యాహ్నంనుంచీ చీకటి పడుతోనే ఉంది. వాన పడుతోనే ఉంది. ఎదురుఇంటి నల్లటి చూరుక్రింద మాత్రమే చినుకులవిసురు ఏటవాలుగా కనబడుతోంది. మందంగా వాన ఒకటే శృతిలో వినబడుతోంది. మధ్యమధ్య మేఘాలు గొణుక్కుంటున్నాయి. అవతల అప్పుడప్పుడు తడికొబ్బరి ఆకులు కొంచెంగా మెరుస్తున్నాయి. ఒక కొబ్బరి మట్టమీద ఒక కాకి ఒంటరిగా కూర్చుంది మధ్యమధ్య రెక్కలు దులుపుకుంటూ! అది కావుమనడం లేదు. సోమరిగా వాన వెలిసిపోలేక పోతోంది.

నేను కిటికీకి దగ్గరగా దుప్పటి కప్పుకుని కూర్చున్నాను. లేచి దీపం వెలిగించాలన్న ఊహ మనసులో తట్టి వెంటనే అడుక్కి పోతోంది. అన్ని ఊహాలూ అలాగే అడుక్కి పోతున్నాయి, నీళ్లలో తాబేళ్ళలాగ. ఆ ఏటవాలు చినుకులు రెప్ప వెయ్యకుండా చూస్తున్నాను. కొంతసేపటినుంచి అవీ కనబడడం లేదు. ఎదురు ఇంటి చూరుకింద చీకటి అంతటా అలుముకు పోయింది.

కొబ్బరిమట్టమీద కాకి ఎగిరి గది అవతలఅరుగుమీద వాలింది. "కావు! కావు!" మంది. రెక్కలు దులుపుకుంది. చూరుకింద దండెంమీద వాలింది. దండెం ఊగింది. కాకి "కావు! కావు!" మంది. "ఎవరో చుట్టాలు వస్తారు." అని ఊహ తేలబోయి మునిగిపోయింది. దూరంగా ఉన్న చుట్టాలు జ్ఞాపకం వచ్చి పోతున్నారు – నీళ్లలో తాబేళ్లలాగ.

ఎదురుఇంట్లో దీపం వెలిగింది. వానచినుకులు అస్పష్టంగా వెలిగిన కిటికీ అంతమేరా కనబడుతున్నాయి. ఎవరో కిటికీ వెనక అడ్డంగా అటూ ఇటూ తిరుగుతున్నారు. ఆ బొంగురు గొంతుక నాకు పరిచితమయినదే. ఆ మందరస్థాయీ నేను వింటూ ఉన్నదే. ఆ 'బొంగురు'కి భార్య ఆ 'మందరస్థాయి'. ఈవేళ ఇంకో మూడోగొంతు, సన్నాయిలా వినబడుతోంది.

కాకి మళ్లీ "కావు కావు" మంది. "ఎవరో చుట్టాలు"... అనుకున్నాను మళ్లీ. చుట్టాలకోసం మనసులో ఎక్కడో కాకి "కావు కావు" మన్నట్టు అనిపించింది. ఎంతో ఒంటరిగా అనిపించింది. దుప్పటి కొంచెం గట్టిగా కప్పుకున్నాను, అంతచలి వెయ్యకపోయినా. 'జుయ్' మని ఒకగాలి వీచింది. కిటికీదాకా జల్లుకొట్టింది.

ఇంటిముందు సందులోనుంచి ఒంటెద్దుబండి చలి చేత గజగజ లాడుతూ "దుర్ దుర్" అంటూ వెడుతోంది. ఎద్దు కాళ్లచప్పుడు తడినేలమీద తప తప మంది. ఎదటి గోడలో తలుపు తెరుచుకుంది. ఒక్కసారి సందు దిప్పున వెలిగింది. కొద్దిగా చూరునీళ్లు దారాలలా జారుతున్నాయి. వాటిలోంచి చూస్తే ఎదటి గుమ్మానికి సోమతెర వేసినట్టుంది.

"ఏయి! బండీ!" అన్నాడు బొంగురు.

"బాబో!" అంది బండి!

"జగన్నాథపురం బండి కడతావా?"

"కట్టనండి బాబో!"

"పోనీ నీయిష్టం వచ్చినంత పుచ్చుకో"

"ఎంతిచ్చినా వొద్దండయ్యా! ఈ గాలీ, వానా, ఈ పొద్దూ. దుర్ ...దుర్ ..." బండి వెళ్ళిపోయింది.

బొంగుసు తటపటాయిస్తో కొంతసేపు గుమ్మంలో నిలబడి తరవాత లోపలికి పోయి తలుపు మూసుకున్నాడు.

"ఎల్లా గెడతా రండి? బస్సు దొరకవిస్సాడు"? అన్నాడు బొంగుసు.

"ఎల్లాగో నండీ" అంది సన్నాయి.

"పోనీ ఈమూల పక్క వేస్తాను, ఈరాత్రికి ఇక్కడ పడుకోవే. ఎల్లా లేకపోతే!" అంది మందరిస్తాయి.

వంటిల్లంతా వాన. వొంగిమున్నా! ఇల్లు నేయించమని ఎన్నోసార్లు చెప్పాను. నా లొచ్చేసరికి అద్దకోసం మాత్రం తయారు" బొంగుసు చిరాకుగా అన్నాడు.

"ఎల్లాగ మరి!"

"ఎల్లాగ మరి!"

వాన జోరుగా పడుతోంది. కాకి దండెంమీద "కావు కావు" మంది ఒంటరిగా. అరుగుకింద మెట్లమీద అడుగులచప్పుడూ గజగజ వినబడ్డాయి.

"చుట్టాలు" అనుకుని ఉలికిపడ్డాను.

"కుర్రోడు! కుర్రోడు" గరగిర మంది ఒక మగ గొంతు: "పల్లెమురా" అంది ఒక ఆడ కిచకిచ.

రెండుమూర్తులు అరుగు ఎక్కాయి. గరగిరకు గడ్డం ఉన్నట్టు ఎదటి కిటికీ వెలుగులో అస్పష్టంగా కనబడింది. మెడలో పెద్దజోలి. కచకచ చంకలో ఒక కుర్రవాడు నిద్రపోతున్నాడు. అరుగుమీద మూలగా సద్దుకున్నారు.

"ఇంటో దీపం నేదు. ఎవరూ లేరేమో" గిరగిర అన్నాడు.

"నిద్దరోయాడు కుర్రోడు" కిచకిచ అంది.

"మూలగా తొంగో మెట్టు"

"ఎదవోన! ఎంచే పుంటదో"

"ఇయ్యా లింక సతంకాడి కెల్లలేం"

"ఈమా పిక్కడే తొంగుందాం"

వానచప్పుడు చీల్చుకుని చటుక్కుని సన్నాయి గొంతు ఎదటి ఇంటిలోంచి వినబడింది.

"ఎల్లాగే ఇక్కడ చిక్కడి పోయాను?"

దండెంమీద కాకి టపటప లాడింది. దండెం ఊగింది.

"కాకి రోయి!" అంది కిచకిచ

"పోనీ" అన్నాడు గిరిగా

"కాక్కి చలేస్తదా!"

"మనలా చలేస్తే చచ్చిపోదా!"

వాన ఉధృతి ఎక్కువైంది. ఒక కిటికీ రెక్క మూసింది. తలుపుమీద ఒక జల్లు కొట్టింది. అరుగుమీద మూర్తులు గజగజలాడాయి.

"ఉండ్రోయ్... ఉండరా!" కిచకిచ కాకిపిల్ల పెట్టినట్టు నవ్వింది.

"నీకెల్లా పొద్ది మరి!" నిన్ననవ్వులో గిరిగిరి అన్నాడు.

నేను దుప్పటి ఇంకా దగ్గరగా కప్పుకున్నాను. గదిలో ఎక్కడో "టక్, టక్" అని చినుకుల చప్పుడు వినబడుతోంది. అది చాలాసేపటినుంచి వినబడి పోయి ఇప్పటికి వినబడింది. ఎటో మాత్రం తెలియ లేదు.

"అమ్మల్లకన్న మొగ్గల్లోరు ఇంటిబుష్ప" అంది కిచకిచ.

"పాతగుడ్డలు కుర్రోడికి కప్పు"

"ఇయ్యాల్లో పెద్దగుడ్డ ఒకటి విచ్చాల్రా"

"ఎవరకే?"

"ఆమేడలో చదువుకునే బాబురా."

"ఎందు కిచ్చుకున్నా?"

"ఏం?"

"ఎన్నాల్లనుట్టి సూత్తున్నా ఆబాబుని!"

"లేదాలే, అంతా అనుమానమే నీకు... ...అంతా

నావంక నూత్తే......నీకు కోపం గాదంట్రో?"
వేళాకోళంగా కిచకిచ అంది.

"తోనలు దేరిన ఆడదాన్ని అందరికీ నూడాల నుంటది. నువ్వు జాగ త్తుండాలి... సదువుకునే కుర్రోళ్ల కాడ ఏ ముచ్చుకోక."

"తోనలు దేరమట్టే నా కెక్కువ ము ట్టెడతా రంతాను."

కొంతసేపు నిశ్శబ్దం– వానచప్పుడు తప్ప. ఆమూర్తులు అరుగుమీద నడుము వాల్చిన ధ్వని.

ఎదటిఇంటి బొంగురుగొంతుక : "పోనీ, ఆమూల మీరిద్దరూ పడుకోండి. నే నిల్లా గుమ్మందగ్గర వేసుకుంటాను."

మందరస్థాయి : "ఎల్లా గండీ!"

సన్నాయి "ఎల్లాగ? ఇక్కడ చిక్కుపడి పోయాను."
గదిలో ఏమూలో చినుకులు "టప్‌టప్" పడుతున్నాయి. బయట కొబ్బరిఆకులు గలగలమన్నాయి. పెద్దచినుకులజల్లు పెద్దచప్పుడు చేసింది. చలిచేత అరుగుమీద గజగజ.

"స లేత్తందిరా," కిచకిచ.

"సలేం టెకే, పీకిదాకా మెక్కి! ఇంకా దగ్గరగా జరుగు." గరగర బిగిసినపళ్లమధ్య నించి అన్నాడు.

"జ ల్లొత్తందిరా"

"తూరుపోనలు...ఎదర వోరసలో జ ల్లుండదు"

"కడుపు నిండు గుంటే... కొంచెం స లేత్తుంటే"
కిచకిచ గొంతుక ఏదో రహస్యం చెపుతున్నప్పుడు లాగ.

"ఈ వో సెల్చిపోతే..."

లోపలినించి – ఆకలిలాగ – నా గొంతుక్కి ఏదో అడ్డు పడింది. చలికీ – ఆకలికీ – పడదు. దుప్పటీ మంచంమీదికి గిరవటేశాను. ఇందాకటినించీ వేస్తున్న ఆకలి ఇప్పటికి జ్ఞాపకం వచ్చింది. రబ్బరుజోడు తొడిగి పంచి పైకి దోపి గొడుగు తీసుకుని అరుగు మీదకి వచ్చాను.

"అయ్యగో రున్నా రింట్లో" గరగర.

తలుపు తాళంవేసి గొడుగు తెరిచి రోడ్డుమీదికి దిగాను. దారి జారుతోంది. చేతిలో గొడుగు ఒణుకుతోంది. ఒక అరుగుమీద కర్రతలుపుల మధ్యనించి కొంచెం వెలుగూ, కుట్టుమిషనుయొక్క వానవంటి జోరు వస్తున్నాయి. ఇద్దరు ఒకటేతువ్వాలు కప్పుకుని చెట్టాపట్టాలు వేసుకుని పళ్లు టకటక మని పిస్తూ పోతున్నారు.

హోటలు గుమ్మాలు ఎక్కి గొడుగు ముడిచాను. నేల అంతా తడికాళ్లతో తడిసింది. ఎలెక్ట్రిక్ దీపాలచుట్టూ దోమలు దెబ్బలాడుతున్నాయి. విస్తరి దగ్గర కూర్చున్నాను.

నాపక్కన కూర్చున్న పెద్దమనిషి అతని స్నేహితునితో అన్నాడు "ఇంకా మీవాళ్లు రాలేదుటోయి?

"వొస్తే ఈ హోటలుకర్మం ఎందుకూ?"

"ఋతువు మారిందోయి!" ఇద్దరూ నవ్వారు.

ఎదురువరసలో విద్యార్థులు ఇద్దరు పరధ్యానంగా భోజనం చేస్తున్నారు?

"మనలాడ్జిలో అంతా వానేరా! రాత్రి ఎల్లాగో గాని" ఒకడు అన్నాడు.

"రెండోఆటకి సినీమాకి పోదాం ఏరా?" రెండోవాడు.

"ఏమి టీవేళ?"

"ఏదో టార్జాన్‌ఫిల్మ్‌లా ఉంది."

నేను తొందరగా భోజనం ముగించి లేచాను. ఎదటివిద్యార్థులూ నాతోటే లేచారు. కుళాయిదగ్గర ముందు నేను చెయ్యి కడుక్కుంటో ఉన్నాను.

"దసరాకి తప్పకుండా ఇంటికి పోయి రావాలిరా. ఈహోటలు తిండి...ఇదీ ..." విద్యార్థులు అనుకున్నారు.

నాకు ఆకలి తీరినట్టు లేదు. పెరుగు కమ్మగా ఉంది. చల్లగా లోపలికి వెళ్లినా, ఎంచేతో చలి కొంచెం తగ్గింది.

"కడుపు నిండు గుంటే... కొంచెం సలేత్తుంటే... ..." అన్న మాటలు మరుపులోనుంచి జ్ఞాపకంలోకి వచ్చాయి.

అలవాటు పడినరోడ్డు వెంబడి ఇంటికి బయలు దేరాను.

తాలూకాఫీసులో కొట్టిన ఎనిమిదిగంటలు వాన చప్పుడుమీద తేలి వినబడ్డాయి. ఇంకో లోకంలో నించి వచ్చినట్టు. వానచప్పుడుతప్ప తక్కినచప్పుళ్లన్నీ అంతే – ఇంకో లోకంలోనించిలా వినబడు తున్నాయి. ఒక అరుగుమీద రెండుమేకలు పడు కుంటో లేస్తో అశాంతిగా ఉన్నాయి. చినుకుల తెరను చీల్చుకుని ఒక కారుయొక్క కళ్లవంటి దీపాలు నెమ్మదిగా సాగి వస్తున్నాయి–రెండుపక్క లకీ బురదనీ, నీటినీ చిమ్ముకుంటో వచ్చి వీధి మీద పడుతున్నట్టుగా. ఒక ఇంటి మెట్లుమీదికి ఎక్కి జాగ్రత్తగా నిలబడ్డాను. చూరునీళ్లు బరువుగా గొడుగుమీద పడ్డాయి. గొడుగూ నేనూ దడదడ లాడాము. కొంచెం ఎర్రటిరోడ్డు బాడి చింది, నా పంచిమీద మరకలు పడ్డాయి. కారు వెళ్ళిపోవడం తోటే రోడ్డు కారుచీకటి అయిపోయింది. చూరు పక్కనే నిలబడి సిగరెట్టు ముట్టించాను. పొగ హాయిగా వెచ్చగా గుండెల కిందదాకా దిగి పైకి వచ్చేస్తోంది. ఏదో అద్భుతమయిన సంబంధం ఉంది ఈ వానకి, చల్లటి కమ్మటిపెరుక్కీ ఈ సిగరెట్టు వెచ్చని మత్తుకీ. పీల్చినప్పుడల్లా ఎర్రగా వెలిగి సజీవుడయిన స్నేహితునిలా అనిపించింది సిగరెట్టు. నాకు ఒక్కసారి గొడుగు ముడిచి రోడ్డుమీద కుర్రవాళ్లు తలకాయలమీదనించి గెంతుకుంటో పరుగెత్తా లనిపించింది. కాని నేను పరుగెత్త లేదు.

అరుగుమీదికి ఎక్కి గొడుగు ముడిచి తాళం తీశాను. 'అ...అ...మ్మో' అరుగుమీద ముసలిగొంతు నిద్రలో పలవరించింది.

'శ్ శ్ శ్ శ్' నెమ్మదిగా కిచకిచ జోకొట్టింది. అప్రయత్నంగా నేను ఆ పక్కకి చూశాను. ఆ చీకటిలో మూడుమూర్తులూ, అస్పష్టంగా, పుష్టిగా ఒకళ్ళ నొకళ్ళు అదుముకుని చలిని నిర్లక్ష్యంచేస్తో పడుకున్నారు. 'తోనలు దేరిన' ఆమెముఖం గుర్తు పట్టడానికి ఆ చీకటిలో సాధ్యం కాలేదు. అగ్గిపుల్ల గీసి ఆ చలిచీకటుల అద్వైతాన్ని భంగపరచడానికి నాకు సిగ్గువేసింది.

ముడిచిన గొడుగునించి ఏకధారగా నీరు కారి అరుగుమీద ఒక గీతలా పాకి కింద పడిపోతోంది. ఆ చీకటిలో ఎక్కడో దాగిన కొంచెం వెలుగు ఆ తడిగీతమీదపడి అద్దంమీదలా కొంచెం మెరుస్తోంది.

ఒకక్షణం అల్లా ఆగి లోపలికి వెళ్లాను. తలుపు దగ్గరగా మూసి అగ్గిపుల్ల గీశాను. పొడుగుపాటినీడలు గోడలమీద వంకరటింకరగా ఆడాయి. చిన్న కోడిగుడ్డుదీపం వెలిగించి, బాగా తగ్గించి గోడకి తగిలించాను. సగం తడిసినబట్టలు విప్పి పొడిబట్టలు కట్టుకున్నాను. తడిబట్టలు ఆరవేశాను.

తలుపు తెరుచుకుంది. గాలేమో ననుకున్నాను.

'గుడ్ నైట్ సార్...' బొంగురు గదిలోకి వచ్చాడు. 'మీరు భోజనాకని వెళ్లినట్టున్నారు. అబ్బ! ఏం వానండి! తెగ మొత్తుతోంది.'

బొంగురు నాతో మాట్లాడ్డానికి అదే మొదటిసారి. మేము ఎదురుఇంటి వాళ్లమయినా, మాపరిచయం మాభార్యలద్వారానే.

'మాకు కొంచెం ఇబ్బంది వచ్చిందండీ ఈవేళ.' బొంగురు తను వచ్చినపనికి ఉపోద్ఘాతం మొదలు పెట్టాడు. గొంతుక తగ్గించి అన్నాడు. 'ఆవిడ చూశారూ, ఆసన్నగొంతుకావిడ మధ్యాహ్నం తయారయింది మా యింటికి. మాఆవిడకి చిన్ననాటి స్నేహితురాలు. నిన్నే వచ్చి జగన్నాధపురంలో దిగారట. ఈవేళే చూడ్డానికి తయారయింది. ఏమంత మించిపోయిందో! ఆవిడ వచ్చిందిమొదలు ఇంకా కాస్త తెరిపి అయినా లేదు.' కొంచెం పొడుం ఎడమచేతులో వేసుకుని, కుడిచేతివేళ్లతో పట్టు పట్టాడు. ఎడమచేతిని టపటపా దులిపాడు. ఆవిణ్ణి పంపించేద్దామంటే ఎక్కడా బండి దొరక లేదు... మా వంటిల్లంతా వాన. గదిలో ఓ పక్క

కురుస్తోంది. రాత్రి ఎల్లా తెల్లవారుతుందోగాని.’ నేను పక్క దులిపి పక్క వేసుకున్నాను. శాలువా దులిపి మడతపెట్టి మంచంమీద పెట్టాను. చలిగా ఉన్నా నా కెందుకో ఉక్కగా అనిపించింది. ఆ బొంగురు రావడంతోటే గదిలో గాలి వేడెక్కి పోయినట్టుగా చిరాకుగా మంచంమీద కూర్చున్నాను. బొంగురు పచారుచేస్తున్నాడు. ఆయన నీడ ఆయనకంటే లావుగా, పొడుగ్గా వేగంగా గోడ మీద పచారుచేస్తోంది.

‘అల్లా కూర్చోండి’ అన్నాను నేను.

ఏదో జ్ఞాపకం వచ్చినట్టు బొంగురు ఆగి నరాలు ఒక క్షణం బిగబట్టి ఒక్క పీల్పుతో పొడుం అంతా పీల్చి ముక్కు మలుపుకున్నాడు. తరువాత కిటికీ దగ్గిర కుర్చీలో కూర్చున్నాడు.

‘మా ఆవిడాను ఆవిడాను ఆ గదిలో పడుకోవాలి. కొంచెం నేను ఈ రాత్రికి మీ యింట్లో...పడుకోడానికి...’

‘అల్లాగే మీ పక్కా అదీ తెచ్చుకోండి’ అన్నాను నేను.

‘తెచ్చుకుంటానండి బాబూ! మహా చెడ్డకష్ట మండి. చుట్టమెవచ్చి ఎదో ఆయి పట్టుకుంది వన్నట్టు... అయ్యో! అదీగాక ఎల్లాగిండీ! ఎల్లాగిండీ! అంటో కూర్చుంటే ఇవతలవాళ్ళకి మనస్థిమితం ఏమన్నా ఉండాలా బాబూ?...నాకు మహా చెడ్డ...’ ఇంకో పొడుంపట్టు పీల్చి ‘ఇప్పుడే వస్తానండి, పక్క తెచ్చుకుని’ అని వెళ్లిపోయాడు.

నాలో చిరాకు వర్ష ప్రహోరులా హెచ్చింది. దీపపు వెలుగులో నా మంచంపక్కని టపటప పడుతున్న చినుకులు కనబడ్డాయి. చిన్న కాలవ గట్టి గోడలో ఉన్న తూముదాకా వంకరటింకరగా ప్రవహిస్తోంది నీరు. మంచంమీద నడుము వాల్చాను. శాలువా కప్పుకున్నాను.వాన హోరు వినా లనుకోకుండానే వింటున్నాను.

వానహోరులాగే విధివిరామం లేకుండా వినబడుతోంది సన్నాయిగొంతు. “ఎల్లాగే? ఇక్కడె చిక్కడి పోయాను!”

బొంగురు గబగబా తలుపు తెరచి లోపలికి వచ్చాడు. అబ్బ! మహా దారుణంగా కొడుతోంది వాన ... అరుగుమీద ఎవరో పడుకున్నారండోయి పాపం... ఈ మూల వేసుకోనాండి?... శ్రీరంగ రంగా!... ఆపద్దుద్ధారక!... అమ్మయ్య తలుపు వేశెయ్యానాండి! ఆయన తలుపు వేసి వచ్చి వాల్చినపక్కమీద పడుకున్నాడు.

శ్రీరామం భజ శరణం...యుద్ధవార్తలు ఏమిటండీ! జపాన్‌వాడు మనమీద పడతా డంటారా? ఏం యుద్ధమో గాని బాబూ ప్రాణాలు తెంచుతోంది. ఎన్నాళ్ళో గాని ఇది... శ్రీరామం భజ శరణం... అమ్మయ్య ! అమ్మయ్య!... శ్రిత చింతామణిమ్.

ఆయన్ని చుట్టచుట్టి పరుపుతో సహా అవతలికి గిరవాటెయ్యా లనిపించింది కాని నేను కళ్లుమూసుకుని నిద్ర నటించాను. బొంగురు ఏదో మాట్లాడుతోనే ఉన్నాడు ఆత్మకథ.

ప్రాణాలు తెంచుతారు. మంచీ చెడ్డా ఉండాలి కాస్త. అందులో ఆడపీనుగు లయితే మహా చెడ్డ కష్టం...శంభో...శంభో... నిద్రపోయారా? ... నిద్రపట్టింది గావును.

నాకంటే ముందుగా ఆయనకే నిద్ర పట్టింది. ఏదో చిరాకు నాకు నిద్ర పట్ట నియ్యలేదు. ఈ వాన... ఇంత ఒంటరిగా నేను ఈ యింట్లో. గుర్రు పట్టి నిద్రపోతో పక్కని బొంగురు.

సన్నాయిగొంతు ఆగి ఆగి వినబడుతోంది ‘ఎల్లాగో గాని...’

‘జల్లు తగ్గిందిరా’ కిచకిచ సగం నిద్రగొంతుకతో అంది.

ఆ మెముఖం ఎల్లా ఉంటుందో చూడా లని ఎంతో కుతూహలం కలిగింది. ఆరాత్రి ఆవింతగా, కొత్తగా, ఎప్పుడూ ఎరగని ప్రాణిలా అనిపించింది. వాన కురుస్తో ఉంటే అంత సంతృప్తిగా ఉండే జీవిని నేను ఊహించుకో లేకపోయాను.

‘ఎల్లాగే... ఇంటిదగ్గర...’ సన్నాయి నిట్టూర్పు విడిచింది.

ఆమె ముఖం ఎల్లా ఉంటుందో చూడాలని అని పించ లేదు. ఆమెను నే నెప్పుడూ చూచి ఉండను. కాని ఆ రాత్రి ఆమె ఎంతో ఎరుగున్న మనిషిలా అనిపించింది— ఆ ఒంటరితనం, ఆ ఆదుర్దా.

రెండుఎలకలు కీచు మంటో ఇంకో లోకంలో జీవు ల్లాగ వాటినీడలతో కలిసి చటుక్కుని గదికి అడ్డంగాపరిగెత్తాయి. ఇంటికప్పు చిల్లులుపడి టపటప పడుతో ఉన్న చినుకులు మళ్లీ ప్రాణం పోసుకు విన బడ్డాయి.

అన్ని ఆలోచనలూ నాలో నీడల్లా అలుముకు పోతు న్నాయి. ఈగదిలో బొంగురూ నేనూ— ఇద్దరమూ ఒంటరిగా. కాని మా ఇద్దరి ఒంటరితనానికీ సామ రస్యం లేదు. ఒకదాన్ని ఒకటి ఎరుగుకుని అశాంతి పుట్టిస్తాయి.... ఎదటిఇంటిగదిలో సన్నాయి. మందరస్థాయీ ,.. ఒకరి హృదయపు ఆవరణలోకి రెండోహృదయం అడుగు పెట్టలేదు. ఎవరిఅశాంతి వారిదే. ఎవరి చిరాకు వారిదే.

గోడ నున్నదీపం రప్పు మంటే గోడలమీద నీడలు పొడుగ్గా పొట్టిగా సాగాయి గాలికి కదిలే నల్లటిచీర ల్లాగ. అరుగుమీద నిశ్చింతగా నిద్రిస్తో ఉన్న వాళ్ల శాంతి చల్లగా అప్పుడప్పుడు మెల్లగా గదిలోకి వ్యాపిస్తోంది. కాకి దండెంమీద సమాధిలో ఉంది.

ఆలోచనలు చెదిరిపోతున్నాయి. వానచప్పుడు జో కొడుతోంది....కిచకిచ ఒత్తిగిలింది...నా ప్రయా ణానికి సద్దుకుంటోన్నాను....సన్నాయి ఎల్లా గండీ. అంది జాలిగా...అంతటా నిండిపోయింది. ఓ ఆర్త నాదంలా ఎల్లాగండీ? అని...అన్నీ ఎల్లాగండీ అన్నాయి...రైలుపెట్టెలో ఒక్కణ్ణీ...వాన... చటుక్కుని పక్కబల్లమీద సన్నాయి ఎల్లాగ?... ఒక అవతారంలాగ... మా ఆవిడా నేనూ బండి మీద వస్తున్నాం?...తొనలుదేరిన ఆమె అగపడి ముష్టి అడిగింది....మా ఆవిడ చిరాకు పడింది.... ...నాగది తెరిస్తే...ఎవరూ!!...బొంగురు కాదు... సన్నాయి అక్కడ పడుకుంటూ!!!...'ఎల్లాగ?'... 'ఎల్లా'......'ఎ...ల్లా'.

మొగంమీద ఎవరో మొట్టినట్టు అనిపించి ఉలికి పడి లేచాను. నుదురు తడిగా ఉంది. ఎడమకంటి మీదుగా చెక్కుమీదికి నీరు కారింది. తలగడా మీద టప్‌టప్ చినుకులు పడుతున్నాయి. క్రమంగా మసగ విడి మెలుకువ వచ్చింది. మంచం దిగి పక్కకి ఈడ్చాను. మూసినకిటికీ తెరిచాను. బొంగురు వెళ్లిపోయాడు. వెలుగు పశుత్వంలా కళ్ల మీదికి వచ్చిపడింది. కాకు లన్నీ లేచి కావు కావు మంటున్నాయి.

ఆదుర్దాగా అరుగుమీదికి వచ్చాను. అరుగు కాళీ. నిద్రకళ్లు నులుపుకున్నాను. కాళీ! చేతులారా ఏదో పోగొట్టుకున్నట్లు అనిపించింది.

కాకు లన్నీ ఒకటేగోల 'కావు కావు' మని. వాన కురుస్తోంది.

# సంక్రాంతి కల

[ మొన్నరాలిన పసిమొగ్గ మా 'బాబీ' స్మృతి ]

ఆనాటి నీమంద
హాసరోచిస్సులో
చిక్కుకొనె మాబాబు
చిన్నినవ్వులమాల;
జారవిడ లేదుగా దారి నేకడనొ
కొని తెచ్చినావటే క్రొత్తసంక్రాంతి ?

దిద్ది తీర్చినది నీ
తెలి ముగ్గు రహదారి
ఆనాటి మా యయ్య
అడుగుజాడ ల వేవి ?
కంట బడ వేలనే కను బొడుచుకున్న ?
చెరుపుకొన్నావుగా చెనటిసంక్రాంతి ?

వలపారు నీ చేతి
కలల విరి సెజ్జలో
కన్నయ్య తెలిచూపు
కల్వపూసరు లేవి ?
ఏలనే ఈగడ్డి పూలపెంధూళి ?
తావు లూడ్చిన మ్రోడుతీవ సంక్రాంతి !

స్వాగతమ్మను నీకు
భోగిమంట నివాళి,
ఆరని చితిమంట
అయ్యో నాయెదకు !
ఆజ్యమ్ము వోయకే అంటినజ్వాల;
రగిలింపకే నిప్పుసెగల సంక్రాంతి !

కొనకళ్ల వెంకటరత్నం

# కాలగతి

బి. వి. శ్రీనివాసాచార్య

ఎన్నిమారులు కాలవాహినికి నెదురు
తిరిగి ఇట నాగిపోవ యత్నించినాను !
చిర మటులనే, జనని అంకసీమయందె
శిశువునై యున్కి వలచితి చిన్ననాడు;
కాల మనెడి రక్కసునకు జాలి లేదు!

ఆటపాటలతోడి బాల్యమ్ము గడపి
బ్రతుకు కడలిని వల వేయ బనుపువేళ
పెనగులాడగ నేల దుర్విధి నెదిర్చి ?

లోకపుటా వేదనల యెండ సోక నీక
చల్లనైన వృక్షమువోలె సాకినట్టి
మాపితృస్వరూపము తెరమాటు చేసి,
బ్రతుకుబరువులె త్తెడిముహూర్తమున- 'వలదు
మోయ లేను భార' మని వాపోవ లేద !

ఇపుడు నేనును తెరపైన నెగురు నొక్క
బొమ్మనైతి నీ నాట్యరంగమ్మునందు
గజ్జెకట్టి కంఠము శ్రుతి గలిపికొంటి.

ఈ ప్రవాహమ్ము నన్నిట్టు లెంతవరకు
తీసికొనిపోవునో ! ఎట దిగవిడచునొ !

## గాన మాధురి

నీగానమాధురీనిర్మలోర్మికలపై
తరళగతి పయనమై తరలు నుత్కంఠతో
పూవుడింగీవోలె పొలిచినది బ్రతుకు
తావులం దేలు నేదీవి చెంగటకొ !

పూలదొన్నెల తేనె జాలువారిన యట్లు,
చిగురాకుపై మంచు చిటిలి రాలినయట్లు
పోహణింతువు కళల్ పుల్క లెద నిండ,
తొల్కరించిన నోటి మొలకలై నిగుడ.

నవవధూమృదుభాషణములోని తరితీపి,
కన్నయ్యకనుల మాగన్ను నిద్దుర మంపు
కలికి పాటలలోన మలచుకొన్నావా !
జిలుగుమెత్తని వేళ్ల చిన్నారి కొసల.

నీవు పాడినపాట నిలిచి తొణికిసలాడి,
పన్నీటి సరసియై పరిఢవిల్లినచోట,
మున్కలిడిరా మనసు మోహరించేను
ఒడలు దువ్వలువలా విడిచి తటిప్రోల.

---

[శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడు గారి కచేరి తర్వాత]

## దేవా!

ఈకన్నెవిరులలో
ఎంత చిక్కనిమెరుగు
లొల్కబోసితి వోయి దేవా !
పూలు ముడిచేనేర్పు
చాలు నీ కని నన్ను
తూలనాడితివోయి దేవా !

కన్నయ్య నిదురలో
కమ్మనైన ప్రశాంతి
గ్రుమ్మరించితి వోయి దేవా !
బిడ్డలను గనుప్రజ్ఞ
భిక్షమా నా బ్రతుకు
భికిరంపు పాత్రలో దేవా ?

ఈరసాల ద్రుమాళి
కిన్ని తీయని పండ్లు
పరుల కిమ్మని పనిచి దేవా !
ఫలరసమ్ములతీపి
పట్టించుకో నాకు
కుక్షిమాత్ర మొసంగినావా !

కొనకళ్ల వెంకటరత్నం

## ఏలా ?

మొక్కపాటి సుబ్బారావు

నువు లేనీ వెన్నెల యేలా
పూదోటా నీడలు యేలా
నీనవ్వుల వెలుగులలోనే
నే నెరిగితి వెన్నెల సౌఖ్యం !

నువు లేనీ చంద్రుడు యేలా
పూలలో వెన్నెల లేలా
నగుమోమూ నిన్నూ కాంచే
బా గంటిని చంద్రునిరూపం !

నువు లేనీ కోయిల యేలా !
పువుదోటల పాట ల వేలా
నవ్వించే భామవు లేకా
కవ్వించే సౌఖ్యం లేకా !

# శిల్పబాల

**అడివి బాపిరాజు**

౧

**అన్వేషణ**

నీల మహాగభీర పథ
నిశ్చలయామిని సర్వతారకా
గోళమయూఖ కాంతి
సితకోమల కౌముది చంచలాముఖా
లోల లలాటికా రుచుల
లోహిత సుందరమూర్తి సాంధ్య బా
లాలలితాబ్జ లోచనముల౯
పరీక్షించెద యుష్మదర్థమై !

౨

**ప్రత్యక్షము**

పరవశులుత్రొక్కుచు వెలుంగుతరంగముల
నొరయు సూక్ష్మ కణమ్ముల యొదులలోన
అరమొగుడు నీలపక్ష్మల స్ఫురిత మంద
హాససుందర ముఖనిర్గతాచ్ఛకాంతి
మృదుల బాహూపధానవై నిదుర జెందు
శిల్పమూర్తిని నిన్ను దర్శింప లేక
వేసరితి నిందు నందును వెదకి వెదకి !

౩

**సాగర శ్రుతి**

దెసల క్రీనీడ మొత్తముల్ తెరలు గ్రమ్మ
సాగరధ్వానమున శ్రుతి నంతరించి
సూక్ష్మ నిస్స్వనములు శ్రుతి సోలి ములుగ
తాళగతులు లయింప గీత మ్మొకండు
నేను గళ మెత్తి దీప్తరాగాన పాడ
అదియు ఉల్కావలె నెగసి యాశ లుజ్జ్వ
లింప వర్ణాల జిమ్ముచు లేమ, యిరుల
హృదయసీమ నదృశ్యవై యొదిగి యున్న
మూర్తి శిల్పాత్మలైన నీ మ్రోల నిలిచె.

౪

**ప్రియాగ**

ఏల వారించెదవు దేవి, యీ మనోజ్ఞ
కౌముదీపూర్ణ యామిని కంఠమెత్తి
నిన్ను మనసార పాడుచునున్న నన్ను ?
దరులు ముంచెత్తి మిన్నంట పొరలిపారు
చున్న దుర్వార గాంగజలౌఘమునకు
బిసకిసల బాహు వటు సాచి బేలవగుచు
సేతుబంధన యత్నమ్ము సేయుకంటె
రమ్ము హృదయ సింహాసన రాజ్ఞి, కృష్ణ
వేణికా పూరమై దేవి బెరసిపొమ్ము !

౫

**యాజ్ఞసేవి**

సురభి చందన తరుఖండసుంద రేంధ
నములు మత్పూర్వ వాసనా క్రమిత జీవి
తాళయమ్ముల నీ ప్రణయాగ్ని కీల
యజ్ఞ దీక్షాననుండనై యాహుతింతు
దేవి యెన్నటికేని తద్దివ్య ధూమ
మాలి కోత్థితమైన నీ మహితవర్ణ
రేఖకామూర్తి సాక్షాత్కరింపకున్న !

౬

## బధిర

నీవు బధిరవా దేవి యీనిర్మలంపు
క్రమయామినీ నిశ్చల కాంతివేళ
గాఢరాగ రాగాలాపకంఠునైన
నన్ను వినవు గాంధర్వప్రసన్నుడై క
రగి చిరునగవుల పులికణాల దేలు
అమృతకిరణుండు పారవశ్యమున కలగి
లాస్యయుక్తలైరి దిశాశుభాస్యలు చెలి !
ఏల కరగదు నీయెద యించుకంత
కలుగ దెచ్చటి దీ నిర్వికారజడిమ !

౭

## పూజ

ఆ నవారుణసంధ్యాపథాంచలాన
నృత్య చలితచరణ కింకిణీరవమ్ము
దివ్యగానాల లోకాల దేల్చినపుడు
గౌతమీతీరమందు సాక్షాత్కరించి
పరమ కల్యాణమూర్తివై వచ్చినావు
బద్ధ పద్మాసనుండనై భక్తివశత
కన్ను లరమోడ్చి భక్తి నేకమ్మొనర్చి
పూజ లొనరింపగ దలంచి పుణ్యశీల,
ధూపమైతి కర్పూరంపుదీప మైతి
దామమైతి మహానివేదనము నైతి !

## అద్వైతము

ప్రణయ రాజ్యాని కేకాతపత్ర మిచ్చి
చక్రవర్తిని చేసి నీ చరణయుగళి
హృదయ ధనరాశి కానుకగా నిడునొకండు
కంటకావృత భీకర గహనమందు
అంధకారము మాయించి ఆస లంట
జీవిత పథమ్ము నిర్మించు శిల్ప కాము-
దీరుచిర వంచు గొల్చు పథికు డొకండు.
చంద్రకాంత శిలాశిల్ప చతుర సంప
దద్భుతద్వార ప్రాకార ప్రాంగణ ధ్వ
జముఖ మండప గోపుర స్తంభ వివిధ
విగ్రహ మహా విమానాది విభవ మొలుకు
దివ్య దేవాలయమున ప్రతిష్ఠ చేసి
మంత్రము పఠించు శిల్పకర్మఠు డొకండు.
ముకుళిత హృదంబుజాళినీ మూర్తి వగుచు
చిరతరగవేషణాప్రాప్త చిన్మయ స్వ
రూపవై స్వానుభూతి నిగూఢ దివ్య
మంగళోజ్జ్వల దీపవై మామకీన
జీవితమవై మదాత్మవై సిద్ధరస వ
సంత మద్దేహవల్లివై —
ఇంత యేల
శివ నేనతి వేనతి నీవ దేవి !

# సహజ యాన పంథీ

( మూడు రంగముల గీతి నాటిక )

శ్రీ శివ శంకర శాస్త్రి విరచితము

---

~ అంకితము ~

శ్రీ చింతా దీక్షితులు అన్నగారికి

---

~ పాత్ర వర్గము

వృద్ధ బ్రాహ్మణ బృందము ... దేవీ దాసు
యువ బ్రాహ్మణ బృందము ... చండీ దాసు
నకుల దాసు ... రామ మణి
విశ్వంభర ఠాకూరు ... తారణి

## పీఠిక

ఇది చండీ దాసుచరిత్రలో ప్రధానఘట్టము. ఈ కథ మొదట ఎందులో చదివానో గుర్తు లేదు. రమారమి ౨౪ సంవత్సరాలకిందట శ్రీ దినేశ చంద్ర సేన విరచిత మైన వంగసాహిత్య చరిత్రలో స్పష్టముగా పఠించాను. అతర్వాత చండీదాసువిషయమై అనేక వ్యాసాలూ పుస్తకాలూ తిరగవేశాను. వంగభాషలో చండీదాస పదసముచ్ఛయము పఠించాను. అతని సాధనకు చాలా ముగ్ధుడనై ఆంధ్రములో ఈగీతి నాటిక రచించాను. మూడవరంగములో చండీదాసు రామమణిని స్తుతించే భాగము మాత్రము మాతృకలోని భావానువాదము. తక్కిన గ్రంథ మంతా ఉపజ్ఞాజాతము.

కృతులవలె గీతాలు కొన్ని కట్టుగా చేశాను. కాని నాటిక నడవ దని ఆవిధానము విడిచి Musical Speech వలె ఉండేపద్ధతి అనుసరించాను. ప్రదర్శనానికి బాగుండేటందుకు బృందగీతులు, నాట్యములు నడుమ న ధ్యమ విధించాను. మూడో

# ప్రతిక

రంగము మదరాసులో మహానట సభవారు ౧౯౮౧ మార్చిలో ప్రదర్శించారు.
చలన చిత్రములో కనపడే చండీదాసు చరిత్రకూ దీనికీ సంబంధము లేదు. అది జనసామాన్యము అనే వారిని సంతోషపెట్టడానికి నిర్మించినది. ప్రధాన కథాలేశము మాత్రము చాలా కొద్దిగా సరిపోతుంది. అంతే.

నాకు సాధనే ప్రధానము. కాబట్టి దానికి అనుగుణమైన ఆధారాన్నె అవలంబించి ప్రపంచించాను. సామాన్య దృష్టితో చూస్తే చండీదాసు జగత్తులో ఉత్తమ కామిజనములో గణ్యుడు: పారమార్థిక దృష్టితో, మధురసాధన చేసి, స్త్రీని జగదంబగా భావించి నిశ్శ్రేయసప్రాప్తి కాంచిననిరుపమానసిద్ధుడు. అందుచేతనే శ్రీగౌరాంగకృష్ణ చైతన్య మహాప్రభువులు చండీదాస చరిత్రకూ, పదాలకూ, ప్రమోదము చెంది ప్రశంస చేసినారు. తమచర్యలో రాధాతత్త్వము అవగతము చేసుకొని, శ్రీకృష్ణచైతన్యులు శ్రీకృష్ణునితో ఐక్యము పొందగలగడానికి కొంత వరకు చండీదాసుపదముల ప్రాబల్యమే కారణమని సంప్రదాయవేత్తలు లిఖించారు.

బౌద్ధులలో హీనయాన, మహాయాన, వజ్రయాన, సహజయాన గాములు ఉండేవారు. అందులో వంగదేశములో సహజయానము ఎక్కువ ప్రచారములో ఉండేది. శాక్తేయులు దాన్ని కొన్నిమార్పులతో అవలంబించారు. వారికి శూన్యపురాణము, గుప్తసాధన తంత్రము మొదలైనవి ప్రమాణ గ్రంథాలు. సహజయానమే చలితభాషలో సాహజీయా అయిపోయింది. ఆంధ్రదేశములో బాలా త్రిపురసుందరీ ఉపాసనలో దాని ఛాయలు కొద్దిగా కనపడతవి.

చండీదాసు శక్తిపూజలోనుంచి రాధాకృష్ణ భక్తిలోకి మారిపోయిన మార్గము చూపించవలెనని మొదట అనుకొన్నాను. ఆలోచిస్తే అది అనవసరమనిపించి మానివేశాను. అభిరుచిని అభినివేశాన్ని బట్టి ఒక్కొక్కరు ఒకవిధంగా రచిస్తారు. స్వభావతః సాధనతః నాకు హృదయంగమ మయిన పథమునే అనుసరించాను.

రామమణి పదకర్త్రి అని పరిశోధనవల్ల తేల్చిన వంగ వైష్ణవవిద్వాంసుడు ఆమె రచించిన మూడు పదాలు దొరకినవి, ప్రకటించినాడు. బ్రాహ్మణోత్తముడు, కవివతంసుడు, నవనీత హృదయుడూ అయిన నరోత్తముని అనురాగామృతమువల్ల అమరత్వము పొంది, అమృతవాక్కుతో అనేక పదాలు ఆమె చెప్పిన దంటే ఆశ్చర్యము లేదు.

వాశులీ, వాసవి, వాసుల – ఇత్యాది నామాలతో పూజలు పొందిన దేవత ఎవరో స్పష్టముగా తేలలేదని పురాతత్త్వవేత్తలు కొందరన్నారు. ఒకానొక మత ప్రకారము ఆమె వాగీశ్వరి. అగమవిదులు ఆమె పార్వతీదేవికి అపరావతార మన్నారు. చండీదాసు కుటుంబమువారు శాక్తేయులు కావడంచేత, దేవి పార్వతి అంశ అయి ఉంటుంది.

అఘోరపంథీ, నానక్ పంథీ, కబీర్ పంథీ అన్నట్లు సహజయానపంథీ అని నామకరణము చేశాను. గీర్వాణ సంప్రదాయము కాక, హిందుస్థానీ పద్ధతిని పెట్టినపేరు సహృదయులు సమ్మతిస్తారని నమ్మకము.

క్రీ. శ. ౧౩౫౦ ప్రాంతాలలో వంగదేశాన నాన్నూరు గ్రామములో ఘటన జరిగినట్లు భావించాను. కాల పరిమితి రెండువారాలు.

# ప్రథమ రంగము

(ఉదయకాలము, ప్రథమయామము. నకులదాసకుటీర మున కెదురుగా బ్రాహ్మణబృందము కూడినది. లోనుండి నకులదాసు వెలుపలికి వచ్చి వితర్దిక ప్రక్కన నిలుచున్నాడు.)

బ్రాహ్మణ బృందము

అకటా, బ్రాహ్మణులే
అక్రమమ్ము చేయ
మిగులు తెగలవారు
మీరిపోవ రొక్కొ... అకటా!...

శంభో! కలికాల
సామజంబు మిగుల
దృప్త మూచు వంగ
దేశమందు దిరుగు!... అకటా!...

ఇంతకన్న వేరె
హేయకార్య మేది
ధర్మవర్తనులను
తల్లడిల్ల జేయ?... అకటా!...

శుద్ధభూసురుండు
శూద్రయువతి నొక్కతె
వలచె నన్నదుష్ట
వార్త పుట్టె నేడు!... అకటా!

బ్రాహ్మణమ్ము కేమొ
ప్రళయ మావహించి
సర్వనాశనమ్ము
సంఘటించు వేగ!... అకటా!...

నకుల దాసు

ఏల ఆర్యులార, మీకు
ఇంతటియుద్వేగ మొదవె?
శాంత మైనమీమానస
సరసియందు భంగపటలి
ఈవిధాన రేపినట్టి
దేభావానిలమొ కదా!... ఏల...

అస్మదాదు లీగ్రామము
నం దతిసామాన్యు లగుట
ఆర్యులార, మీచేతో
వ్యథ యెటు తొలగింపగలరు?... ఏల.

ఈప్రభాతకాలమందు
ఏమిటి కరుదెంచినారొ
ఆర్యమహాశయులు మదీ
యాంతికమును కడుగ వలతు... ఏల...

బ్రాహ్మణ బృందము

అంకురమ్ము గాంచి
ఆదిలోనె వెజ్జ
ద్రుతముగానె వ్యాధి
ద్రుంచివేయ మేలు... అంకు...

బ్రాహ్మణుండె కాని
భ్రష్టు డయ్యె నేని
అర్చకత్వమునకు
అర్హు డెట్టు లగును?... అంకు...

నేడు మొదలుగాగ
నీదు సోదరుండు

ఆలయమ్ములోన
అడుగు పెట్టరాదు!...అంకు...

న్యాయబుద్ధి వైన
నకుల దాస శర్మ!
తడయ కడపవలయు
ధర్మ విప్లవమ్ము!...అంకు...

నకుల దాసు

వలచినాడె శూద్ర జాతి
వనితను నాసోదరుండు!
నిమధ యోగ్యు డనుచు వాని
నిన్న మొన్న దాక పొగడి
నేడు వానిమీద పెద్ద
నింద మోపుచున్న వారె!... వలచి...

అట్టికార్య మెంతమాత్ర
మాచరింప డని తలంతు:
నాకు దెలియునంతలోన
న్యాయవర్తనుండె చండి...వలచి...

కారణమ్ము లేక మీరు
కలత చెందువారు కారు.
శాంతచిత్తు లగుదు రేని
సత్య మేమో తెలిసికొందు...వలచి...

బ్రాహ్మణ బృందము

తొలుత రామి ప్రాంగణమ్ము
త్రొక్కకుండ జూడవలయు!
నిజధర్మం బేమొ తాను
నెరపి చనక దేవదాసి

బ్రహ్మచారి యయిన యువకు
భ్రమ పెట్టుచు నుండ దగునె? తొలుత...

తనయంతర మేమొ మరచి
ధరణిసురుని భ్రష్టు జేయు
కండ కావరమ్ము వేగ
కరగించుట ధర్మ మగును...తొలుత...

నకులదాసు

ఎవరి నైన నొక్కసారి
హెచ్చరింప దగును గదా!
చెప్పినట్లు చేయకున్న
శిక్ష చేయ భావ్య మవల ...ఎవరి...

విపుల మయి ధర్మమునకు
విప్లవంబు సహింయింతుమె?
నిజము తెలిసికొన్న మీద
నిరోధింత మార్యులార! ...ఎవరి...

(బ్రాహ్మణబృందము నిష్క్రమించును. నకులదాసు చింతాక్రాంతు డయి వేదిక మీద గూరుచుండును. ఇంతలో పార్శ్వమునుండి యించుమించు ఇరువది యేండ్ల యువకుడు దేవీదాసు ప్రవేశించి నిలుచుండును. నకులదాసు తలయెత్తి చూచును.)

దేవీ దాసు

నమ్మబోకు నమ్మబోకు
నకులదాస, వీరినింద!
శుద్ధవర్తనుండు నీదు
సోదరుండు చండీదాసు!
పరుల కెట్లు తెలియు నతని
భావములో నైర్మల్యము?...నమ్మ...

ఓర్వ లేనివార లెవరో
ఊరక అపనింద వేయ
విసమువోలె ప్రాకిపోయె
విప్రకులమునందు గూడ...నమ్మ...

పాప మతడు రామమణికి
పదియడుగుల దూరమందు
నిలుచు గాని యొక్కమారు
నికటమునకు బోవలేడు...నమ్మ...

దానిని వీక్షించినంత
తగులములో బడినరీతి
భావించుట కేవలముగ
భ్రమ మనియే యెంచవలయు...నమ్మ...

నకుల దాసు

నీదు భాషణముల
నిండుసంతసంబు !
సరళవర్తనుండె
చండి, అయిన గాని
జాగరూకుడగుట
సముచితమ్ము కాద?...నీదు ..

కొంత లోకభయము
కూడ నుండవలద ?
అటులు కానినాడు
అప్రతిష్ఠపాలు!...నీదు...

దేవదాసివంక
తేరిచూచుచున్న
అనుమానింతు రన్న
ఆశ్చర్యమ్ము లేదు...నీదు...

దేవి దాసు

రామి యౌవనము
రమణీయంబే,
ఆభావముతో
అవలోకింపుడు

ఆకర్షించెడి
ఆనన మయినన్
అనురాగముచే
ఆలోకింపుడు.

ఆవదనములో
అతిమానుష మగు
కాంతి యేదియో
కానంబడు నట.

తన్మయుడై యా
దాసిముఖమ్మును
అద్భుతదృక్కుల
నాలోకించును!

నకుల దాసు

నీ కనిపించద
నిజముగ నియ్యది
అస్పష్టం బగు
యౌవన రేఖగ?...నీ కని...

రజకయువతిపై
రక్తి జనించెన
అవిదితముగనే
అంతరంగమున!...నీ కని...

ఇంక వివాహం
బెటులో చండికి

చేయుట శుభ మగు
శీఘ్రమ్ముగనే... నీ కని...

దేవీ దాసు

బహువిధముల నే
పరిశీలించితి,
కాదు యౌవన వి-
కారచేష్టితము ...బహు...

అనురాగము కా
దంతర్గూఢము,
కాయవాంఛయును
కాదు నిజమ్ముగ ...బహు...

తద్వీక్షణమున
ద్రవీభూత మై
ఆతనిహృదయం
బతిమధురం బై —

అప్రయత్నముగ
అంకురించినది
కమనీయం బౌ
కవితాబీజము!...బహు...

నకుల దాసు

ఇది నూతనోదంత!
మెంతకాలం బాయె
చండి కుదయించి యీ
సహజకవితాశక్తి?

ఆదికవీశ్వరుం
డైన వాల్మీకులకు
శోకమ్ము వహియించె
శ్లోకరూపము తొలుత.

దేవదాసీముఖ ది-
దృక్షు చండీదాసు
కవిని జేసెనె! ఏమి
కర్మమ్ము విప్రునకు!

అనుదినమ్మును తాను
ఆరాధనలు చేయు
ఆవాశులా దేవి -
యానన ప్రభలచే

అతనిహృదయమ్ములో
అంధకారము తొలగి
ఆవిర్భవించు గా
కకలంక మాకవిత!

దేవీ దాసు

జగదంబికా ముఖ
చ్ఛవియె తోచును రామి
వదన బింబమునందు
వాస్తవమ్ముగ నాకు

అన్నా! మనచండి
ఆవేశమున మొన్న -

నకుల దాసు

శాంతం పాపమ్!
చాలును చాలును!
వినజాలను నే
విపరీతోక్తులు!

సకలచరాచర
జగజ్జననికిని

చాకలిదానికి
సామ్యమె! శివ శివ !

సరళ హృదయుడా
చండికి వలనో
మతి చెడిపోయిన
మాట నిశ్చయము!

చెప్పి చూడు నీ
స్నిగ్ధుడు కావున
విపరీతోక్తులు
విడిచిపెట్టు మని!

దేవీ దాసు

గతమానసమే చండి
కనక మారంభించె:
కాని శ్రీవాశులా
కారుణ్యపాత్రమై
అచిరకాలములోనె
అఖిల దేశములందు
భక్తుండు కవి యన్న
ప్రఖ్యాతి గణియించు.

సామాన్యముగ లోక
సంగ్రహార్థము మీర
లనుసరించెడి ధర్మ
మత డనుష్ఠింపండు.

సహజయానమ్ములో
సాధకుండాతండు:
అత్యంత యోగ్యుడే
ఆదృష్టితో జూడ.

నకుల దాసు

సాధన కైనను
శాస్త్రము వలదా ?
నిజభావంబే
నియమం బగునా ?

దేవీ దాసు

గుప్తసాధనతంత్ర
కోశ ప్రకారమ్ము
నవకన్యకలు:

విప్ర,
నట, శూద్ర, గోపాల,
కాపాలి కాంబష్ఠ
గణికా రజక మాలి
కా కార పుత్రికల్
కమనీయ విగ్రహాలు.

సౌశీల్య తారుణ్య
సంపన్నలు విశేష
వైదగ్ధ్య యుక్తలై
వరలు కన్యకలనే
అకలంక బుద్ధితో
ఆరాధనము చేయు
నాతండు సిద్ధుడౌ
ననుట నిస్సంశయము.

నకుల దాసు

శాస్త్రోక్తం బని
సమ్మతించినను
సహజయాన మెటు
సరళమార్గ మగు?

ఆ విధానమున
ఆరాధనయే
అనిపించును నా
కసహజ మనియే.

బహుశీఘ్రముగా
భ్రష్టుం డగుటకు
అను వగుయానం
బది యొక్కటియే !

దేవీ దాసు

చండి పదముల నొక్క
సారి పఠియించుచో
దెలిసికొందువు వాని
దివ్యప్రభావమ్ము !

నకుల దాసు

విధ్యుక్తధర్మముల్
విడువ రా దని చెప్పు.
వీని రచనలు తెచ్చి
వినిపింపు మొకమారు.

(నిష్క్రమించును. వేరొక మార్గమున చండీదాసు పరధ్యానముగా ప్రవేశించును.)

దేవీ దాసు

శూన్య దృక్కులతోడ
చూచుచున్నా వేల !
పలుకకున్నా వేమి
భావించుచున్నావు ?

చండీ దాసు

రామమణీ, రామమణీ !
రామమణీ, బ్రహ్మమయీ !

# ద్వితీయ రంగము

(సూర్యాస్తమయ సమయము. వాసులాదేవీ మందిరము వెనుక పుష్కరిణిలో మెట్లమీద కూరుచుండి రామమణి చింతాయత్తయై యుండును. తారిణి శాంతముగా వెనుకనుండి ప్రవేశించి—)

తారణి

ఏమే చెలియా,
ఏకాంతముగా
నుపవేశించితి
వుదకముపజ్జను !

వెదకి వెదకి నిను,
వేసరి చివరకు
చూడగలిగితిని
సోపానముపై !

పలుకవు చెలియా,
పరధ్యానముగ
సలిలము గాంతువు!
స్వస్థత యేనా?

నీ వదనముపై
నే దది యేమో
కనబడు చెలియా,
కమనీయద్యుతి !

లలితభావముల
లక్ష్యభూతముగ
కళ లూరును ముఖ
కమలము సఖియా !

అతిమధుర మ్మగు
నది తలపోయుచు
మున్నదానవలె
నొప్పెదు సఖియా !

వృత్తాంతమ్మును
వివరించెదు నెడ
ఈ నీ చెలియకు
ఎంతయు ముదమగు.

సంధ్యారాగ
చ్ఛవి నిమగ్న మయి
పసిడిబొమ్మవలె
భాసిలె దోసీ !

మనవంశమునకు
మంగళదేవత
చందముననగ ప్రియ
సఖి, నోచెదవే !

రామమణి

(పైకి చూచి లేచి)

ఆహా! యెంత మంచి
దమ్మ వాసులాంబ
సేవలోన నేను
చేరి నట్టి ఘటికి !
ఆహా యెంత...

నాటనుండి యేదో
నాలో తీయ నైన
కొత్తదనము నాకే
గోచరించు చెలియా !
ఆహా...

నాకు గానబడును
నందనమ్ముపోలె
ఆక్షణమ్మునుండి
అగ్రహారసీమ!
ఆహా...

(రామమణి నాట్యము చేయును. మందహాసముతో ఆమె బుజము తట్టుచు—)

తారణి

అవును సఖీ, అవును సఖీ,
అగ్రహారసీమ సఖీ,
కానబడుచునుంట కటులు
కారణమ్ము కలదు సఖీ!

నానూ్నరు గ్రామములో
నందనమ్ముపోలె నీకు
అగపడులే కేవలమ్ము
అగ్రహారసీమ సఖీ!

(నాట్యము)

రామ మణి

తెలిసియుండు కతన
విశ్వజనని చెలియా,
అగ్రహారభూమి
అగును నందనంబె!

(నాట్యము)

తారణి

తెలియు లేదె నాకు
దేవీమందిరంబు
వెలయుచుండె కాక
వేరే యున్నదిలే!

(నాట్యము)

రామ మణి

అగ్రహారమందు
అవనీదేవు లుందు:
రగ్రవర్ణ మన్న
ఆదరమ్ము నాకు!

(నాట్యము)

తారణి

అందు నౌకరి యెడల
అధికభక్తి లేదా!
భక్తికన్న తరణో
పాయ మేమి చెలియా!

అమ్మవారిమీద
అధికభక్తి నీకు;
అర్చకునిమీద
అంతకన్న భక్తి!

(ఉభయులు చేతులు పట్టుకొని నాట్యము)

రామ మణి

అనబోకే అనబోకే!
అవనిసురుల చెవిని బడిన
ఆచరణములోని కయిన
అడుగు పెట్టనీయరు గదె!
అన.........

ప్రేమయేని భక్తియేని
పెరవారికి దెలియనీక
మనసులోనె నిలుపుకొనుట
మంగళమ్ము ప్రాణసఖీ!
అన.........,

కొలదినాళ్ళ క్రిందనె కద
కోలాహల ముప్పతిల్లె!
భూసురోత్తములకు కినుక
పుట్టింపగ రాదు సఖి!
అన.........

(నాట్యము)

తారణి

వాలిన దే ఓసి, నీదు
నిలవుజూపు ప్రియసఖి!
ఉత్తమం బైనచోట
ఉన్నతం బైనచోట
వాలిన దే......

వెనక జన్మలో దళము
వేసి పుట్టినావు గదె!
కానిచో నీకు విప్ర
కామి యెట్లు దొరకునే!
వాలిన దే... (నాట్యము)

రామమణి

కామి అనకె తారణీ!
గాయకుండు సామాన్య
సరణిరక్తివా డలే!
సహజయాన పంథి లే!
కామి...

(నాట్యము)

తారణి

చదువుకొన్న దాననా!
సహజయాన మెట్టిదో
ఎట్టిసాధకుండో నా
కెట్లు తెలియునే చెలీ!

అయిన నడుగవలతు నొక్క,
టతడు నీబుజముమీద
చేయి వేసినా డేమొ
చెప్పగలవె ప్రియసఖి!

(నాట్యము)

రామ మణి

కలుగ నేల నీకు
కారణమ్ము లేక
ఈ కుశంక చెలియా?
పర్వరింపగలవె?

తారణి

కవిగాయకునకు
కలదా నీమీద
నిండురక్తి చెలియా!
నిజము నరసినావా?

రామ మణి

తెలియ కేమి, ధరణి
దేవుగానసమున
దీనురాలిమీద
దివ్య మైన ప్రేమ!

(నాట్యము)

తారణి

నమ్మకమ్ము లేదే
నాకు రామమణీ,
భ్రాంతి యేదో నిన్ను
పట్టి విడువ దాయె!
ప్రేమ మున్న ముద్దు
పెట్టుకొనడ నిన్ను?

గ్రుచ్చి కౌగిలించు
కొనవే వెఱ్ఱిదాన !
(రామమణి కన్నీరు విడుచును)

పెట్టుకొనకె నన్ను
పెండ్లియాడి నేమొ
తెలివితోడ మెలఁగి
తొల్లి వేసికొనవె !

రామ మణి

(నూతన సంస్కారములో)

నామీఁద ననురక్తి
నాథునకు లేదనియె
తలపోయుచున్నావె
తారణి, తారణీ !

కాదు లౌకిక మైన
కామ ప్రదీప్తార్చి
అతిమానుషం బైన
అనురాగదీప మది !

తారణి

అనురాగ లక్షణా:
లాలింగనమ్ములున్
చుంబనమ్ములు తల్ప
సుఖసమాజమ్ములున్.

మాకు దెలిసిన విధమె !
మనసులో ననురక్తి
గుప్తమ్ముగా నుంచు
కొన్న లాభం బేమి?

వాఙ్మనః క్రియలలో
వలపు మలపులు దెలియ
పంచేంద్రియ గణమ్ము
ప్రమద భరితం బగును.

రామ మణి

ఈ ప్రేమములో
నేమాత్రమును
స్వారస్యం బే
సఖియా, తోచదే.

తారణి

దేహేంద్రియ సం
తృప్తి నొసంగిన
పిదపనె కాదా
ప్రేమ సఫల మగు !

ఈ మన తనువులు
హేయము లనియెడి
వేదాంతము నే
విన జాలను చెలి !

(నాట్యము)

రామ మణి

పరిణత స్త్రీ నీ
భావముల్ నెచ్చెలీ,
భర్తతో సంతృప్తి
బడయువలయును గదా.

అవివాహితకు నాకు
అట్టిసౌఖ్యము మీద
భావమ్ము లేదు: నా
పథము ప్రత్యేకమ్ము.

తారణి

నాకు గలుగుచుండు
కుసుమ సదుమ జాలి
నిన్ను దలచుకొన్న
నిక్కువముగ చెలియ!

షోడశాబ్దముల
సుందరాంగి దేవ
దాసి వృత్తిలోన
తగులు పడిన దకట!

పెండ్లి యాడి చెలియ,
బిడ్డలను గాంచి
నీవు సంతసింప
నేను చూడ వలతు!

(నాట్యము)

రామ మణి

పెండ్లి లేటికి నాకు చెలియ,

మొదట

పెండ్లి యేటికి నాకు సఖియ,
శ్రీ వాసులా దేవి జననీ

సతత

సేవలోనె సుఖము చెలియ!

(నాట్యము)

తారణి

అర్చకస్వామిపై నీకు

కలుగు

అనురాగమే మగును సఖియ!
అడుగవే ఒకసారి నిన్ను

పెండ్లి

ఆడు మని ఆయనను చెలియ!

రామ మణి

అడుగజాల నట్టిమాట!
ఆమహాత్ము దర్శనమ్ము
అహరహమ్ము కలుగునేని
అంతె చాలు నాకు సఖి!

అగ్రవర్ణజాతు డైన
ఆమహానుభావు డేడ!
రజకకులోద్భూత యైన
రామమణీదాసి యేడ!

తారణి

(ఆమె బుజము తాకి)

విస్మరింప దన్నమాట
విప్రత్వము చండీదాసు!
అట్టివాడు నీకు నాధు
డగుట యెట్లు ప్రాణసఖి!

దీప ముండగానె యిల్లు
తెలివితోడ చక్కబెట్టు
కొనుట మేలు, లోలోపల
కుమిలిపోవ నేల సఖి!

రామ మణి

పాప, మాయనకు
బ్రాహ్మణు డనియెడు
అతిశయమే లే
దంతరంగమున.

పత్నిగనో ఉప
పత్నిగనో నను

జూడదు చెలియా,
శుద్ధమానసుడు!
ఆనయనమ్ముల
నమృతము కురియును
నన్ను గాంచునెడ,
నమ్మవె చెలియా!

(నాట్యము)

తారణి

ఇట్టిప్రేమ శాశ్వత మని
యెంచరాదు ముద్దరాల!
బ్రాహ్మణు డెన్నటికైనను
పరిత్యాగశీలి చెలీ!

కౌముదీరసమ్ము గ్రోలి
కాలయాపనమ్ము చేయు
కవిజనోక్త యాచకోరి
కా విధమ్ము నీది చెలీ!

(నాట్యము)

రామమణి

స్వామివదన చంద్రికా
జాలపానమత్తమై
నానయనచకోరికల్
నాట్య మాడు నెచ్చెలీ!

అర్చకస్వామికరుణ
అమ్మవారికరుణ యుండ
అన్య మేది వాంఛనీయ
మనిలోన నాకు సఖీ!

(నాట్యము)

(వేణుపుంజము వెనుకనుండి మందగమనముతో దేవీదాసు ప్రవేశించును. స్త్రీ లిరువురు అతనికి నమస్కరింతురు.)

తారణి

(ముందరికి పోయి)

ఇటు దయచేసితి
రేటికి స్వామీ!
మీగమనములో
మిక్కిలి మాంద్యము!

ముఖమో చింతా
ముద్రిత మైనది!
అప్రియ మిపు డే
దైనను గలదా?

దేవీ దాసు

ఊహించినది నీవు
యుక్తమే తారణీ!
అమ్మవారికి కరుణ
అపసృతము రామిపై!

(ఆమెవైపు చూచును)

తారణి

(దీనముగా)

అది యేమి! సేవలో
అపచార మే మైన
చేసెనా మారామి?
చెప్పవలయును స్వామి!

దేవీ దాసు

రామికంఠము చాల
రమణీయ మెనదే:

నృత్యనాట్యములలో
నిపుణురాలే రామి.

సేవలో లోపమ్ము
చేయలే దేనాడు.

కాని శ్రీవాసులా
కరుణమాత్రము తొలగె!

తారణి

(విచారముతో)

అత్యాహితమే
మయినను పోసగెనె
అమ్మవారి కృప
అపసృత మగుటన్?

దేవి దాసు

అట్టి దేమియు లేదు:
అయిన నీ నెచ్చెలికి
శ్రీవాసులా సేవ
శీఘ్రమ్ముగా తొలగు.

(రామమణితో)

ధర్మకర్తలు నీకు
తమ నిర్ణయము దెలుప
ఆజ్ఞ యిచ్చిరి నాకు
అగ్రసోదగ్రులై —

తారణి

ధర్మకర్తలకు
దయ మృగ్యంబా!
అన్యాయం బీ
యానతి స్వామీ!

రామ మణి

(ధైర్యము తెచ్చుకొని)

ధర్మకర్తలకు
దయ లే దనకే!
దురదృష్టమ్మును
దూరిన లాభమె!

తారణి

నిష్ఠుర మగునీ
నిర్ణయమునకున్
కారణ మేమో
కనుగొనవచ్చునె?

రామ మణి

కారణ మేటికె
గడచిన దానికి?
ధర్మకర్తలకు
తల యొగ్గగ వలె.

దేవి దాసు

ధర్మకర్తలు సంఘ
ధర్మాలు పాటింతు;
రవనీసురుం డైన
అర్చకస్వామికిన్ —

దేవదాసికి నున్న
దివ్యానురాగంబు
కామసామాన్యమ్ము
గా గ్రహించినవారు.

దేవదాసి నతండు
దేవాలయమ్ములో

కాంచకుండగ జేయ
కర్తవ్య మనుకొనిరి.

తారణి

విపరీతము! దేవళమున
వీరి వియోగమ్ము వలన
అగునె ధర్మసంస్థాపన!
మన్యాయం బన్యాయము!

దేవదాసి వృత్తి వారు
తీసివేసినారు, కాని
అర్చకస్వామి నింక
నావలకుం బంపలేదు.

దేవీ దాసు

కొంతసుగుణమె! కాని
కుమరుగా నెన్నాళ్ళు
అమ్మవారికి చండి
అర్చకుడుగా నుండు!

తారణి

దాసిమీద మీచండి
దాసస్వామికి సైతము
దయ తప్పగ లేదు గదా
ధర్మ కర్తృ నిర్ణయమున?

రామ మణి

నేటినుండి నాకు
నీదు సేవ తొలగె,
కాని వాసులాంబ,
కరుణ మానకమ్మ!

(దేవళమువైపుచూచి నిశ్శబ్దముగా రోదనము చేసి తారిణి బుజముపై తల వాల్చును. ఆమె చేరి సను సయించును. ఇరువురును బయలుదేరి కొన్ని యడుగులు వేయుదురు. ఇంతలో వేణుపుంజము వెనుకనుండి నెమ్మదిగా అడుగులు వేయుచు ఆకసము వంక జూచును)

చండీ దాసు

రామమణీ రామమణీ,
రామమణీ బ్రహ్మమయీ!
తీరినదా నేటినుండి
దేవదాసివృత్తి నీకు!
నీవు దండ లేకుండగ
నేను సేవ చేయగలనె!
వాసులాంబ కేది మనపై
వాత్సల్యము రామమణీ,
రామమణీ, రామమణీ,
రామమణీ, బ్రహ్మమయీ!

# తృ తీ య ర ం గ ము

(దేవాలయ ప్రాకారమునకు ముందు ద్వారము
దగ్గర. రమారమి మధ్యాహ్న సమయము)

దేవీ దాసు

పాకకృత్యముల
పరిసమాప్తిలో
అవశిష్టము లే
మయినను గలవా ?

విశ్వంభరుడు

ఆయత్తంబే
అంతయు: బ్రాహ్మణు
లింకను రాలే
దేమి కతంబో ?

దేవీ దాసు

చాలదో పిలు పీ
సద్బ్రాహ్మణులకు
ఎంతటి యాగ్రహ
మీ సజ్జనులకు !

(చండీదాసు తలుపు తెరచుకొని యీవలకు
వచ్చుట చూచి)

ఎచటికి బోయెద
వే మిది చండీ,
ఇంకను దైన్యం
బేటికి చెపుమా !

చండీ దాసు

ఇంటివరుసను బోయి
ఎల్లవారల అన్న
పేరు పేరున నన్ను
పిలిచి రమ్మన్నాడు.

దేవీ దాసు

నకులదాస, అ-
న్యాయము చండిని
పేరు పేరునను
పిలువం బంపుట!

విశ్వంభరుడు

సత్వరమ్ముగను
చండీదాసా,
పొమ్ము పిలుపునకు:
ప్రొద్దెక్కినదే.

(చండీదాసు నిష్క్రమణము)

అన్యాయంబా
అతనినె పంపుట?
నకులదాసునకు
నయ మవిదితమా?

అంతరంగమున
అహంకార లవ
మపసృత మగు నీ
యాహ్వానముతో.

చండీ దాసే
చని బ్రాహ్మణులను
స్వయముగ బిలిచిన
శాంతి పొందుదురు.

౧౩

సంతర్పణకై
సమ్మతించినపు
డహంకారమున
కవసర మేలా?

దేవీ దాసు

అన్నపోరు పడజాలక
అంగీకారము చూపెను,
ప్రాయశ్చిత్తార్థమ్ముగ
భావింపడు దీని నతడు.

విశ్వంభరుడు

ఏది కలదో మానసమున
నెవరు చూడగలరు? కాని
బాహ్యావర్తనమ్మునకే
ప్రాధాన్యమ్ము దేవిదాస!

దేవీ దాసు

ప్రాధాన్యమ్మును సంక
ల్పమ్మునకే యొసగవలయు
కార్యమునకు కాదనియెడి
ఘనసూత్రము నెరుగవలయు-

విశ్వంభరుడు
(పైకి చూచి)

మన యదృష్టవశము చేత
మందముగా నున్న వాడు
నేడు దివాకర దేవుడు
నిజచండిమ చూపకుండ.

దేవీ దాసు

సంరక్షణకై యున్నవి
శాలలు ముఖమంటపమ్ము
లయినను సుఖభోజన మగు
నాతపమ్ము మందగింప.

(ఇంతలో కొందరు బ్రాహ్మణులు చెంబులతో ప్రవేశించి, తలుపు తీయగా లోనికి బోవుదురు. వీథ వెంట బోవుచున్న తారణి వారిని గాంచి కొంచె మాగి, ద్వారముపైపు నడుచును.)

తారణి

ఏ మిది స్వామీ,
ఎరుగం జెప్పుడు,
ఉత్సవ మేదే
నున్నద యియ్యెడ?

దేవీ దాసు

బ్రాహ్మణసంత
ర్పణ జరుగును లే,
అంగణభూమిని
అర్ధఘటికలో.

విశ్వంభరుడు

పో దూరముగా!
భూసురు లదిగో
అరుగుదెంచినా
రంతికమునకే.

(తారణి కొంతదూరము తొలగును. బ్రాహ్మణులు వచ్చి లోని కేగుదురు)

తారణి
(కొంత యావలకు వచ్చి)

వినగోరెద నీ
విశేష మేమో
తెలియం జెప్పుడు
దేవీ దాసా!

విశ్వంభరుడు

పో నీ కేటికి ?
భూసుర కార్యము:
చాకలిదానికి
స్థానము లే దిట.

(తారణి బయలుదేరును)

రజకకులోద్భవ
రామిమూలమున
సంఘటిల్లె నీ
ప్రేమ భూసురులకు !

తారణి

(వెనుకకు వచ్చి)

సంతర్పణ మన
సంతసమే కద
బ్రాహ్మణులకు : మరి
బాధ యెందులకు ?

విశ్వంభరుడు

బాధ యెందులకా ?
భ్రష్టుని జేసెను
చండీ దాసుని
చాకలి రామి!

బ్రాహ్మణు లెల్లరు
ప్రాయశ్చిత్తము
విధించినా రా
వెర్రి వటువునకు.

సంతర్పణ మీ
సందర్భమునసే.

వేసు కమాపణ
విప్రుల నాతడు.

రజకకులోద్భవ
రామిమీద సిక
పదము చెప్ప నని
ప్రతిజ్ఞ చేయును.

స్మరింప డిక నా
చాకలిదానిని
స్వప్నమునందును
చండీదాసుడు!

బ్రాహ్మణవటువును
పట్టిన పీడయు
మలగిపోవు నీ
మధ్యాహ్నముతో!

తారణి

దూషణ పడుటకు
దొరకెను రామియె!
మనబంగారము
మాత్రము మంచిది!

విశ్వంభరుడు

తెగువరి యెవ రిది
దేవీదాసా?

దేవీ దాసు

తారణి, రామికి
దగ్గరబంధువు.

తారణి

ప్రథమవారమున
ప్రణయం బెవరిది ?

చండీదాసుద ?
చాకలి రామిద ?

చెల్లును విప్రులు
చేసెడి దంతెయు,
నిమ్నజాతులకు
నిందలు తప్పవు !

తెలియక అడిగెద
దేవీదాసా !
స్వామికి చిత్తము
చలించిపోయెన ?

దేవీ దాసు

నలుగురును వేధింప
నకులదా నేతెంచి
బోధింప బోధింప
పోరుపడ లేకితడు
తలయూపినాడు సం
తర్పణము కావింప.
సమ్మతింపడ, బహి
ష్కారమ్ము నిశ్చయము.

(మరికొందరు బ్రాహ్మణులు వత్తురు. తారణి త్వరితముగా నిష్క్రమించును.)

నకుల దాసు

(బయటికి వచ్చి)

పంక్తిపావనులైన
బ్రాహ్మణుల్ రా లేరు,
చండి పిలుపందమిని
జాగు చేసెద రేమొ.

దేవీ దాసు

పిలువవలె నెల్లరను
పేరు పేరున చండి.
తుదకు దయచేయుదురు
దొడ్డవారలు వారు!

నకుల దాసు

ఏతెంతురేని వా
రెదురుగా జని మీరు
తోడి తెం డాదరము
తోడ సంగణమునకు.

(లోనికి బోవును)

విశ్వంభరుడు

ఆదియందు రామిమీద
అనురాగము మనచండికి
ఏవిధాన జనియించెనో
ఎరుగుదువా దేవీదాస?

దేవీ దాసు

విపణివీథియందు పండ్లు
విక్రయించుచున్న తరుణి
కడకు బోయి చండీదాసు
కావలయును ఫలము లనియె.

అంతలోన నెవ్వండో
అరుగుదేర నితనిమాట
మరచిపోయి, వానితోడ
మాటలాడజొచ్చె నామె.

కొన్నిపండ్లు వాడు వెంట
గొని చనగా, మనవానికి

ఫలము లొసగె నందుకొనుచు
పణ మొక్కటి యా సుగాత్రి.
" నిలువబెట్టినావు నన్ను
నీ వాతనితోడ మాట
లాడుచు నాపణమునకు త
దర్థభాగ మిచ్చినావు!"
అని చండీదాసు డడుగ
ఆమె మందహాసముతో
"అతనిమీద నాకు చాల
అనురాగం" బన్నదంట.

విశ్వంభరుడు

ఆశ్చర్యము లే,
పనదా మరి యా
పడతికి వేసిన
ప్రశ్నకు బదులుగ?

దేవీ దాసు

అనురాగం బనెడి శబ్ద
మాలకించి సంకిచండి
కంతరంగ పరివర్తన
మయిన దంట విశ్వంభర!

విశ్వంభరుడు

ఈమాత్రమునకు
నేమాత్రము నే
చలనం బొందను
సామజంబువలె.

దేవీ దాసు

ఆ క్షణమ్మునుండి
అనురాగముగూర్చి
చండీదాసు చింత
సలుప సాగినాడు.
దేవదాసి కొలది
దినములకు నతని
కర్తవశముచేత
కంట బడిన దన్న!

విశ్వంభరుడు

అర్చకుండు చండి
ఆలయమున నూత్న
దేవదాసి యైన
దీని గాంచి యుండు.

దేవీ దాసు

అవును: బ్రహ్మచారి
ఆలయమున దేవ
దాసి గాంచు కతన
తన్మయత్వ మొందె.

విశ్వంభరుడు

ఋష్యశృంగు చందంబున
నితడు దాని యురోజములు
పట్టి యేమి పండ్లివి యని
ప్రశ్న వేయ లేదు గదా!

దేవీ దాసు

చాలు నీదుపరిహాస
సరణి! రామమణి నతండు
భావించును దేవతగా
భక్తితో నిరంతరమ్ము.
చదువుకొన్నవా డగుటను
సరళహృదయు డగుటవలన

సాధనావిశేషమందు
సహజయానపంథీ యయ్యె.

(ఇంతలో బ్రాహ్మణులు రాగా, వారి నాదరముతో లోనికి బంపుదురు. వేరొకదిక్కునుండి తారణి, రామమణి ప్రవేశింతురు.)

తారణి

ఓసి వెర్రిదాన!
ఒప్పుకోవె యిపుడు
కనులతోడ నైన
గాంచినట్టి దాని!

విప్ర డెపుడు గూడ
విస్మరింప లేడు
అగ్రవర్ణజాతు
డనెడుమాట చెలియ!

ప్రేమ మేవిధాన
పెరుగు దోహదమ్ము
లేనియెడల, లోలో
లీన మగును గాని.

ఒక్కసారి యైన
ఒడలిమీద చేయి
పడని యట్టిప్రేమ
బద్ధ మెట్టు లగును!

రామమణి

(కన్నీరు విడిచి)

స్వామి ముఖము చివర
సారి కన్నులార
తనివి దీర జూచి
తనువు విడుచు దాన!

విశ్వంభరుడు

(దాని మాటలు విని)

ఏమి పనే రామ మణీ!
ఎవరు నిన్ను పిలిచినారు?
ఇచట నీకు హావిర్భాగ
మిచ్చువారు లేరు సుమా!

పొమ్ము పొమ్ము శీఘ్రముగా!
భూసురోత్తములు వత్తు!
రేమి కదల కున్నదాన
విచటనుండి రామమణీ!

(ఇంతలో బ్రాహ్మణాలు వత్తురు)

దేవీ దాసు

వేచియున్నవారు లోన
విప్రులెల్ల తమ గాకకు
సర్వ మాయత్త మాయె
సంతర్పణ కార్యులార!

(ఇంతలో చండీదాసు వచ్చును. అతనిని చూచి ఎలుగెత్తి)

తారణి

కడసారి మిమ్ము
గాంచి రామమణి
చచ్చి పోవు నంట
చండీదాస స్వామి!

(తల యెత్తి అతడు ముందుకు వచ్చును)

విశ్వంభరుడు

తిరుగ బెట్టెనా
దేవీదాసా,
పాగల్ చండికి
ప్రణయవ్యాధి!

(బ్రాహ్మణుల కలకలము)

నకుల దాసు

(లోనుండి వచ్చి)

ఏటికి వచ్చితి
రిచటికి మీరలు?
పొమ్ము రామమణి!
పొమ్ము తారణీ!

తారణి

వెడలిపోక మేము
విప్ర సంఘమునకు
పార్శ్వ దేశమందు
పాదుకొనము స్వామి!

(బ్రాహ్మణుల కలకలము. ఎలుగెత్తి)

కడసారి మిమ్ము
గాంచి రామమణి
చచ్చి పోవు నంట
చండీ దాస స్వామి!

(చండీదాసు తటాలున రామమణి కడకు బోవును)

నకుల దాసు

(ఆవేగముతో)

పట్టుకొనుడు పట్టుకొనుడు
పాగల్ చండీదాసును!
ఇచటి కేల దాపురించె
ఈ రజకపిశాచము, శివ!

విశ్వంభరుడు

(ముందుకు నడిచి)

చండి మైల పడినవాడు
చాకెత దేహమును తాకి
దిమ్మరించు జలకలశము
దేవిదాన, వానిమీద!

బ్రాహ్మణ బృందము

(సృవా గీతి)

శివ శివ విప్రుడు
చెడిపోయిన వా!
డేటికి సలిలం?
బెట్లు శుద్ధు డగు?

హర మహాదేవ!
అగ్రవర్ణజుడు
చాకెతపదములు
స్పర్శ చేయునే!

కలి ప్రభుత్వమే
కాకుండిన యెడ
ఇట్టియకార్యం
బెట్లు సంఘటిలు?

చండీ దాసు

(రామమణి పాదములకడ మోకరిల్లి దీనదృష్టితో)

వినదగవే నా
విజ్ఞాపనమును
రజక శిరోమణి
రామమణీ!

చల్లని దగునీ
చరణద్వయమును
శరణు చొచ్చితిని
రామమణీ!

నీ హృదయంగమ
నిర్మలరూపము

నిరుపమమ్ము గదె
రామమణీ!

కల్లోలం బగు
గదె నా చిత్తము
కనని యెడల నిను
రామమణీ!

ప్రాణాల్ కుదుటను
బడు నీదర్శన
భాగ్యం బొదవిన
రామమణీ!

నిర్మలినం బగు
నీ యనురాగము
నికషిత హేమము
రామమణీ!

కామగంధమే
కానరాదు నీ
గాఢరక్తిలో
రామమణీ!

రజకకన్యకవు
రమ్యాకారవు
రమణివి నాకో
రామమణీ!

తల్లివి నీవే
తండ్రివి నీవే
దైవము నీవే
రామమణీ!

నీవే మంత్రము
నీవే తంత్రము
నీవే స్వర్గము
రామమణీ!

బ్రాహ్మణ బృందము
(ధ్రువాగీతము)

వినలేము వినలేము
నీచవాక్కులు శివా!
రం డోయి రం డోయి
రండు బ్రాహ్మణులార!
చాలు జాలును విప్ర
సంతర్పణము హారా!
ఆలసింపకు డోయి
అలము పాపము మనల!

నకుల దాసు
(చేతులు జోడించి)

క్షమియింపవలె మహా
జనులార, మమ్ములను!
ఉద్ధరింపుడు పెద్ద
లున్మత్తు డగువీని!

చండీదాసు
(రామమణితో)

నిన్ను భజించిన
నిఖిలోపాసన
నెరపినయట్లే
రామమణీ!

తావకముఖశశి
దర్శనసుఖమున
ధన్యుడ నగుదును
రామమణీ!

నీ తారుణ్యము
నీ మాధుర్యము
నిరుపమానములు
రామమణీ!

దేవదాసివో !
దివ్యాంగనవో !
దేవి వాసవివా
రామమణీ!

వాస్తవమ్ముగా
వరప్రదాయిని
వాగ్దేవతవే
రామమణీ!

నీవు నిక్కముగ
నిగమత్రయజన
నివి గాయత్రివి
రామమణీ!

చాకెత వయ్యును
సకలచరాచర
జగజ్జననివే
రామమణీ!

బ్రాహ్మణ బృందము

(చెంబులలో నీరు పారబోసి)

అల మలమ్ ! వినజాల
మంబికా దూషణము !

నాన్మూరు బ్రాహ్మణులు
నగుబొట్ల పా లయిరి !

దుష్టాంగమును మనము
త్రుంచివేయుట మేలు !

విప్రసంఘమునుండి
వెలివేసినా మితని !

నకుల దాసు

(కన్నీళ్ళతో)

ఏమి చేయుదు శివా !
ఈ వానరమునుండి
తోడబుట్టినవాడు
దూర మై పోవునే !

బ్రాహ్మణ బృందము

(ధ్రువాగీతి)

చాకలిదానా !
జయము గాంచితివి !
కడుపు నిండెగా !
కదలుము శీఘ్రము !

బ్రాహ్మణ యువకులు !
భద్రము భద్రము
స్త్రీమాయలలో
చిక్కుదు రేమో !

దేవీ దాసు

(విప్పారిన నేత్రములతో ఆశ్చర్యముగా జూచుచు)

చాకెత యేదీ !
జగదంబికయే !
సరిగా జూడుడు !
సజ్జనులారా !

గిరా

బ్రాహ్మణ బృందము

(ధృవాగీతిక)

వీనిని నయితము
వెలివేసితి ! యిక
పదుడు పదుం డో
బ్రాహ్మణులారా !

అన్య బ్రాహ్మణ బృందము

(సౌమ్యగీతి)

చాకెత కాదే !
చతుర్భుజంబుల
జనని వాసులా
చ్ఛాయ గనంబడు !

బ్రాహ్మణ బృందము

కించి త్తయినను
కి మ్మన డేలా !
చండీ దాసుకు
స్మయమో భ క్తియొ !
మనవారల కిట
మతులు పోయినవి !
పదుడు పదుండో
బ్రాహ్మణులారా !
ఐకమత్యమే
హారించి పోయిన
దవనీసురులం
దక్కా టక్కాటా !
భ్రష్టత్వమునకె
ప్రాబల్యం బిక !
పదుడు పదుండో
బ్రాహ్మణులారా !

(బయలు దేరుదురు)

చండీదాసు

(అర్ధనిమీలిత నేత్రుడై)

రామమణీ, రామమణీ,
రామమణీ, బ్రహ్మమయీ !
రామమణీ, బ్రహ్మమయీ !
రామమణీ, రామమణీ !

# అనుబంధము

## (సాధన)

సహజమార్గ మెల్లవాగు
సంబరమున నుగ్గడింత్రు,
కాని కోటిలో నొకండు
గ్రహియించును సహజసరణి.

నాయికాసాధనలో
నరుడు స్వీయశరీరమ్ము
శుష్కకాష్ఠతుల్యముగా
జూచుకోవలయు సుమ్ము.

బ్రహ్మాండవ్యాపి యైన
ప్రణయతత్త్వ మెరిగినట్టి
సాధకుండు మాత్ర మగును
సహజయానపారగుండు

అధమగుణునియెడ నెట్లో
అనురాగము కలుగుయువతి
బ్రదుకు ముల్లు గుచ్చుకొన్న
ప్రసవమట్లు లగును గదా !

భ్రమను నీచనాయికా
ప్రణయసక్తు డయినవాడు
బాధ చెందుగద పిశాచ
పరీవృతుం డైనయట్లు.

దంతములకు రసన కుండు
దాంపత్యమె యట్టివారి
కలయిక : తరుణమ్ము నందు
కాటుపడుచు నుండు గాదె !

తరుణియె ప్రేమకు
తన్మయురాలై
శీలము విడువక
స్థిరముగ నుండును.

కనబడు నిర్ల
క్ష్యముగా జగతికి
ప్రణయము మనసున
పదిలము చేయుచు.

అనురాగముచే
నాయమ హృదయము
కామరహితమై
కడు నిర్మల మగు.

చూచుచు సమముగ
సుఖదుఃఖమ్ములు
పరిపూర్ణత్వము
పడయును క్రమముగ.

పరజన నిందకు
పాల్పడ వలయును
సంకల్పమ్మును
సడలగ నీయక.

సత్యమైన ప్రేమ కలుగు
సాధకుండు మండూకమ్ము
నాగుబాము నోటియందు
నాట్యము చేయింపవలయు.

ప్ర ● శ

దారమ్మున నెవడు మేరు
ధరణీధర శృంగమ్మును
త్రేలాడం దీయగలడో
విమలశక్తి యాతనిదే.

దంతావళమును లూతా
తంతువుతో నవలీలగ
బంధింపంగలుగు నతడు
ప్రణయసిద్ధు డగుట ధ్రువము.

స మా ప ము

# సాహిత్య సృష్టి *

జొన్నలగడ్డ సత్య నారాయణ మూర్తి

సత్యం శివం సుందరమ్, శాంతం శివ మద్వైతమ్' అనే పరమాశయాలను వ్యక్తీకరించేది సాహితి. తత్వశాస్త్ర దృష్ట్యా లక్ష్యమిదే. శాంతారణ్యా సీమల్లోను నదీ తటాలందూ గభీర సమాధిలో ఉండి మునీంద్రులు కవీంద్రులైనారు. తూర్పు దిక్కున కెంపు సొంపు తోచినప్పుడూ, నక్షత్ర రుచిరాకాశాన్ని తిలకించినప్పుడూ, ప్రభాత కనక రశ్మిలో వనరమ నవ్య సౌందర్య రేఖాసందీప్తమైనప్పుడూ, కౌముదీస్నాత అయిన భూదేవి కనులకు విందొనర్చేటప్పుడూ, అంబర చుంబి గిరిశిఖరంనుంచి వెన్నెల వాక అవిరతంగా జాలువారేటప్పుడూ, అనంతుని గసనాలవంటి ఉత్తాల తరంగాలతో సాగరము అనంతగీతిక లాలపిస్తూ నింగిమీది నిండు చంద్రుని చూచి మురుస్తూ మనో మోహన దృశ్యాన్ని ప్రదర్శించేటప్పుడూ, పల్లవిత మాకందా లెక్కి నిస్తబ్ధ నిశీథంలో అనంత విశ్వముమీద దృష్టి సారించి సమస్త భువనాలకూ మధుర సందేశం పంపిస్తూ మురిసిపోయి అనంత జీవకోటిని మురిపిస్తూ ప్రశాంత గీతికలు ఆలపిస్తూ తారకలతో ఆంతరంగిక మైత్రి చేస్తూ కోయిల కోమలి మధురభావ భిక్ష పెట్టేటప్పుడూ, సౌరభ వైభవాన్ని దశదిశలకు వెలారిస్తూ అందకత్తెలైన వనబాలలై అలరేబహుళ ప్రసూనాల నగుమోములు హృదయాన్ని పులకరింపజేసేటప్పుడూ ఆ కవీంద్రులు అనిర్వచనీయమైన తన్మయత్వంపొంది అంతరంగాల్లో భావభువనాలను సృష్టించి గంభీర వాక్కులతో వాటికి రూపం కల్పించారు. బాహ్య సౌందర్యాన్ని అవలోకించేటప్పుడు వారి హృదయాలు ఆంతరంగిక సౌందర్యంతో ప్రఫుల్లాలైనవి. ఈ సౌందర్యం భావానికీ, క్రియకూ సంబంధించినది. క్రియాసౌందర్యమే సంస్కృతి. బహుళశాఖా విలసితమైన సారస్వత తరువూ, అనంత భావమణి స్థగితమైన సభ్యత కవలబిడ్డలవలె అరణ్యాశ్రమోపాంతాల్లో వర్ధిల్లినవి. భావశబలతా, క్రియా సఫలతా అక్కడివే. ఆనందవ్రతము, ఉదారాశయోపాసనమూ ఈ గురుకులావాసంలోనే ఏర్పడ్డవి. మనయోగు లెంతసౌందర్య పిపాసువులు! మానసకాసారంలో మలయపవనస్పర్శ సృజించిన చిరుకెరటాలమీద హాయిగా ఉయ్యాలలూగే కలహంసలలాగా ఆత్మభావ ప్రవాహంలో రాజహంసలై పరితోష వీచికల్లో వారు డోలావిహారం చేశారు. కవులై, మహాప్రవక్తలై, సచివులై, ఆచార్యులై వారు వెలశారు. ముక్తిమూర్తులై వరలిన ఈ మహాత్ములను ముక్కుమూసుకొని ఎవరికైవారు దేవులాడినారని దుర్విమర్శ చేయుట న్యాయము కాదు.

'అరణ్య సందేశం' (The message of the Forest) అనే వ్యాసంలో రవీంద్ర కవీంద్రుడు, ఆరణ్యక ప్రాభవాన్ని ఉగ్గడించాడు. 'ఆరణ్యక' నామము దాని జన్మస్థల మేదో చెప్పుతూనే ఉన్నది. అక్కడ తత్వశాస్త్రానికి మతం తోడై వర్ధిల్లింది. సాహితికి నెచ్చెలిఅయి వెలసింది.

హిందూయుగంలోనే కాకుండా తక్కినయుగాలల్లో కూడా ఈ వైజ్ఞానిక దృశ్యం పొడకట్టినది. బుద్ధుడు, బౌద్ధమతం, బౌద్ధసారస్వతంకూడా సౌందర్యంలోనే ఉద్భవించినవి. వనంలోనే వర్ధిల్లినవి. లుంబినీవనం, గయదగ్గర ఉరువేలవనం, వారణాసికి సమీపంలోని లేళ్లవనం (మృగదావనం) జేతవనం, అనాథపిండికుని ఆరామం, రాజగృహ సమీపంలోని రమ్యమైన గిరిప్రదేశం, తక్షశిల, అనూరాధపురం, అమరావతి మొదలైన స్థలాలు బౌద్ధమతానికి, బౌద్ధసాహిత్యానికీ కేంద్రస్థానాలు. భారతీయ పరివ్రాజకులు చాలమంది టిబెట్, చైనా.

---

* మదరాసులో జరిగిన పరిషద్వార్షికోత్సవములో చేసిన ఉపన్యాస సారాంశము.

జపాను, సయాం, బర్మా, సింహళము, ఈజిప్టు, బాబిలను, పర్షియా, గ్రీసు, మొదలైన ప్రదేశాలకు వెళ్లి భారతీయ మత సందేశాన్ని సాహిత్య సందేశాన్ని అసంఖ్యాకుల మ్రోల ప్రకటించారు. మెగాస్తనీసు, ఫాహియాన్, హ్యూయనుత్సాంగు మొదలైన విజ్ఞానయాత్రికులు మన దేశానికి వచ్చి భారతాంబ అనుగ్రహించిన జ్ఞానభిక్షను కైకొని భారత మహిమను తమదేశాలలో జలదగంభీర స్వరాలతో చాటినారు. జిజ్ఞాసువులు అనేకులు వివిధ దేశాలనుండి వచ్చి మన ఆశ్రమాలలోనూ, తక్షశిల, నలంద, నవద్వీపము మొదలైన ప్రదేశాలలో వర్ధిల్లిన విశ్వవిద్యాలయాలలోను మన ఆచార్యుల చరణోపాంతాన నివసించి బహుళాంశాలను నేర్చుకొన్నారు. "నమో తస్స భగవతో అరహతో సమ్మా సమ్ బుద్ధస్స" అని "బుద్ధం శరణం గచ్ఛామి, ధమ్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" అని తథాగతుని వాక్కులను పునశ్చరణ చేసుకుంటూ మహిమోపేతమైన రచనలు చేసిన ప్రతిభావంతులు వారిలో అనేకులున్నారు. ఉపనిషచ్ఛిఖల నుండి జాలువారిన భావభాగీరథిలో పరమహంసలై ఓలలాడి అంతరంగికంగా తత్వారమును గ్రోలి మహిమోపేతమైన హృదయ పరిణతను పొంది వివిధ దేశాలలో వివిధసారస్వతాలకు అధినేతలై వరలి అద్భుత సంస్కృతిని సృష్టించారు. టిబెట్, చైనా, జపాను మొదలైన సీమల్లో బహుళ శతాబ్దాలకు పూర్వం వర్ధిల్లిన సాహితీ నాగరికతలుకూడా భారత ప్రబోధానికే ఋణపడి ఉన్నాయి. పాశ్చాత్యదేశాల్లో చారిత్ర యుగం తలచూపకముందు గ్రీకు దేశస్థులు క్రీటు ద్వారా ఈజిప్టుతో సంబంధమేర్పరుచుకొని అక్కడి సభ్యతలో నెలకొన్న భారతాశయాలను హృదయంగమం చేసుకున్నారు. క్రీ. పూ. ౩౨౭ సంవత్సరాన అలెగ్జాండరు మన దేశానికి వచ్చి వెళ్ళిన తర్వాత ప్రాచీప్రతీచీ దేశాలకు సన్నిహిత సంబంధము ఏర్పడ్డది. సెల్యూకస్ కూతురు హెలెన్‌కిని చంద్రగుప్తమౌర్యునికిని జరిగిన పాణిగ్రహణం ప్రాక్పశ్చిమ సంస్కృతులకూ, సాహిత్యాలకూ జరిగిన కల్యాణమే. పిదప అలెగ్జాండరు తన పేరిట అలెగ్జాండ్రియా నగరాన్ని కట్టడమూ అది గొప్ప విజ్ఞానకేంద్రమై ఆసియా, ఐరోపాల సభ్యతకు సంధిస్థలమై వర్ధిల్లడమూ అందరికీ తెలిసినవిషయాలే.

గ్రీసు నుంచి విజ్ఞానస్మృతులు ప్రతీచీఖండంలోని వేర్వేరు దేశాలకు ప్రసరించినవి. రోమనులు, పర్షియనులు భారతదేశములో ప్రత్యక్షసంబంధాన్ని కలిగి ఉన్నారు. పాశ్చాత్యదేశాలలో ప్రసిద్ధిపొందిన గ్రీకు, ల్యాటిన్, ఫ్రెంచి, జర్మన్, ఆంగ్ల సాహిత్యాలను పరిశీలించి భారత సాహితికిని, భారతతత్వశాస్త్రానికిని, భారత సంప్రదాయానికిని, భారత సంస్కృతికిని అవి ఎలా ఋణపడి ఉన్నాయో సోదాహరణముగా తెలుపవచ్చు. సౌందర్యోపాసనలోను, ఆనందవ్రతములోను, సత్యనిష్ఠలోను, ఉదాత్తభావమననములోనూ భారతదృష్టాంతాలను మేలుబంతులుగా చేసుకొని అన్యదేశాల తాత్వికులు, కవులు, ప్రవక్తలు, ఉత్కృష్ట రచనలు చేశారు. బహుళసాహిత్యాలలో వివిధ పాత్రలలోను, వివిధ కథా సంవిధానాలలోను, కథా ఘట్టములలోనూ వ్యక్తీకరింపబడ్డ భావదార్ఢ్యాన్ని, కళావిషయాలనూ పేర్కొని భారత వైజ్ఞానిక గంగోత్తరిలో నుంచి అవిరళంగా వెలాడిన మహిమోపేతపూరం వానిలో ఎట్లు అంతర్వాహినియై ఉన్నదీ చెప్పవచ్చును.

అతిసంక్షేపంగా ఈ వైజ్ఞానికాంశాలను ఇక్కడ సింహావలోకనం చెయ్యడానికి హేతువు ఉదాత్త సాహితీ పరమాశయ ప్రదీప్తమై ఉంటుందని, మహిత సంస్కృతిని మహిమీద నెలకొల్పి మానవ కళ్యాణానికి మార్గదర్శక మౌతుందని, గంభీరోద్దేశభరితమై చిరస్థాయిగా ఉండేది కాబట్టి సౌందర్య సౌష్ఠవ సౌమనస్య మాధుర్య సమన్వితమైన భాషణంలో అమరత్వ మహాత్వంచేత మండితమైన వచన పరంపరలో అది ఆత్మప్రకాశం కావించుకొంటుందనీ తెలుపవలెనని ఉద్దేశించడమే.

రసము, వ్యంగ్యము, ఔచిత్యమూ వీటి లాగానే అంతరంగిక బాంధవ్యాన వెలసే 'సౌందర్యము, సత్యము, శివము'అను ఆశయములునూ సాహితీహృద

యంలో ఒప్పి ఉంటాయనే విషయము మనకు తెలిసినదే. కేవలము విషయవివరణమే ప్రధానాశయంగా కల అర్థశాస్త్ర ఆరోగ్య శాస్త్రములు వాఙ్మయానికీ సాహితీభాషకూ ఎట్టి వ్యత్యాసముంటుందో తెలియ తగినది. దీన్ని గుర్తించినప్పుడు పూర్వోక్తాశయాలకు భంగం కలిగినప్పుడు, భాషా ప్రయోగాన్ని గురించి పోరాటానికి పూనుకోము.

విషయస్వభావాన్ని అనుసరించి శైలి నడవటము తథ్యము. రచయిత ప్రకృతిని అనుసరించి వాని హృదయంలో భావ ముత్పన్నమౌతుంది. సౌందర్య పిపాసువు, అసంగ స్రతుడు, కళాప్రియం భావుకుడు, భావనావీథుల్లో విహంగమై విహరించేవాడు అయిన కళాస్రష్ట సుందరభావాన్ని సృష్టిస్తాడు. అంద కత్తెలవంటి మాటలనే ప్రేమిస్తాడు. సాహితీ సీమంతినిని చక్కని చుక్కలవంటి రచనలతో అలంకరిస్తాడు. స్వర్గంలో సుందరాంగులకే తావున్నట్లు కళా ప్రపంచంలో సుందరసంశోభిత రచనలకే తావున్నది.

రసభరిత హృదయులూ: సౌందర్యానుభూతి కలవారు మాత్రమే ఉదాత్త సాహిత్యసృష్టిని చూచి ఆనందించగలరు. ప్రకృతులు ప్రతికూలమైనప్పుడు ప్రశంస ఎట్లు తలచూప కలుగుతుంది?

భాష నది వంటిది. పుట్టినచోట అది చిన్నదై ఉంటుంది. సముద్రపు దిక్కుకు పారేకొద్దీ దానిలో కొత్తనీరు వచ్చి కలుస్తూ ఉంటుంది. అనేక కేదారాలను తనిపి వాటిని సస్యసమన్వితము చేస్తుంది. కాలంగడిచే కొద్దీ క్రొత్తతలపులను, కొత్త పదాలను కొత్త సొంపులనూ పొంది భాష సౌష్ఠవసౌందర్యాలతో ప్రకాశిస్తుంది.

స్వతస్సిద్ధంగా తెలుగు మాధుర్య భరితమైన భాష. వేయి సంవత్సరాలకు ముందే నన్నయ నన్నెచోడ ప్రభృతులు ఈ అంశాన్ని గుర్తించారు. మన కవిత్రయం వెలసిన తరువాతనే ఆంగ్ల మహాకవులలో మొదటివాడైన ఛాసరు ఉదయించాడు. ఛాసరు కాలంనుండి బెర్నార్డ్ షా కాలంవరకూ ఆంగ్ల సాహితి ఏరీతి క్రమాభివృద్ధి పొందిందో ఆంగ్ల సాహిత్య విద్యార్థులు ఎరుగుదురు. నన్నయనుండి నేటి వరకూ ఆంధ్ర సాహిత్యంలో అటువంటి అభివృద్ధి లేదు. మన వాఙ్మయంలో చెప్పదగ్గ గద్యరచనమే లేదు. నన్నయ మొదలు చిన్నయ వరకూ గద్యమే లేదు. చిన్నయసూరి వ్యాకరణమూ గద్యరచనమూ తరువాతవారికి శరణ్యాలైనవి. చిన్నయ దృష్టిలో పడని రచనలు అనేకాలు ఇంకా అణిగిపడి ఉన్నాయనే విషయం ఆధునిక పరిశోధకులు ఎరుగుదురు. వాఙ్మయాన్ని సమగ్రంగా పరిశోధిస్తేనేకాని ఆంధ్ర భాషోత్పత్తి క్రమమును సూచించు సక్రమమైన వ్యాకరణాన్ని వ్రాయలేరు. ఆంధ్రానికి అరవానికి కొంత సంబంధ మున్నట్లు రెండు భాషలలోని శబ్ద జాలమును, ధాతువులను పరీక్షించినపుడు తెలుస్తున్నది. ఈ ధాతువుల పుట్టుపూర్వోత్తరాలను ఎరక్కుండా ఆంధ్ర శబ్ద చరిత్ర కూడా ఎరగకుండా జటిల పదసంకులాలైన సూత్రాలను సృష్టించి ఒక పండితుడు వాటిని వల్లె వేయమని శాసించినంత మాత్రాన గుడ్డిగా మనము అనుకరించ కూడదు. హేతువివరణ లేకుండా ఏ విషయమైనా సుబోధకం కాదు. శబ్దచరిత్రను, భాషాచరిత్రనూ సంపూర్ణంగా తెలుసుకొన్నవారే ఆదర్శ నిఘంటువును, ఆదర్శవ్యాకరణాన్ని సృష్టించగలరు. ఇలాంటి అధికారసంపత్తి కలవారు కీర్తిశేషులు మహోపాధ్యాయులు శ్రీ గిడుగు వెంకట రామమూర్తిగారు. వీరిచేత పూర్వోక్తకర్తవ్యాన్ని నిర్వహింపచేయించే బాధ్యత ఆంధ్ర మహాజనులమీద ఉన్నది. దుర దృష్టవశంచేత వారు ఈ బాధ్యతను నిర్వహింపజాలక పోయినారు. రమారమి ఎనభై యేండ్లు జీవించి ఆ మహాపండితుడు దివంగతుడైనాడు. ఆంధ్ర వసుంధరలో నిర్దుష్టమైన నిఘంటువు లేదు. భాషాగమనానికి తోడ్పడే వ్యాకరణము లేదు. ఈ లోపాల్ని మాపుచేయకుండా సముచితనియమాలను తెలిసికోకుండా పదప్రయోగాలను గురించి పోరాడడము కూడనిపని.

సైన్సుయుగంలో ఉచితమైన మార్పులు తలచూపడము నిజము. హేతువు తెలుసుకోకుండా, విమ

## ప్రతిక

గ్రహించి విషయాన్ని అవగతం చేసుకోకుండా అంధానుకరణానికి పూనుకొనేవారు తమ మనుష్యత్వానికి తలవంపులు తెస్తున్నారన్నమాట. వారు తమ హేతుశక్తిని వ్యర్థం చేసుకొంటున్నారన్నమాట. ఏ సాంప్రదాయాన్నైనా బోనులో నిలపెట్టి క్రాసుపరీక్ష చేసి అర్హత గుర్తించిగాని నేటి జిజ్ఞాసువులు దానికి అంజలి ఘటించరు. ఏ జీవితాంగణములోనూ నిరంకుశత్వము ఈ యుగంలో అధికారాన్ని చలాయించలేదు. ఆంధ్ర ధాతుచరిత్రను గాని శబ్దచరిత్రనుగాని జీర్ణము చేసుకొననివారు వాగనుశాసనులై విజృంభింపరాదు.

సైన్సుయుగ ప్రాభవంవల్ల స్థలకాల ప్రతిబంధకాలు దుల్లిపడ్డవి. రేడియోలవల్ల, ట్రంక్ టెలిఫోనులవల్లా అనుక్షణం ప్రపంచంలోని మారుమూల వారతోకూడ పరిచయము కలుగుతున్నది.

ప్రపంచజాతులు, సాహిత్యాలు ఈనాడు సన్నిహిత సంబంధం కలవై పోయినవి. యుగపురుషులైన సాహిత్యాచార్యులు ఇతర సీమలలోని రచనలను పరిశీలించి నూతనవిజ్ఞాన మొంది అపూర్వములు, అద్భుతములు అయిన కొత్త రచనలను ప్రసాదించి ఆంధ్రభారతికి అంతర్జాతీయ ప్రశస్తిని చేకూర్చి అఖిల ప్రపంచ సాహిత్యసమ్మేళన సమయమునందు ఆ దేవిని సింహాసనారూఢగా చేయుట ఆధునిక ఆంధ్ర రచయితలకు పవిత్ర కర్తవ్యము. స్థలకాలప్రతిబంధకాలవల్ల ఇతర దేశాలతోగాని, ఇతర వాఙ్మయాలతోగాని సంపర్కంలేని సమయంలో ఉన్న పరిస్థితులనే నేడు కూడా ఉండాలని తలచేవారు విజ్ఞాన పిపాసువులు కారు. కాలదిశావలయంలో రంగారు క్రొంగొత్త తళుకులపై నూతన రచయితలు చూపులు సారించుట ఉచితము. అన్ని కాలాలలోనూ, అన్ని దేశాలలోనూ, పాతబడక నిత్యనూతనాలై ఉండే భావాలు కొన్ని ఉంటవి. నైసర్గిక జాతిజీవితంలోనుంచి ఆవిర్భవించిన జాతీయాలనూ, సాంఘికాచారాలనూ, ప్రత్యేక జాతీయాశయాలను సూచించే భాషా ప్రయోగాలనూ, చారిత్రక విషయాలనూ, ఉల్లేఖించే భావబంధుర శబ్దాలనూ త్రోసిరాజనక ఇతరభాషాపరిచయంవల్ల చేకూరిన జ్ఞానాన్ని అనుసరించి రచనలో కొత్త పోకడలు ప్రవేశపెట్టుట మన కర్తవ్యము.

హేతురహితాలైన నియమాలనూ, సంకెలవంటి నియమాలనూ, దూరీకృతం చేయడమంటే సమస్త నియమాలకూ నీరువదలడమని కాదు. సహేతుకములైన నియమాలను సముచితమైన భాషాగమనానికి తోడ్పడే నియమాలనూ మనము శిరసావహించి తీరాలి. స్వాతంత్ర్యము కావలసిందే. కాని విచ్చలవిడి నడక కూడదు.

ఇంతవరకూ మన భాషాంగణములో ఉన్న లోపాలను మాపు చేసుకోవడము నేటి సాహిత్యసేవకుల కర్తవ్యము. సాహిత్యసేవకు లంటే ఏ కొందరు రచయితలో కారు. వ్యక్తిగతంగా ఎవరుకూడా నేడు దొడ్డపని చేయలేరు. దీన్ని గుర్తించబట్టే సోదరులు కొందరు ఈ నవ్యసాహిత్యపరిషత్తును నెలకొల్పారు. దీనిలోని సభ్యులు సంయుక్తంగా పూర్వోక్త కర్తవ్యాలను నిర్వహింపగల సమర్థులు. పెద్దలైన సాహిత్యోపాసకులు వీరికి చేయూతనివ్వవలసినబాధ్యత కలదు. విశ్వకళాపరిషత్తువారి సహాయ్యముకూడా అవసరమై ఉన్నది. పూర్వోక్తమైన వ్యాకరణాన్ని నిఘంటువునూ విశ్వకళాపరిషత్తువారే ప్రచురించే యెడల ఆంధ్రభారతికిని, ఆంధ్రజాతికిని, మిక్కిలి ఉపకారం చేసినవారౌతారు. విశ్వకళాపరిషత్తువారి ఆమోదం నవ్యసాహిత్యోపాసకులకు ఎంతో శక్తిని కూరుస్తుంది. ఆంధ్రశారద ప్రపంచ ప్రశస్తిని తేగలుగుతుంది. గ్రంథరచనాన్ని సుసాధ్యం చెయ్యగలుగుతుంది.

గద్యగ్రంథాలు లేని లోపాన్ని ముందే ఉల్లేఖించి ఉన్నాను. ఆంగ్లవంగాది భాషల్లో గద్యగ్రంథాలు బహుళంగా ఉన్నవి. దండి బాణ ప్రభృతి సంస్కృత రచయితలు తమ భావాలను విశేషంగా గద్యంలోనే బహిర్గతము చేశారు. ఆంధ్రదేశంలో గద్యరచయితలకు ఆదరానురాగాలు తక్కువ. గద్యంలో వివిధరీతి రచనలు ఉన్నవి. వ్యాసము,

కథ, లేఖ, విమర్శన, మొదలైన రచనా విధానాలు ఇతర భాషలలోవలె మన భాషలోకూడా సృష్టికావాలి. ప్రాచీప్రతీచీ రచనావిధానాలనూ, పూర్వాధునిక సంప్రదాయాలనూ పరిశీలిస్తూ యుగపర్యాయాను తెలుసుకొని కాలదిశావలయింపగా కన్నుంచిన నవ్యసాహిత్య పరిషత్తువారు ఈ లోపాన్ని కూడా పూర్తిచేసి తమ ధర్మాన్ని నిర్వహించాలి.

చారిత్రకంగా ఆంధ్రవాణికి కొన్ని మేళ్లు చేకూరినా కొన్ని చెరుపులుకూడా కలిగినవి. మన రాజన్యులు విశేషించి సంస్కృతానువాదాలకు అనుకరణ అనుసరణములకూ గము పౌగస్తలకు సంబంధించిన ప్రబంధరచనలకూ ప్రోత్సాహమిచ్చారు. రాజులు, రాణులూ పాత్రలుగా ఉన్న గ్రంథాలు మాత్రమే, పారితోషికాలు పొందుతూ వచ్చినవి. ఆధునిక ప్రపంచములో ప్రజాస్వామిక ప్రభుత్వం ప్రశస్తిని పొందుతున్నది. ప్రజాసమస్యలు అందరి ఆదరదృష్టిని ఆకర్షిస్తున్నవి. ప్రజాజీవితంలోని బహుళాంశాలు విశేషప్రాముఖ్యాన్ని పొందుతున్నవి. ప్రజలను త్రోసిరాజని సాహితి ప్రత్యేక జీవితాన్ని గడపలేదు. ప్రజాజీవితాన్ని సృష్టింపజాలే రచయితలు ముందంజవేయాలి. ఉన్నత తాత్విక వీథుల్లో మెలిగినప్పటికీ వర్డ్స్‌వర్త్ వంటి మొదలైన రచయితలు పల్లీయుల జీవితాన్ని ఇతివృత్తంగా చేసుకొని చక్కని పద్యాలు వ్రాశారు. దీనికి అతని Solitary Reaper దృష్టాంతము. బర్న్సు మొదలైన వారి ఉదంతము కూడా ఆంగ్ల సాహిత్య విద్యార్థులు ఎరుగనిది కాదు. సామాన్యజనులకు సాహిత్యాంగణంలో చోటిచ్చే టప్పుడు శైలిలో రచనా విధానంలో కూడా కొంతమార్పు అవసరమని మన రచయితలు గుర్తిస్తారు. రసప్రధానమైనదీ సౌందర్య సమన్వితమయినదీ గంభీరభావగర్భితమైనదీ ధ్వని బంధురమైనదీ సాహితి ఉన్నప్పుడు ఈ గుణాలను గ్రహింపగలిగిన వారే సాహితీ రచనలలోని మాహాత్మ్యాన్ని గుర్తింప కలరనే అంశం తెలుసుకొని అందరికీ తెలియాలనే విషయాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకుని పూర్వ

స్థిరత సాహిత్యాశయాలకు భంగం వచ్చే రీతిగా సాహిత్యగ్రంథరచనము చేయడము కళోపాసకులకు తగదనే సంగతి సత్యమని తెలుసుకొని నిమ్నతలాన ఉన్నతవీథికి ఉద్ధరింపడము వీరి కర్తవ్యమై ఉండాలి గాని తామే నిమ్నతలానికి దిగి తమలో ఉత్కృష్ట సాహిత్యాశయాలను గోతుగోతుల్లోకి దిగలాగ చూడడము అకృత్యమనే సంగతి తెలుసుకొని కృత్రిక భాషాప్రయోగము సుందర సాహితీ రచనము [illegible] రచించుటకు తమ ధర్మమును ఎరిగి సట్లయితే పాఠకులకు సహితమూ సుబోధకము మయ్యే మాటలలో లాలిత్యవంతమైన ప్రయోగాలకు అర్హతగల శబ్దాలను ఏరి తమ రచనలలో వాటిని ప్రయోగించి సాహితీదేవికి నమోఘక గమనాన్ని చేకూర్చ సామాన్య ప్రజానీకాన్ని నూతన రచయితలు తమ దరికి చేరదీసుకొనవలసి ఉన్నది.

రసగ్రహణ విషయమైనది మరొక్కమాట. చదివిన వారు రసగ్రహణ పారీణులని, చదవనివారు రసగ్రహణాలు కారని తలపరాదు. రసవిహీనహృదయులైన పండితులు అనేకులున్నారు. రసభరిత హృదయులైన పామరులూ అనేకులున్నారు. పామరులంమను అనేకులు కవులై ఉన్నారని ప్రపంచసాహిత్య చరిత్రలవల్ల తెలుస్తున్నది. పామరులలో అనేకులు పండితులవలె తమ అనుభూతిని, భావమును వ్యక్తీకరింప లేక పోవచ్చును. కళాకౌశలముతో వ్యక్తీకరింప జాలకపోయినా రసానుభూతి నందగల శక్తి పామరులలో కొండంత ఉన్నది. ప్రబోధమువల్ల రసగ్రహణశక్తి రాదు. అది సహజ ప్రకృతి ననుసరించినది. ఆరంభానికి చెరుపు, అకింతికు కష్టమును కలిగించు పద ప్రయోగములు పనికి రావు. పాండితీ విజృంభణమే రచయిత ఆశయమైతే అతడు చేయునది రసాభాసక్రియ.

వివిధ సంఘటనలు మనుష్య హృదయంలో పుట్టించే వివిధోద్వేగాలే వివిధరసాలు. దుఃఖింప వలసి వచ్చినప్పుడు దుఃఖింపనివారు, సంతోష సమయాలలో, సంతోషింపని వారు, కఠిన రసభరితులు

కావలసి వచ్చినపుడు అట్లు కానివారు మానవులలో ఎందరో ఉండరు. ఏ అల్ప సంఖ్యాకులో తప్ప తక్కినవారు ఆయా సన్నివేశాలలో వివిధోద్వేగములు పొంది ఉప్పొంగుట ఎరుగుదురు. ఆత్మపరిశీలనము కలవారు అరితేర లేదన్నప్పటికీ వారి ముఖచిహ్నాలనూ, హావభావాలనూ పరీక్షించి నప్పుడు వివిధరసానుభూతిని వారు పొంది ఉన్నారని గ్రహించవచ్చు. కళాకౌశలము గల రచయిత ఇలాంటి అనుభూతిని పఠితల హృదయాలలో సృష్టింపగలడు. ముద్దుగొలిపే చంటిబిడ్డవంటి చిన్ని తెల్లువమీద భూరిశిలాఖండం పడితే గుండె కలవారు సహింపలేరు. లలితమైన భావాలమీద బండరాళ్లవంటి శబ్దాలను దొర్లించేవాడు హృదయం కలవాడని ఎలా చెప్పడం? లాలిత్యలావణ్యాలను ఒలచే పదాలనే అతడు ప్రయోగిస్తాడు. ఈ విధమైన రచయితలను గుర్తించి ఈ పరిషత్తువారు వారిని ప్రోత్సాహిస్తారని నమ్ముతున్నాను. ఆదర్శరచనలను పరీక్స్తే శైలికి సంబంధించిన వివాదమై ఒకరినొకరు డీకొనేవారు తమ పోట్లాటలనుంచి మరలి సత్య సందీప్తాలై సౌందర్య సంశోభితాలైన (సత్యమూ సౌందర్యమూ విభిన్నాలు కావు కాబట్టి) రచనలను సృష్టించగలరు. దోషము విశేషించి పాఠకుల్లో కాక తమందే ఉన్నదని గ్రహింపవలసిన రచయితలు చాలామంది ఉన్నారు. ఆత్మపరిశీలనచేత స్వీయ గుణదోషాలను తెలుసుకొని క్రమంగా వీరు ముందంజ వేసి అనేకులకు మార్గదర్శకులై ఆదర్శ పూజనవల్ల వాగ్దేవిని అలంకరింపగలుగుతారు.

బంకించంద్ర, రవీంద్రులవంటి సుప్రసిద్ధ వంగ రచయితలు సాహిత్యాశయాలను తెలుసుకొని గొప్ప రచనలను చేసి ప్రపంచదృష్టిని ఆకర్షించారు. ఆధునిక యుగంలో అగ్రగణ్యమైనదని ఎన్నబడుతున్న ఆంగ్లరచనా విధానంమీద మనసుంచి వాటి ననుసరించి తమభావాలను కొత్తరీతులలో వ్యక్తీకరించారు. ఈ పరిషత్తుకు సంబంధించిన వ్యక్తులు కొందరు ఈ విషయాన్ని గ్రహించడము సంతోష దాయకము. క్రమనిష్ఠచేత వీరిరచనలు చక్కని పరిణామంపొందవలెనని ఆశిస్తున్నాను. జాను తెనుగులో విలసిల్లుతున్న పాటలూ గేయాలూ మనజనపదాల్లో ఇదివరకే విశేషప్రశస్తిని పొందినవి. కాని సంస్కృత వృత్తసమన్వితమైన గ్రంథాలే రాజాదరణ పొందుటచేత అవి మూలపడ్డవి. రాజాదరణ నేడు ఇంచుమించుగా తొలగిపోయినది. ప్రజాదరణమే నేటి సాహిత్యానికి అవసరమై ఉన్నది. దీన్ని పొందగోరేవారు సంస్కృత వృత్తాలమీదనూ, సంస్కృతపద సముదాయం మీదనూ తాము చూపే మక్కువకంటే నైసర్గికమైన తెనుగుపదాల మీదనూ, తెలుగుమాటలమీదనూ చూపిస్తారు. ఆశుకవనమూ అవధానమూ మేధాశక్తిని ప్రకటించేవే కాని కళానైపుణ్యాన్ని ప్రకటించేవి కావని, ప్రధానంగా ఎదుటవాని మెదడును కాకుండా హృదయాన్ని పలకరించే స్వీయహృదయసముద్భవ రచనమే సాహిత్యమనిపించుకొంటుందని తెలుసుకొని ఈ ఆశయసిద్ధి విశేషించి స్వీయమాతృభాషా ప్రయోగంచేత నిర్వర్తిల్లుతుందని గ్రహించి, ఉచితమైన రీతిగా వారు ఆంధ్రభారతిని సేవిస్తారు. కొందరు ధనాఢ్యుల పోషణవల్ల నెలకొన్న సంప్రదాయం వెనుకబడి ప్రజా సామాన్యం ఇచ్చే పోషణవల్ల తలయెత్తే సంప్రదాయం ముందంజ వేస్తుంది. ఆముహూర్తంలో నవ్య సాహిత్య పరిషత్తు సంపూర్ణ విజయం పొందగలుగుతుంది. కాలశక్తిని ఎవరు ప్రతిఘటించగలుగుతారు?

శిష్టవ్యవహారిక భాషా ప్రయోగము మాత్రమే ఈపరిషత్తుకు ఆశయమనీ అనడానికి వీలులేదు. ఆధునిక యుగానికీ, ఆధునిక సమస్యలకూ, ఆధునిక జీవిత విధానానికీ, ఆధునిక ఆశయాలకూ అనుకూలమైన భావ సామగ్రిని తమరచనలలో వ్యక్తకరించడము మన కర్తవ్యము. కవీంద్రుడు, మునీంద్రుడు అయిన రవీంద్రుని రచనలను పరిశీలించినప్పుడు ఈదృశ భావ సామగ్రి గోచరిస్తుంది. జాతీయత్వసిద్ధీ, అంతర్జాతీయత్వసిద్ధీ, రవికవి ఆశయాలు. భారత భాగ్యోదయాన్ని కాంక్షించి ఆయన జాతీయ గీతాలు రచించాడు మానవ కళ్యాణాన్ని కాంక్షించి మహదాశయ సం.

దీప్తాలైన గేయాలను రచించాడు. రవీంద్రుని మేలి దృష్టాంతాలను మేలుబంతి చేసుకొని ఇలాంటి రచనలు సాగించడము మన కవుల పవిత్ర కర్తవ్యము.

ఈ మహా సభలో మన కార్యక్రమం జరిగేటప్పుడు జపానువారు తూర్పున యుద్ధ విజృంభణము చేస్తున్నారు. శాంతి ప్రతిష్ఠ సాహిత్యాశయాలలో ఒకటని ముందే చెప్పాను. ప్రాచీనకాలంలో భారత సాహిత్యాచార్యులు శాంతి సందేశాన్ని జగతిలోని నానాదిశలకు పంపించారు. వాణి చేతిలో వెలిగేది వీణ కాని బాణంబు కాదు. భారత సేవ చేసే సమయంలో వసుంధరను సుమాధుర్యఫలితం చేయడం సౌందర్యదీప్తం చెయ్యడం మనపూర్వులు గ్రహించారు. మహిమోపేత భారత సాంప్రదాయం తెలుసుకొని ప్రపంచంలోని మనీషావంతు లందరూ ఈరోజున భారతమాతమీద దృష్టి సారిస్తున్నారు. శాంతి తారక మంత్రోపదేశాన్ని చెయ్యగలిగింది భారతమాత మాత్రమే. పన్నిటి వెల్లువలై ఈ తల్లి తలపును చల్లని పలుకులలో వ్యక్తీకరించి మనకవులు వసుమతిమీద శాంతి సేచన చేయుదురు గాక! జగతిని అనంత భరితంచేసి మహిత సాహిత్యాశయ సిద్ధిని చేకూర్చుదురు గాక! భారతాంబను, భారతిని ఆనంద పరితోషంలో ఓలలాడింతురు గాక! ఆనంద వ్రతములోను, సౌందర్యోపాసనలోనూ, ధన్యజీవులై వెలయుదురు గాక!

# నీ యడుగులు

**శ్రీ శివరామం**

నీ యడుగు సవ్వడులె జననీ! ధ్వనించు
ఆదికాలపుగాథలై అహరహమ్ము;
ఆగమమ్ములు, ఋక్కులు, అమరకావ్య
ములు, యుగమ్ముల సందేశములును అవియె.

నీయడుగుజాడలే తల్లి! నిలిపి నన్ను
పలుకరించెడు పావనస్థలము లటవె!
అవియె దేవాలయములు, ఋష్యాశ్రమములు,
మయసభలు, రాజరాజేంద్ర మందిరములు.

నీ యడుగుదారులే సవిత్రీ! యనంత
సరణు లయ్యె ప్రాక్పశ్చిమాశలకు నడుమ;
అవియె సౌరాపగలు, మహాహార్య దివ్య
సానువులు, లోకలోక నిశ్రేణు లవియె.

ప్రత్యుషశ్శతపత్రముల్, త్వత్పదమ్మ
లమరమందారములు, వినతాస్మదీయ
మస్తకన్యస్త పూజాసుమమ్ము లటవె!
ఓ తెలుగుతల్లి !...............

# రవీంద్ర నిర్యాణము

పెద్దిభట్ల రామచంద్ర రావు

అస్తమించెను రవికవి యస్తమించె!
లోకబాంధవు నిర్యాణ లోపముసను
జగతి యార్చిన యూర్పులసమయ మయ్యె.
కాళరాత్రిని పూర్ణిమ కౌగిలించె.

ఆత్మవికసన మొనరించు నట్టిగమన
మరసి రసభావబంధురం బైన మురళి
విశ్వమోహనగానమ్ము వినిచినాడు:
వేణువుం దాల్చు నీనాటి వెన్ను దేమొ!

మానవాభ్యుదయమ్మకై పూని యొకడె
విశ్వభారతి నామక విమల భూరి
గురుకులమ్ము సంస్థాపించి ధరణి కెల్ల
ఒజ్జబంతిగ జూపి మె ప్పొందినాడు।

అస్తమించిన రవి పున రవతరించు
సహజరుచితోడ ప్రాభాతసమయమందు
భువన మంతయు వెల్గును బోధతోడ
సకల లోకకల్యాణమ్ము సంతరించు!

# చండీదాసు

**(గేయ నాటిక)**

**రజనీ కాంత రావు**

(ప్రణయైకజీవియైన వొక వంగకవి జీవితకీర్తనం:
ఆల్ ఇండియా రేడియో, మదరాసు కేంద్రమున ప్రసారితం)

## పాత్ర పరిచితి:

చండీదాసు : ఆదర్శశీలి, రాధాకృష్ణభక్తుడు, కవియైన యువకుడు.

నకులదాసు : ఆయన సోదరుడు; విశాలాక్షి ఆలయంలో అర్చకుడు.

రామిని : చండీదాసునకు ప్రేమపాత్రురాలైన రజకిని; ఆలయదాసి.

పూజారులు, ధర్మకర్తలు, సాంఘికులు, లోకజనం...

## పూర్వ రంగము

=బృందగీతి=

ప్రేమగానము! ప్రేమగానము!
సకల జగదభి రామగానము!
ఆదికవి వాల్మీకి కోకిల
అమృత మంజుల సామగానము!
రామగిరి వని దివ్య వంశీ
విరహాపూరిత భవ్యగానము!
నాట్యదాత్మ సఖీ పదాంకిత
నవ్యతమజయదేవ గానము!
రజకినీ ప్రియుడైన చండీదాసు
విశ్వప్రణయగానము!
ప్రేమగానము! ప్రేమగానము!
సకల జగదభిరామ గానము!

* మద్రాసు ఆల్ ఇండియా రేడియోవారి అనుమతితో.

## ఒక టో రంగము

(నన్నూరా గ్రామంలోని-విశాలాక్షీ దేవాలయం,- గర్భగుడిలో శంఖధ్వానం, ఘంటానాదం,- ఆవరణలో సన్నాయి; - మంటపంలో పూజారులు)

=బృంద గీతి=

త్వాం నమామో వయం మాతరమ్!
నళినీదళ సంస్థిత శుభశయనే!
అళినీలాలక చుంబితనయనే!
లలిత మధుర హాసాంచిత వదనే!
అసితచ్ఛవి సంకాశితరదనే!
జగంత సరిత ప్రణవమూలినీ!
అనంత అచల ప్రణయగాయిని!
త్వాం నమామో వయం మాతరమ్!

=పూజారి=

మధుదాసా! మధుదాసా! చండీదాసును పిలు!

=మధుదాసు=

చండీ! చండీ! (పత్రిక మిస్తాడు)
ఇదుగో! ఇక్కడే - ఇంకా పూలు కోస్తూనే వున్నాడు. ఏవీ పూలు? ఏమిటిది చండీ! -

దేవి సేవించుటకు మించిపోవువేళ
సజ్జచేబట్టి పూదోట పజ్జ నిల్చి
వెర్రిగానమ్ముతో దృష్టి వ్రేలవైచి
ఒక్కటకును మమ్మయిన కోయకుంటివేల?

=చండీదాసు=

(నిమీలితదృష్టితో తన్మయుడై)

తలపు తెరల డోలలనూగు మనసే
చెలిమికలల జోలలతోగు సాగసే
పాడి, మనికి స్వర్గముగాగ
గడపివైతును!
గడియ గడియ మాధవు ప్రేమగాధ!
ఒడలు మరచు రాధిక తీయ బాధ!
పాడి జగమె బృందావనిగ
సలిపివైతును!

(దూరమునుంచి నేలవూడ్చే రజకకన్య - రామిని)

తెరువవులులేనిబాట!
మరపునకురానిపాట!

=పూజారి=

రా, చండీ, రా, ఇక లోనికిరా! అదుగో రజకని ఆలయపు వాకి వస్తూంది. మనం దానిని దరియ కూడదు. పద పదా.

=రామిని=

(నేల వూడ్చుతూ ప్రవేశం)

తెరువవులు లేనిబాట!
మరపునకు రానిపాట!
కరవునకు నెందునోట!
కింకయు సమృతంపునూట!

=చండీదాసు=

(ఆమె వెనుకగా-ని)

ఓహో తరుణారుణజ్యోతీ!
నీవాకరసదృశమే నీగీతి
దీనావనగు ఓనాతీ!
మానసమునకలిగెను ప్రీతి!

=పూజారి=

వెర్రి ముదురుతోంది చండీ! ధర్మచ్యుతి కలుగుతుంది జాగ్రత. ఆ నీచురాలి కూనిరాగముపైని ఆ

కవితా వ్యాఖ్య లేమిటి! అయ్యో! అనుకొని [illegible]
చేరువగా పోవు రా.

= రా మి ని =

(చండీదాసుకు మొక్కి)

మీ రెవరో మహామాన్య!
నేను పేదరజకకన్య—
వలపు బరువు తలపులచే
మీదు తేనెపలుకులచే
భయమున నామది కలంగు,
ప్రియమున నాయెద చెలంగు!
సరస నిలువరానిదాన,
క్షమియింపుము పోవుదాన.

= చ ం డీ దా సు =

మాధవమధుమురళీధ్వని
రాధాన్వేషణలో—
యుగయుగాలు జగజగాలు
వేచివేచి తిరిగితిరిగి,
బృందావనమందే, కాళిందీతీరమునందే,
సఫలమనోరథత కాంచె
మాధవమధుమురళి!

(కొందరు సాంఘికులు వృద్ధులు కలకలంతో చరచర వత్తురు.)

= సా ం ఘి కు డు =

పతిత జనములతోడ సంభాషణమ్మా
ధార్మికుడ! మాను, పాపసంధాయకమ్మ!
ప్రేమపేరిట మతి నీతి నీమ ముడిగె!
చాలు కుహనాకవిత్వసంస్కార మింక!

= రా మి ని =

(వినయము తెప్పుకొంటూ)

స్వామి! పేదదాన మీదు
చదువు లెరుగనట్టిదాన
పూర్వజన్మపాపీక్షణాల
బ్రతుకు గడపు దాసురాల
సహజము, నాదోష మిదో
క్షమా పాత్ర మో కాదో!
స్వామి! పేదదాన, నన్ను
క్షమియింపుము పోవుదాన!

= చ ం డీ దా సు =

జ్యోత్స్నాతరళిత తరంగిణీ రజనీ!
మత్స్వప్నాశయ దివ్యరాగిణీ తరుణీ!
విజన మదీయ హృదయ గృహతారానారీ!
రజకినీ రూప మాధురీ! నవకిశోరీ!

(సాంఘికుల కలకలం హెచ్చుతుంది)

= రా మి ని =

(మళ్ళీ మొక్కలుతుంది)

దివ్యమైన మీ సన్నిధి
పేదనైన నా పెన్నిధి—
తెలియని నా మదిని రేగి
కల లెవో జడు లయి మూగు—
మీరు వలపు తెరువరులో
అమృతమాను సురనదులో!
ఊపిరాడనీక కురియు
ఈ పరిమళములబరువు
ఓపలేను కరగిపోదు
ఒరగిపోదు మీ యడుగుల—

ఎదలోపలి మెదలో రేమే
నదులో కదలిపొంగి మీ
పద్మాబ్జముల పయికి జారి
మెదలగోరు నిది దోసమొ?—

(తిరస్కారసూచకంగా సాంఘికుల కోలాహలం)

= సా ం ఘి కు లు =

దోసమే రజకినీ వృథాయాస మేను—
అధమ సంజాత; వాతని దగ్గఱ్ఱ
కాన తత్పదచ్ఛాయయందే నిలువ
తగవు! కట్టుకథల చెప్పి కెగయ లేవు!

= చ ం డీ దా సు =

ప్రణయశైలలో ప్రేయసి రాధిక!
ప్రేమికుడే మాధవుడు!
ప్రణయ శక్తి రాధిక జగన్మాత!
ప్రేమమూర్తి మాధవుడు జగత్పిత!
ఓ జగద్వ్యాపినీ! రజకినీ రూపిణీ!

జగజ్జననీ! అనంత ప్రేమఖని!
నీ శీతల చరణతలమ్మే శరణమ్మాయి
దివ్యతస్వీ!

(— సాంఘికుల కలకలం —)

= బృందగీతి =

కల వంశీ స్వరధునులో
మలయానిల మధురిమలో!
ఝురులై పొరలుచు పులకించుచుగా
విరులై యురలుచు పొలయించుచుగా!
యువసౌరభ మదరుతులో
నవభావోజ్జ్వల గతులో!
అళులై పాటల తమకించుచుగా
అలలై ఆశల నెమకించుచుగా!
హిమ మౌక్తిక తరళిమలో
తరుణాశల అరుణిమలో!
నెలలై అమృతము లొలికించుచుగా
కలలై కోర్కెల మొలిపించుచుగా!

## రెండో రంగము

పక్షులకలరవాలతో ప్రాతః కాలపు వెలుగుల్లో
రజక వాటిక
(ఊతపదంతో-రేవులో-బట్టలుతుకుకొనే
రజక జనం)

= బృ ం ద గీ తి =

తొలు సంజ విరిసేటిపూవా, నువ్వు
మలు సంజనే వాడిపోవా!
మురికి మసుగుస కన్ను విడిచావే, సిరికి
సిరమెక్కి సివమెక్కి నడిచావే!

కతలు కబురులు సత్తె మంటావు! నువ్వు
నెతల పాలౌదు వేమంటావు!
వెలుగు చీకట్లు మరిచావా, నీకు
కలుగు నిక్కట్లు తలిచావా!

= రా మి ని =

(తనగృహము ముంగిట)

ఈ పేదపూవలపు లే పగిది చేరునో,
ఆశాశలనుదాటి ఆప్రభాకరమూర్తి!—

౧౯౭

వలసేది, తలపేది, మరపున నశించునో,
అలమునాళల వెలుతురుల ప్రశోభించునో!—
పంకజాంగనకు అకలంక తేజోఘనుని
అంకపీఠము కోరు టడియాసయే యే మొ!—
మనలుసూర్యునిమంటవిసురులోనుసియూనో,
ఎనగుప్రేమ జ్యోతికోసలనై క్యమెయూనో!—
(దూరమున చండీదాసు కేక)

= చ ం డీ దా సు =

రామిని!......రామిని!

= రా మి ని =

అయ్యో......ఠాకూరు వస్తున్నారే! ఠాకూరు!...
ఠాకూరే వస్తున్నారు. ఈ కన్నీటితో యెలా యెదు
ర్కొగను?

= చ ం డీ దా సు =

(దూరము నుంచే)
_రామినీ!...(దగ్గరగావచ్చి) రామినీ!...
కనలేనేచెలి కనలేన!
నయనసుమదళముపయిని హిమకణము
కనలేనే...కనలేన!
వినలేనే చెలి వినలేన!
మందమధురరుతి యందు విధురగతి
వినలేనే......వినలేన!
చెలిమి కలిమి నెదలో నలత!
కలలోపల లోకము కలత!
బ్రతుకు బ్రతుకె బరువై......కరవై...
కనలేన......కనలేన!
......రామినీ! ......రామినీ!
కనలు కమలమ్ము తుహినాంబుకణములందు
రవికరస్పర్శనంది చిర్నగవు చిందు!

వదనశశి జూచి బాష్పాంబువార్ధి యెగయు
వార్ధికదలాడి యెగయదో వదన శశియు!

= రా మి ని =

ఠాకూర్! ఠాకూర్!...... ఎన్నాళ్ళకురాక!
ఎంత దయ! ఇదుగో - తరుశాఖ - పీఠం. విడవకండి
నన్ను ఠాకూర్, ఆమాపు - అదయగల ప్రేమగల
తియ్యనిచూపు నాపైనుంచి మరల్చకండి!

సరసనెన్నడు మీరు నిలిచి యున్నారో!
ఒరసి చూపుల చూపులొల్కు చున్నారో!
ఇరులత్రోలి హసించు వెలుగు కన్నాన!
వరమనోజ్ఞ స్వర్గ మంటి యున్నాన!
వలితెమ్మెరలపాటలోలసె!
చలువ వెన్నెలరేని తళతళలు పొలసె!
మనసులోపలి వెతల జడివాన వెలిసె!
మూగవడి ముడుగు నాస్వరము!
ఠాకూరు రాకలో తియ్యకలవరము!

= చ ం డీ దా సు =

జీవననందినీ, జీవననందినీ
నీ మందహాస చంద్రరేఖ స్పందనా వికాస
మందువిందుగక్రొందళుకు లెన్నొ చిందె!
నీ సుందర నయనాళియుగళి మంద్రగాన
రవళియందు విందుగ క్రొందేన లెన్నొ
చిందె!
నీ చందన నిశ్వసన పవన బృంద మృదు
విలాసమందు విందుగ క్రొందావులెన్నొ
చిందె!
జీవననందినీ! జీవననందినీ!

= ఇద్దరు =

మన ప్రేమ
సస్యసౌందర్య భూములలో
ప్రభవించి ప్రభవించి
నవ్యమరు సీమమగునో
కమ్రసుమధామ మగునో!

మన ప్రేమ
కల్లోలినీ తరంగములలో
పయనించి పయనించి
శీర్ణ సికతాద్రి యగునో
పూర్ణ కలశాబ్ధి యగునో!

మన ప్రేమ
కాలగాఢాగ్ని కీలలలో
తపియించి తపియించి
దగ్ధతరుకాండ మగునో
ముగ్ధమధుభాండ మగునో!

మన ప్రేమ
దీర్ఘఝంఝూవమారుతములలో
ప్రసరించి ప్రసరించి-
విరహనిశ్వాస మగునో,
సరసదరహాస మగునో!

మన ప్రేమ
సువిశాలగగనవీథులలో-
విహరించి విహరించి-
పరమస్వేచ్ఛాభ్రగామి యగునో!
నిరవధికసౌఖ్యధాని యగునో!

('తొలిసంజ విరిసేటిపూవా నువ్వు మలిసంజనే వాడిపోవా' అనే బృందగీతి దూరంనుంచీ క్రమంగా దగ్గర వినవస్తుంది.)

## మూడోరంగము

గర్భగుడిలో - చిరుగంట గణగణ వాయిస్తూ దేవతార్చనలో మగ్నుడైన నకులదాసు.

= నకులదాసు =

ఆది శక్తీ! దేవీ!
వేదత్రయీమూర్తీ!
ధర్మప్రకాశినీ!
భర్మసంకాశినీ!
నిర్మలాత్మ ప్రభాభాసినీ!
హేజననీ!
పతితదీనక్షమాసంగినీ!
ప్రేమాంతరంగిణీ!
పావనీ!

(ముందువాకిట కలకలముతో సాంఘికులు)

= సాంఘికుడు =

అహాహా! దేవీచరణశిలలు దహారహమ్ము!
ఆదిశక్తి సమర్చనాభ్యాసపరత
గర్భగుడియందె, ధర్మ భంగమ్ము చేయు
భ్రాతృహత్యమ్ము పేక్షించు వ్యర్థమమత
గర్భగుడియందె ఔరౌర కాలమహిమ!

(నకులదాసు చేతిలోని దేవతార్చన గంట క్రింద పడును)

నిత్యకర్మవ్యతిక్రామి నిందిత పథ
గామి నేటితో సర్వాధికార మెడలు!
నేటితో నాత్మసంఘసాన్నిధ్య మెడలు!

ఇదియె ధర్మజ్ఞసమితి విధించు శాస్తి!
ఇదియె ధర్మచ్యుతు డనుభవించు శాస్తి!

= అందరు =

చండీదాసు స్వధర్మపాలనకు వెలి!
చండీదాసు స్వసంఘలాలనకు వెలి!
(భేరి మ్రోగుతుంది. తొట్రుపాటుతో నకులదాసు)

= నకులదాసు =

శరణు శరణు ప్రశాంత దాంతస్వాంతులారా
శరణు శరణు!
మీదుదూషణభాషణమ్ముల కేనె బాధ్యుడ!
బాలు డాత డపరిణతుండు!
ఉద్వేలమా భావగతి నాపగ చాల డాతడు!
బాలు డాతడు!

= ౧ సాంఘి =

బాల్యాపేక్షి, వయస్సా
కల్యా రూఢియు నభేద కలితంబులు దా
శ్శీల్యాచరణంబున దా
ర్బల్యా సతస్వకర్మ భంజనమందుర్.

= ౨ సాంఘి =

అధ్యాత్మపరత్వము చెడ
మిథ్యేంద్రియలాలసత్వమిహ కాపథికుల్
వధ్యులు కాకుండినచో
సాఫ్యమె ధర్మంబు పృథివి సాగుట కెటులున్?

= నకులదాసు =

ఎరుగమిని చేయు తప్పు జీవిత మ్మెల్ల
తరిమి సాధింపగా తగవగునె ధర్మాత్మ!
పొరపడిన దుర్బలుల సరిచేయగా వెరవె
కరుణింపరో కృపామహితాత్ములార!

= సంఘవృద్ధు =

కఠినదండన కాని మార్గ మ్మొకటి
కలదు ప్రాయశ్చిత్త కర్మమ్మె!
దేవిసన్నిధి దివిజ తర్పణ
కర్మదీక్షితు డౌచు సత్పథ
గమనమునకై ప్రతిన పట్టిన
సవ్యముగ నాపైని నడచిన
సాంఘికస్వత్వమున కర్హత
సంఘటిల్లును, సంఘవృద్ధులు
సమ్మతింతురు, సంతసింతురు!

= నకులదాసు =

భ్రాతృప్రేమార్ద్రిమా ఆశలే
నాహృదిని కలుగు!
మహిత సంఘప్రేమ పాత్రుడై
నాభ్రాత మెలగు!
మాతృసేవా ప్రసన మాన్యుడై
ధన్యుడై చెలగు!
పతితదీనతమా సంగినీ!
ప్రేమాంతరంగిణీ! జననీ!

= అందరు =

దిగంత సరిత ప్రణవరూపిణి!
అనంత అచల ప్రణయగాయని!
త్వాం సమామోవయం మాతరమ్!

## నాలుగో రంగము

సాంఘికుల శాసనంవల్ల సమాగమానికి వీలులేక తపిస్తున్న రామినీ చండీదాసుల వియోగ వేదన

= బృందగీతి =

ఎవరు విన్నా రెవరు కన్నారు!
రాధికా ప్రణయమ్మునకుసాటి!
మాధవుని ప్రేమమ్మునకుసాటి!
ఎడలు రెండూ ఏకమన్నారు!
గడెవియోగమె సైచమన్నారు!
తమ సమాగమ మిక ముగిసేనో!
తనువారసి ఉసురులే యెగసేనో!
చందురుని చెంగలువ వలచేని!
చాతకము జలధరుని తలచేని!
చలితుపానుల కలువ మడిసేని!
చాతకము దాహార్తి సుడిసేని!
చందురుడు చెంగలువ జూచేన!
జలధరుడు చాతకము గాచేన?
ఏటికో, యీ క్షణిక ప్రణయాలు,
సాటిలేనిది రాధ ప్రణయమ్మె,
సాటిలేనిది కృష్ణుప్రేమమ్మె!
తేటివలపే మేటి అంటావ!
పూవువలపే పొగడబోతావ!
పూవు కొరకై తేటిరాదేని,
తేటికొరకై పూవుపోయేన?
ఏటికో, యీక్షణిక ప్రణయాలు,
సాటిలేనిది రాధప్రణయమ్మె,
సాటిలేనిది కృష్ణు ప్రేమమ్మె!

(రజక వాటిలో రామిని తలపోత)

= రామిని =

కురియదేలో వ్రజభువిలో
మధుమురళీ సుధారుచి!
యమున దరిని తమ మలమెరని
పిలుపులెవో కలచు నెదని!
శ్వాసనవినాతృషిత మహిని
నీరవతా, విరాగతా!
విరహవ్యథా విదాహమో!
నిదాఘమో! నిరయమ్మో!

(ఆలయంలో చండీదాసు తలపోత)

= చండీదాసు =

నామురళి
మధురశ్రుతుల పలుకదే!
నా హృది
సుధాధారలను చిలుకదే!
కోకిలకు
మూగవోయెనో కంఠరవము!
కేకికి
ఆగిపోయెనో నాట్యజవము!
చీకటులు
మూక మునురుగ రగిలెనే!
ఘూకరుతి
వ్యాకులత కెద పగులునే!
నా మురళి
మధురశ్రుతుల పలుకదే!

(రజకవాటిలో రామిని వాపోత)

= రా మి ని =

దాసికానా ప్రాణబంధూ!
నన్ను దాసింతువే ప్రేమసింధూ!
ఆశలేసురిగితూలేనో! ఆకాశమేవిరిగికూలేనో
చెలికై తపించు ఏకాకి మనికి ఆకలిలో
నశించువాడ సోకి!
హృదయమ్ముపై రాలురువ్వు, లోకమ్ము
అదయమా వెడనవ్వు నవ్వు!
చంద్రుడే యిరులలో దాగె, జగము
తంద్రిలో కనుమూసి తోగె!
బృందావనికి నీవు రావో, మధుర
మందానిలము లింకలేవో!
దాసికానా ప్రాణబంధూ!
నన్ను దాసింతువే ప్రేమసింధూ!

(బయట ప్రళయంగా ఝంఝామారుతం వీస్తూంటే ఆలయంలోపల కలగిపోయిన గుండెతో చండీదాసు.)

= చండీదాసు =

ప్రియతమా! గాఢాంధకార బంధుర రాత్రి!
గగనమ్ము కాలమేఘాచ్ఛన్న మీరాత్రి!
నలుగడల తాపసంకులమా మనస్సులో
అలముకొను పాపపంకిలమా తమస్సులో
వలచికొన్నాను నా కరుణానిధిని నిన్ను
పిలిచికొన్నాను!
దరికి రాబోవు నీదారి కంటకితమ్ము
తలుపుగడవైచి హేళనచేయు సంఘమ్ము
కుటిలలోకమ్ము ప్రేమకృపాదరిద్రమ్ము!
జటిల ధర్మవివాద జడితమ్ము హృదయమ్ము
క్రూర మగు లోకధర్మము నెదుర్కొనలేను!
కోరికగు ప్రణయజీవన మందుకొనలేను!
గగనమ్ము కాలమేఘాచ్ఛన్న మీరాత్రి!
ప్రియతమా! గాఢాంధకార బంధుర రాత్రి!

(ప్రకృతి ఒక్కసారిగా కొన్ని క్షణాలసేపు శాంతిస్తుంది. ఒక సంఘవృద్ధుడు ఓదార్పుగా చండి దగ్గరకు చేరుతాడు.)

= సంఘవృద్ధు =

వేళమించె కన్నులు తెరువుము,
విశాలాక్షి పదముల నొరగుము!
చిరుతహృదయ మారాటమ్మున
పొరలు గ్రమ్మె ధర్మమ్మెడలను
వంత లుడుపు ధర్మమార్గము,
చింత లుడుపు ధర్మమార్గము—
శాంతియుతము ధర్మజీవిక!
కాంతియుతము ధర్మజీవిక!

(దూరాన సన్నాయి, మంత్రఘోష)

## ఐదో రంగము

(ఆలయంలో - సన్నాయి, ఘంటానాదం విన వస్తూంటాయి)

= బృంద గీత =

ప్రణయ పరిశుద్ధుండు
చండీదాసు ప్రాయశ్చిత్తమంట!
వలపు తాపసియైన మాధవు
మనసె కల్మష కలితమంట!
చెలిమికై తపియించు రామిని
చిరుతహృదయము వేల్చుమంట!

ప్రణయ పరిశుద్ధుండు
చండీదాసు ప్రాయశ్చిత్తమంట!
మలిన ధర్మప్రోక్తలౌ
ఆచార్య పర్యాలే కర్తలంట

(దూరాన రుంయిమని బరువైన గాలియాల. రజక వాటినుండి పరుగెత్తి వస్తూ రామిని:)

= రా మి ని =

ఎడద పగులునో, బ్రదుకె రగులునో—
పిరసిాజీవికే - యేవిధిని గడచునో—
మరపుటిరులలో, మరిగి సుసుగునో!—
చదివిన నరులే, అదయహృదయులో,—
తెలివి మరుగులో, వలపు తలపరో ?...
(హూ......రు'మని పవనరోదనం)
ప్రణయమూర్తి ప్రాయశ్చిత్తమో!
ప్రమికార్తి లోకోత్పాతమో!
(దేవాలయంలో - ప్రాయశ్చిత్తమంటపం. మంత్ర ఘోష)

= అ ర్చ కు లు =

జయ విశాలాక్షి! జయ జయ విశాలాక్షి!
దేవ్యై నమోస్తు దివి దేవగణార్చితాయై
భూత్యై నమోస్తు భువనార్తి వినాశనాయై
శాంత్యై నమోస్తు శరణాగత రక్షణాయై
క్షాంత్యై నమోస్తు దురితక్షయకారణాయై
(సుదూరంలో రామిని ఆర్తనాదం)

= రా మి ని =

ప్రాణాధికా! ప్రాలుమాలికా!
ప్రణయఝుంఝు వీచెంచు నిదే!
ప్రణయ శక్తి జృంభించునిదే!

అర్చకులు బిగ్గరగాను,-వెంట-చండీదాసుమందంగా ఆలసంగానూ,-మంత్ర పాఠం:

= అ ర్చ : చ ం డి =

ధర్మప్రకాశినీ! భర్మసంకాశినీ!
మహాపాపినం స్వధర్మచ్యుతం
మాంశోధయ పరిశోధయ!
మాంపాలయ ప్రపాలయ!
భావిసౌశీల్య ప్రతిజ్ఞాతారం
మాంరక్షయ పరిరక్షయ!
ఆత్రంగా పరిగెత్తివస్తూన్న రామిని గొంతు దగ్గరవుతూంది—

= రా మి ని =

ప్రాణపతీ! ప్రణయైకమతీ!
మంత్రపాఠం అర్చకులు మాత్రమే-పరధ్యానంగా వెంట అనుకరించని చండీదాసును హెచ్చరిస్తూ-నొక్కి- నొక్కి- చదువుతూంటారు—

= అ ర్చ =

భావి సౌజన్య ప్రతిజ్ఞాతారం
మాంపాలయ ప్రపాలయ!
హెచ్చరికగా-తిరిగి అదే చదువుదురు—
ప్రాయశ్చితరంగంలోకి రామిని వచ్చివేసింది—

= రా మి ని =

ప్రాణపతీ! ప్రణయైకమతీ!
పళ్యములు పాత్రలు దళాలున వదలివేసి ఆచార్యుల హాహాకారాలు లెక్కచేయక, చండీదాసు వచ్చి, రామిని పాదాలవద్ద పడిపోతాడు:

= చ ం డీ =

ప్ర ణా యి నీ రా మి నీ
స్నిగ్ధ తేజోధామినీ దివ్యభామినీ!
శాశ్వతైకైక సౌధర్మ్య స్వరూపిణీ!

చకితరవిశశితారకా ప్రభావ్యాపినీ !
చరణ చారణ సకలదివిజ మనుజావళీ !
నిరుపమ ప్రేమిని !
వరప్రేమగాయని! వాసంతదాయిని!
విశ్వసుందరి, వేదమాత! గాయత్రీ !
ప్రాయశ్చిత్త మంటపంలో - సాంఘికుల ధన్యవాదాలు ధిక్కారాలు-ఛీత్కారాలు-కల్లోలంగా చండీదాసు, రామిని - కలిసి - ప్రస్థానము.

= ఆ చా ర్యు లు =

తక్కువ వెలంది వేదమాతగ నుతించు
విజ్ఞసంఘంబులోననే విప్లవంబొ
వెర్రితలలో ఘటిల్లెను వీనికతన
ఈ క్షణమె-ధర్మపతితుడౌ నితడు జన్మ
భూమినుండ నసర్హుడై పోవుగాక !

= న కు ల దా సు =

అగ్రజునిస్నిగ్ధ హృదయమ్ము వ్రీల్చితివోయి-
అనుజ, అనుజా ! పోవుదువా, పోవుదువా-
తండ్రి!
పోవుదువా తండ్రి !- పోయితివో !
దేవీ, విశాలాక్షి- ఓవిశ్వహృదయినీ,
భగ్నహృదయుడను, విభ్రాంతిపృకుడ
లోగొనుమమ్మ !
(గుండెపగిలి, కూలిపోవును.)

= సాం ఘి కు ను =

వంశమును, సంఘమును గురువనుల ధిక్క
రించుపాపి; ఆత్మభ్రాతృ ప్రముమణిని
కాలదన్ను నారకలోకగామి అరిగె;
సంఘమున శోకమెడ సుప్రశాంతి గలిగె,
ప్రేమఖని నకులాచార్య హృదిమెప్రిల
సర్వలోకమ్మునకును విషాదమయ్యె !
(జనసందోహం క్రమంగా తగ్గుతుంది.)

## ఉ త్త ర ర ం గ ము

= బృ ం ద గీ తి =

మాధవదేవుని మధువనము జగము
రాధారమణీ జీవనము !—
ప్రణవవికంపిత పవనాలింగిత
తరుకుంజలతాకరము !—
ప్రణయ కదంబిత మధుకరచుంబిత
ప్రసవసౌరభాకరము !—
మదశకుంతరవ మధుప్రభాతము,
హృదయ రాగమంజరీ విభాతము !—
గ్రీష్మవికాస విచికిలోచ్ఛ్వాసము,
ఊష్మాగమవంశీ నిశ్వాసము !—
జలధర మర్మర వాత్యోల్లాసము,
చలద్విన ర్తక చపలాహాసము !—
శశికర సుమమాలన విన్యాసము,
శిశిరతుషార విహార విలాసము !—
రాధామాధవ ఖేలనము జగము
బాధాఖేదోన్మూలనము !—
మహాప్రస్థానంలో - చండీదాసు, రామిని ప్రణయ తరణిపైని—

= రా మి ని =

నిను వీడి మనుదునే నాథ ! నా
మనికి కనువెలు గీవెకాద !

ఒరగి నీయెడదనే మెదలి, నే
కరగి పోయెద మేను వదలి!—

= చండీదాసు =

నినువినా, దేవి! నాకమ్మైన వలతునే?
క్షమియింపవో-ధర్మజడితు దోషము ప్రియా!
కలలలోకపుటంచు మెరసి నీవై వెలసె—
వలపు తెసువరి యెడదసోలసి తీవలుమలసె-
తెలివి మఱుగునదాగి వలపు నెఱుగనిభూమి
నినువినా, దేవి! నాకమ్మైన వలతునా?
మనికి స్వర్గమ్మెప్పుడు కాదు!
జగము బృందావనము కాదు!
మనమె స్వర్గము సఖీ!
మనమె బృందావనము!

= రామిని =

నీరాధికను నేను!

= చండీదాసు =

మాధవుడ నేను!

= ఇద్దరు

మనమె స్వర్గము ప్రియా!
మనమె బృందావనము!

(ఆశాంచలాల అవధిలో-
మహాప్రస్థాన ప్రణయ నౌకలో-)

= ఇద్దరు =

ప్రియా! నడవనీ మనప్రణయ నౌక!
వేగగడనీ లోకమ్ము డాక!
మనకు కాల మొకటే వెల్లురేక!
ఎడదలేకమ్మై సోలునందాక!
ప్రియా! నడవనీ మన ప్రణయనౌక!

= బృందగీతి =

రజకిని ప్రియుడైన చండీదాసు
విశ్వప్రణయ గానము!
ప్రేమగానము, ప్రేమగానము!
సకలజగదభిరామ గానము!

# ప్రేమ

పలుకుతూ, అంతలో
కులుకుతూ నాసఖీ!
ఒలకబోస్తావు నీ
ఒయ్యార మంతాను!

అరుణారుణము నీ
యధరపల్లవము!
కరుణాసమన్వితము
కన్నులయందము!

తొలకరిమెరపులా
తొంగిచూస్తావు!
ప్రేమతో నాగుండె
పిప్పి చేస్తావు!

తొలిగె వసవస బాట
వెలిగె వెన్నెలతేట
కలిగె మనుగడతోట
పలుక కమ్మని పాట!

రసపిపాసికి ప్రాణ
మసదృశ మ్మోమవేణు
రవ మెల్ల నీవేను
న వ న వా నం ద మ్మూ!

కవటాకు వలె ప్రేము
మృదులమ్మై, మధురమై
పేశల మ్మయి, జీవి
తాశలకు భవన మయి
అలరారు నాసఖీ!
కల గాదుగా సఖీ!

పలుకుతూ, అంతలో
కులుకుతూ నాసఖీ!
ఒలకబోస్తావు నీ
ఒయ్యార మంతాను!

కల లెల్ల పిరిసెనా ?
వల పంత పండెనా ?

"ప్రేమరాగము" నా. డి.

# ఆశాగానము

ఓ ప్రియురాలా!
పీలాకాశవు
గోళంలో వెలిగేతారా
ఓ ప్రియురాలా!

తళతళ మను నీ
తను వొక జ్వాలా?
మన్మథకీలా!
ఓ ప్రియురాలా!

నింగితెరలనుండి
తొంగి చూతు వ
పొంగవీక్షణ త
రంగాల నోబాలా

నవహేలా!
ఓ ప్రియురాలా!

ఆకొన్ననిరీక్షణలో
నీకోసం రే యంతయు

ఎదురు చూచి సొద గుందితి
మిన్నునుండి దిగిరావా?
న న్నేలగ నో బేలా!
ఓ ప్రియురాలా!

"క్షేమరాగము" నుండి

# మబ్బుల్లారా!

పరుగెత్తే మబ్బుల్లారా
ప్రపంచ మిది గమనిస్తారా!
అందాలకు తావలమై ప్రేమ
బంధాలకు స్థావర మైనది!
పరుగెత్తే మబ్బుల్లారా
ప్రపంచ మిది గమనిస్తారా?

అంతులేని ఈయాకాశంలో
ఎంతదూర మిటు పయనిస్తారు?
చింతలవంతల జీవికిన మానవ
సంతతి కిటు దూరదూరంగా
ఎంతదూర మిటు పయనిస్తారు?
పరుగెత్తే మబ్బుల్లారా!

పరజాతికి బానిసలైన
కొరమాలిన జీవుల మేము!
మీ స్వేచ్ఛను చూచే మేమూ
ఓ! స్వప్నాలను కంటున్నాము!

వింతరంగుల మబ్బుల్లారా!
ఎంతదూర మిటు పయనిస్తారు?
దిగి రండోయి దివియా భువికి
ఆడుకొందాము అమరావతిలో
పాడుకొందాము భద్రాద్రిలో
పరుగెత్తే మబ్బుల్లారా

"ప్రేమరాగము" నుండి.

పెనుమర్తి కామేశ్వర రావు.

# "చలంగారి" "స్త్రీ": రెండు భాగాలు

"షా"

ఆహార నిద్రా భయమైథునంచ, సామాన్య మేతత్ పశుభి ర్నరాణామ్
ధర్మోహి తేషా మధికో విశేషో, ధర్మేణ హీనాః పశుభి స్సమానాః.

ఇట్టి ధర్మశ్రవణా లంటే చలంగారికి చాలాఆగ్రహం. నిజమే. కేవలధర్మ శ్రవణాలు ఆధునికవిమర్శనకు సరిపోవు. నాకుకూడా నచ్చవు. కాని ఈశ్లోకములో ఇమిడి యున్న భావము ధర్మశ్రవణము కాదు. ఎందుచేత నంటే—

ఏయితరప్రాణికీ లేని పరామర్శపూర్వక బుద్ధిజ్ఞానము ఉండడమువల్లనే, మనుష్యుడు అత్యధికుడు అయినాడు. శారీరక వృత్తులు, ఆవృత్తులను నడిపించే చైతన్యవాసనలు ఆబుద్ధిజ్ఞానములు కావు. చైతన్యవాసనలను, వాటివల్ల ప్రవర్తకము లైన శారీరకవృత్తులనుకూడ తనస్వాధీనమందుంచుకొని, అల్పోత్కృష్టములు, మంచిచెడ్డలు, ధర్మాధర్మములు, సిద్ధసాధ్యములు, నైసర్గికాదర్శకములు అనేభేదములను చేసుకొంటూ, తనకుమాత్రమే గల బుద్ధికి అర్హమైనట్టి నడవడిని అవలంబించినప్పుడే, మనుష్యుడు పశుభిన్నుడౌతాడు. ఇది సర్వాంగీకార సిద్ధాంతము. ఈసిద్ధాంతమును చలంగారు వారి గ్రంథములో ఆమోదించి యుండక పోయియుంటే, నా ఈ విమర్శన వ్యాసమునకు ప్రసక్తి లేకపోయియుండును. "ఉత్తమ స్త్రీ పురుషులను," "ఉన్నతాశయములను", "ఆత్మౌన్నత్యమును", "ఆత్మవృద్ధిని" "పరమ ధర్మమును" "ఉన్నతాదర్శమును" వీటిని ఆమోదిస్తున్నా, "హీనగుణములనీ," "నీచమనీ", "అధమమనీ", "కుళ్ళు"అనీ, కొన్నింటిని నిరసిస్తున్నా, చలంగారు వ్యక్తి సంఘములను వారి గ్రంథమందు పదేపదే నొక్కి వక్కాణించియున్నారు. ఇట్లు ఆ మూలసూత్రమును అంగీకరించినందున వారితో కలిసి సంప్రతించుటకు ఆవశ్యకమైన సామాన్యస్థలము ఒకటి కుదిరినది. కాని ఆ సూత్రమునకు సమన్వయ ప్రతిపాదనములలో ఎన్ని వ్యత్యాసములు సంక్రమించినా, అవన్నీ సరిచేసుకొనుటకు అవకాశ మున్నదనే ఆశ ఉండబట్టే ఈ వ్యాసము వ్రాస్తున్నాను.

వ్యక్తి స్వాతంత్ర్యము, ప్రేమజీవనోత్కృష్టత, స్త్రీహక్కులు, సాంఘిక నిరంకుశత్వబాధలు, సెక్సు* జీవనములో అత్యావశ్యకమైన మార్పులు, కేవలాచారప్రవృత్తి మౌఢ్యము - ఇటువంటి విషయముల గురించి చలంగారు ఉద్రేకముతో వ్రాసిన వ్రాతలతో చాలావరకు నాకూ ఏకీభావ మున్నది. కాని విచక్షణ దృష్టిలోను, విచారణ పద్ధతిలోను, ఆభావముల సమన్వయములలోను చాలా ముఖ్యమైన భేదమున్నది.

---

* సెక్సు (Sex) అనే పదమునకు సరిపడిన మాట దొరకలేదు.

ఉత్తమాధమ నిర్ణయము చేసేటప్పుడు ఒక నిగమకము ఉండవలెను. ఏది ఉత్తమము ఎందుచేత, ఏది అధమము ఎందుచేత, —అని స్పష్టముగా నిర్ణయించుటకు ఒక సామాన్య లక్షణము ఉండకపోతే, ఎప్పటి కప్పుడు మారుతూ ఉండేదే సమాధానమైతే, ఆ ప్రశ్నలకు ఉచితమైన ప్రత్యుత్తరము కుదరదు. ఇది మంచి, అది చెడ్డ, అని నిర్ణయించుటకు "నా ఇష్టమని" చెప్పవలసి వస్తుంది. ఒకవ్యక్తియొక్క ప్రవర్తన మంచిది, నీతివంతము, ఆదర్శప్రాయము అని తీర్మానించుటకు తగిన ఆధారము ఉండకపోతే, విచారణ వ్యవహారము, జ్ఞానపరీక్ష, అసంభవ మగును. ఈ సూత్రనిర్వచనమును చలంగారు వారి విచారణలో చక్కగా పాలించలేదు. దీని ఉల్లంఘనవలననే వారిచర్చ లోపభూయిష్ఠమైనది. మనుష్యుని ప్రవర్తన పరీక్షకు వచ్చినప్పుడు సిద్ధసాధ్య భేదము చాలా ఆవశ్యకము. ఆకలివేస్తే ఆహారము తింటాడు; ఆకలి వేస్తేనే ఆహారము పుచ్చుకోవలెను. కోపము వస్తే మనుష్యుడు కొడతాడు; కోపము నాపుకొని కొట్టకుండా ప్రవర్తించవలెను. స్త్రీ పురుషులు ఇట్లు ప్రవర్తిస్తారు; వారు ఇట్లా ప్రవర్తించవలెను. ఇది మనుష్యునికి సహజము; కాని వాని అభివృద్ధికొరకు ఈ సహజమైనదానిని నిరోధించవలెను. ఇట్లు ఒకటి నైసర్గికము. ఒకటి ఆదర్శకము. ఈ భేదము చాలా ముఖ్యమైనదిగదా. దీనిని చలంగారు ఒకచోట అంగీకరించినా వాదన సమన్వయము చేసేటప్పుడు పూర్తిగా ఆ భేదమును నిరసించి కేవల స్వభావ వాదులైనారు. అంటే "నా ఇష్టం" కాబట్టి అని వాదించడము.

"నేను స్వభావవాదిని. ఆదర్శనిరోధము నేను అంగీకరించను." అని వారు ఇప్పుడు వాదన కోసం వాదించవచ్చును. అలాగే అయితే వారి పుస్తకము, వారి ప్రచారము నిరర్థకము. వారి ప్రయత్నమంతా మార్పులు కావలసియున్నవి అనేకదా కావలసియున్నది? ఎప్పుడైనా ఆదర్శము, సాధ్యము అవుతుందిగాని, నైసర్గికము, సిద్ధముకానేరదు. ఈ వివేక సమక్షమున చలంగారు వ్రాసిన ఈ వాక్యములను విమర్శించవలెను. "కామం లేనివాడికి కామంగలవాడు పాపాత్ముడువలె కనపడతాడు. భార్యమీద ఇష్టంగలవాడికి వ్యభిచారం అర్థంకాదు...ఒకరిస్వభావం యింకొకరిది కాదు." ఇట్టి వ్రాతలు పుస్తకములో చాలా చోట్ల కనిపిస్తాయి. ఇందులో ఇమిడియున్న శాస్త్రము ఎట్టిదనగా వీరు ఆదర్శములను అంగీకరిస్తూ, నైసర్గికమైనదానిని (అనగా ప్రతీవారిస్వభావాన్ని కోరికనీ) సమర్థిస్తారు. *

* ఆదర్శము నైసర్గికము కానిదా అని వారు తర్కించవచ్చును. ఒకఅర్థములో ఆదర్శము నైసర్గికమే. నైసర్గికము కానిది ఉండనే ఉండదు. సాధ్యము సిద్ధము అవుతుంది. అది అవస్థాభేదము. ఒకదానికి కార్యమైనది మరొకదానికి కారణ మవుతుంది. అట్లే ఆదర్శవిషయములో కూడా. ఎవరికి ఎప్పుడు ఏలాగు ఏది ఉంటుందో అదంతా అలాగే అంగీకార్యమనేది ఆదర్శకపు ప్రవర్తన కాదు. ఆ భేదముతో ఈ పదములను ప్రయోగిస్తున్నాను.

స్వభావాన్ని సమర్థించడంకోసం ఆదర్శసంబంధమైన పదములను ఉపయోగిస్తారు. స్వాభావికమైనది ఆదర్శప్రాయముగా చదువరులకు తోచాలని ఈ సూక్ష్మభేదమును వారు గమనించలేదు. దానిని గమనించలేని యువతీసోదరులు వారి తీవ్ర నిరసన ప్రవాహములో మునిగిపోతారు. నేను కొందరితో ఈ గ్రంథము గురించి ముచ్చటించడము సంభవించినప్పుడు ఈ పెద్దలోపమును తెలుసుకోగలిగినాను.

ఆమధ్య కొన్నాళ్ళక్రిందట మిస్ మేయో "మదర్ ఇండియా" అనే పుస్తకమును ఈ దేశపు ఆచార వ్యవహారాలను నిరసించుటకు గాను ప్రచురపరచెను. ఆ పుస్తకము చదివినప్పుడు పుట్టిన వెగటు ఉద్రేకము వంటివే కొంతవరకు చలంగారి "స్త్రీ" చదివినప్పుడుకూడా పుట్టినవి. మిస్ మేయో నిరూపించిన దుర్గుణములు పూర్తిగా అసత్యములని ఎవరూ అని యుండలేరు. ఆలాగే చలంగారు వర్ణించిన రోగలక్షణములు కేవలము అబద్ధములని ఎవరూ వాదించలేరు. కాని ఉన్న సత్యమంతా ప్రచారోద్రేకములో మలినమైపోయినది. ఒక్క వ్యక్తి జీవితములోనే సత్యము, సౌభాగ్యము, సౌందర్యము పూర్తిగా సందర్భము కానప్పుడు, అనేక వ్యక్తుల సంసారములలో లోపములు లేవని అనగలమా! ఇంతమంది వ్యక్తులకూ, ఇన్ని సంసారాలకూ, సరిపడేటట్లు తీర్పులు ప్రతిపాదించాలంటే ఉద్రేకమునకూ ప్రచారమునకూ తావు ఇవ్వని శాస్త్రదృష్టి చాలా ముఖ్యము. అలాగు కానప్పుడు పచ్చకామిళ్ళ రోగముగల వాని దృష్టికి ప్రపంచమంతా పచ్చగా కనబడినట్లు, ఉద్రేకపూరితమైన హృదయానికి సంసారాలన్నీ కుళ్ళుతో మునుగుతూ ఉన్నట్లు గోచరించును. శాస్త్రదృష్టితో పరీక్షించినప్పుడు ఎన్ని సంసారాలను చలంగారు విమర్శించినారని అడగవలసి వస్తుంది. ఆ విమర్శన శాస్త్రీయపద్ధతులపైని జరిగినదేనా? ఆ సంసారాలు ఎట్టివి? అట్టి పరీక్ష చేయుటకు వీరు సంపాదించిన కుశలత ఎట్టిది? వీరు చేసిన తీర్మానములకు ఆధారములైన పరికరములు ఏవి? ఈ ప్రశ్నలను ఇంత స్పష్టముగా అడుగుటకు ఒక కారణము గలదు. వారి తీర్పులు చాలామంది విచక్షణుల తీర్పులతో సరిపోలేదు. కేవల స్థూలానుభవమే ఆధారమైనప్పుడు తమ తీర్పులు సత్యములనీ, తమ ప్రతిపక్షులవి కపటములైనవనీన్నీ నిందించడము వలన ఉపయోగము లేదు. కాబట్టి పరికరముల ఔచిత్యమును పరీక్షించవలసియున్నది.

వీరి "స్త్రీ" సృష్టి అంతటా ఉన్న స్త్రీజాతికి చేరినదా, అనగా ప్రపంచములో ఉన్న స్త్రీలకు స్త్రీసామాన్యమునకు సంబంధించినవా వీరి తీర్మానములు? లేక ఒక విశిష్టభాగమునకా? ఈ విభాగము గ్రంథములో స్పష్టముగా కానరాదు. కాని ఒకటి రెండు చోట్ల పడియున్నమాటలను బట్టి చూడగా ఈ "స్త్రీ" ఆంధ్రసోదరి అని ద్యోతన అవుతున్నది.

కొన్నికొన్ని చర్చల సందర్భమును బట్టి చూడగా హిందూమాత యేమో అని పొడ గట్టును. ఇదమిత్థమని చెప్ప వీలులేనట్లు సూచనలు సంకలనమై యున్నవి. స్త్రీరకములన్నిటిని కలిపి నొక్కడ ఏది సమన్వయిస్తే దానిని ఉదహరించుకొంటూ గ్రంథమును అర్థము చేసుకోవలసి వస్తుంది. ఇట్టి నిర్వచనములో ఒక చిక్కు ఉన్నది. కేవలము స్త్రీస్వభావ మునే విషయముగా చేస్తే, ఆచారవ్యవహారములను ఖండించేటప్పుడు, చలంగారు చేసిన సంకలనము కుదరదు. ఆచారములు ఏయొక రకమునకే చెందునుగాని స్త్రీజాతి కంతటికీ ఆరూపముననే వర్తించవు ఒకరి ఆచారములు మాలోకరివి కావుగదా.

చలంగారి పుస్తకమంతా ఉన్నది వివాహదాంపత్య సంబంధమైన సంఘ నియమములపై చేసిన ఘోర సంగ్రామము. ఈ నియమములు అన్ని దేశములలోనూ ఒకే తీరున లేవు. ఉండవు కూడా. అందులో వారు వెక్కిరించిన ఆచారములు చాలా చిన్నవి. భార్యా భర్తలు పడుకొనేగదులు, శృంగారించుకొనే వేళలు, చేసుకొనే సరసాలు, ఇట్టి చిన్న చిన్న వ్యవహారాలు. ఇవి కుటుంబములోని సంప్రదాయములను బట్టిన్నీ, పరిస్థితులను బట్టిన్నీ చాలవరకు మారుతూ ఉంటవి. నాగరికత, ధనము, విద్య, అలవాటులు, ప్రవర్తనలు స్నేహితులు, ఈ మొదలైన భేదములవలన, వ్యక్తులకూ వ్యక్తులకూ, కుటుంబాలకీ కుటుంబాలకీ వీటిలో భేదాలుంటవి. భర్త భార్య మాత్రమే ఉన్న కుటుంబములోను, అత్త మామ ఆడబిడ్డలు అన్నదమ్ములు ఉన్న కుటుంబములోను ఒక్కలాటి ఆచారవ్యవహారములు ఉండవు. వారికి గల గృహవసతులు పరిస్థితులు, ఆ యాచారాలలో ముఖ్యభేదములను కల్పిస్తవి. అందుచేత ఖచితమైన పరికరములు లేనప్పుడు విచారణ ఖచితముగా ఉండదు. ఏవో కొన్ని సంసారాలను, ఎవరో కొంతమంది స్త్రీపురుషులను స్థూలదృష్టిని చూచి, తమ స్వానుభవములో కలిగే అసంతుష్టిని ఆదృష్టిలో కలిపి గ్రంథములలోని తీర్పులను (ఆ అసం తుష్టికి, ఆ అనుభవమునకు సరిపడే వాటిని ముఖ్యముగా) ఏర్చి, వీటి నన్నిటినీ సంకలనము చేసినట్లు మనము ఊహించగలము. గ్రంథములో తర్కము తక్కువ; ఉదాహరణములు లేవు; ఉన్నదంతా వేదవాక్యములవంటి తీర్పులూ, ఉద్రేకపూరిత తిరస్కారమున్నూ, "నా అభిప్రాయం" "నా ఇష్టం" అని వాదిస్తే తప్ప, లేనప్పుడు తర్కనిదర్శ పూర్వక నిర్వచనము అత్యావశ్యకము. నంకాయ ఇష్టం, కేబేజీ సహించదు అన్నట్లు చర్చలలో అంటే పనికిరాదుగదా. పరిజ్ఞానము తక్కువైనవారు, చక్కగా తమ బుద్ధిచేత తర్కించు కోలేనివారు, చలంగారి తీర్పులను ఆప్తవాక్యములుగా ఆదరించవచ్చును. లేదా వీరి వర్ణన లకు ఏవగించుకొనేవారు వీరి సూత్రములలో ఇమిడియున్న వాస్తవికతథ్యమును గ్రహించక ఈ గ్రంథలాభమును పోగొట్టుకోవచ్చును. ఎటుచూచినా వీరి ప్రయత్నము చెడిపో తున్నది.

వీరి వాదమునకంతటికీ పునాదిసూత్రము స్వేచ్ఛ. పురుషునికుండి స్త్రీకి లేదని. స్వేచ్ఛ సర్వవిషయగతమైనదిగదా. జీవన వ్యాపారాలన్నిటికీ వర్తించునది. ఒక్క కామమోహము లకు వివాహదాంపత్యములకు మాత్రమే వర్తించేదికాదు. స్వేచ్ఛ అనే బీజము ఆవిర్భ వించి ఆకులు కొమ్మలు వేసేటప్పుడు, ఆ బీజశక్తి అన్నికొమ్మలకు సంక్రమిస్తుంది గాని ఏ కొమ్మకో ఆకుకో చెంది విరమించదు. ఆ బీజశక్తి లేనప్పుడు ఏ ఒక్క ఆకుకే బలమువచ్చే టట్లు చేయజాలము. స్త్రీ పురుషులకు సమానమైన హక్కులు ఉండాలని వాదించడం ఈ రోజులలో అనవసరమని నా విశ్వాసము. ధర్మశాస్త్ర గ్రంథాలలోను, సాంఘిక చట్టము లలోను స్త్రీ స్వేచ్ఛ అంగీకరింపబడలేదని మత్సరించుకోవడము వృథాగా ఆయాసపడడమే. మన ధర్మశాస్త్ర గ్రంథములు ప్రాచీనములైనవి. వాటిలో స్త్రీ స్వేచ్ఛ ఎట్లున్నదో నిర్వివాదముగా తేలలేదు. ప్రాచీన హిందూస్త్రీకి చాలా గౌరవము ఉండేదని వాదించే విమర్శకులు ఉన్నారు; ఈ అభిప్రాయము రానురాను చారిత్రకమండలిలో దృఢపడుతూ ఉన్నది. ఈ మతగ్రంథాలలో ఉన్నదేదో లేనిదేదో స్పష్టముగా తెగదు. అందుకే వాటి జోలి మనకెందుకు ? ఇంతకీ వాటిలో ఉన్నదాని ప్రకారము అవలంబన ఉందా లేని దానికోసం పెనుగులాడడం ఎందుకు ? సాంఘిక చట్టాలూ నియమాలూ ఎప్పుడూకూడా ఎక్కడైనాసరే, చాలా సంకుచిత పద్ధతినే అవలంబించుకొని ఉంటవి. అవి క్రమముగా మారుతవి. సరస్సులో అలలవలె కనబడకుండా ఉద్భవించి, చాలా చాలామందముగా విస్తరిస్తూ, విజృంభించే సమయానికి కనబడకుండా నీటిలో కలసిపోతవి. ఈ మార్పులు కూడా అట్టివే. భిన్న భిన్న వ్యవహారాలను నిబాధితముగా నిర్వహించుకుంటూ ఉండే వ్యక్తులు అనేకులు ఉంటూఉన్నారని ఘంటాపథముగా చెప్పగలము. అందుచేత ఒకరు అనుకొని కోరే స్వేచ్ఛ మరొకరిలో లేదని ఒప్పుకోవలసినదే. చలంగారు కోరే మార్పు కావాలని ప్రయత్నించడములో తప్పేమీ లేదు. కాని తిరస్కార పూరిత నిరసనము వృథా అవుతుంది. సువ్యక్తముగా తర్కనిదర్శనములతో శాస్త్రపద్ధతిపైని పరికరములను సూచిస్తూ, లోపాలను, ఆ లోపాలను తీర్చే అనుకూల సాధనాలను సుస్పష్టముగా నిర్వచిస్తే ఎంతో ఎక్కువ ప్రయోజనము.

అన్ని సాంఘిక నియమములలో వివాహసంస్థ చలంగారిని ఎక్కువగా రేపినట్లు కనిపిస్తుంది. వివాహమువలన కామస్వేచ్ఛకు మోహస్వేచ్ఛకు భంగము కలిగినదని వారి తీవ్రాగ్ర హము. వివాహమువలన నియమము వచ్చిందనీ, నిగ్రహము ఆవశ్యకమైందనీ వారి కోపము. అయితే నియమనిగ్రహ విరహితమైన స్వేచ్ఛ ప్రవర్తిల్లవలెనని వారి ఆద ర్శమా? అట్టిస్వేచ్ఛే స్వాభావికమని వారి అభిప్రాయమా? స్వేచ్ఛాప్రవర్తనకు నియమ

నిగ్రహములు స్వాభావికమైన ఆదర్శములు. అది సర్వాంగీకృతము. అట్టిదే వ్యక్తి స్వేచ్ఛకు వ్యక్తినిరోధమునకు గల సంగ్రామము. ఈ పోరాటము ప్రపంచమంతటా అన్ని విషయాలలోను ప్రజ్వలిస్తూఉన్నది. నిరోధములేని స్వేచ్ఛ పనికిరాదు కాబట్టి ఈ రెండింటికి ఆనుకూల్య మెట్లు కుదర్చడమో అనే సమస్య తెగకుండా నిలిచియున్నది. ఇంకా ఎక్కడా కుదరని ఈ సమస్య కామమువిషయమై కుదరాలంటే లోపము ఎవరి దవుతుందో గదా? మనుష్యుడు వ్యక్తి యెంతో సాంఘికజీవి. అంతకంటె యెక్కువగా సాంఘికత్వము మనుష్యుని పరిణామములో చాలా ఉత్కృష్టసోపానముగా సిద్ధించింది. ఈ పరిణామములో వ్యక్తుల అన్యోన్యసంబంధములేగదా నీతిగా ఆవిర్భవించినవి. ఈ నీతివ్యక్తిమనోనిర్మాణములో అంతర్భూతమైయున్నది. ఈ నీతిసంబంధము వలననే గదా మనుష్యుడు మృగములకంటె ఉత్కృష్టజీవి అయినాడు. దీని వలననే గదా వ్యక్తి రాను రాను ఎక్కువగా అభివృద్ధి చెందడానికి సాధ్యమయినది, సాధ్యమవుతూఉన్నది. ఈ నీతిని నిరసిస్తే ఏమి అనడమో తెలియదు. ఈ నీతి సృష్టినుండి మారకుండాఒకేలాగున ఉన్నదనిగాని ఉండాలనిగాని ఎవరూ అనరు. నీతి ఆవిర్భావాల గురించి చర్చ వేరు. నీతిపై ద్వేషము వేరు. చలంగారు సాంఘిక నీతిని కసితీరా వారి పుస్తకములో ఎక్కడ పడితే అక్కడ విషయచర్చకు అవసరమున్నా లేకున్నా తిట్టి తిట్టి విజృంభించారు! ఎందుకో అంత ద్వేషము. ఇప్పుడు జరుగుతూఉన్న వివాహాలు బాగాలేవు, దాంపత్యసంబంధములలో మార్పులు కావాలి. నిజమే. అనేకవిధములైన మార్పులు చూపించే వివాహాలు ప్రస్తుతము జరుగుతూనే ఉన్నాయి. “రాక్షసి”అన్న సంఘము వాటిని మింగేయలేదే. చలంగారిని స్త్రీవంటి పుస్తకాల్ని వ్రాయనిచ్చిందే ఆ సంఘం. మామూలు పద్ధతులను అతిక్రమించ గలిగిన ధైర్యసాహసాలు ఉన్నవారు సుఖంగా వ్యవహరిస్తూనే ఉన్నారు. క్రొత్తపద్ధతిని అవలంబించడానికి సాధారణముగా మనుష్యునికి ఇష్ట ముండదు. కొంచెము ఇష్ట మున్నా దానికి కావలసినంత ఉత్సాహశక్తి ఉండదు. అది మనుష్యుని స్వభావము. చలంగారు స్వభావాదులే అయితే ఈస్థితిని నిందించకూడదుగదా. నీతి అన్నది తప్పదు, ఉండాలి. కాని ఏది నీతి ఏది నీతికాదు అనే పరిష్కారము వేరు. ఆచర్చలో “నాఇష్టము”అనే సూత్రమేనా మరేదైనా ఉన్నదా అని ప్రశ్న.

వివాహమనే సంస్థపై చలంగారు ఘోరమైన ఆగ్రహం వెలిబుచ్చారు. సంఘ నీతి అనే పేరున వ్యక్తి స్వేచ్ఛకు కలిగించిన ఆటంకాలలో కెల్ల ఎక్కువ అన్యాయమైనది ఈ వివాహ సంస్థ అని వారి కోపము. ఆ స్వేచ్ఛ “మోహాపు స్వేచ్ఛట”. అనగా ఏకకాలమందు చాలామందిమీద మోహం కలిగినపుడు ఆ మోహాన్ని అనుభవించుటకు ఆటం

కము ఉండకూడదు. వివాహానికి ముఖ్యోద్దేశము మోహమని వారి మతం. మోహం ఆధారంగా ఉండాలి వివాహానికి, వివాహం జరిగేటప్పుడు. మోహపు ఆకర్షణ పోతే ఆ బంధం ఉండకూడదు. ఇది వారి తీర్మానం. ఇది మనస్సున ఉంచుకొని వెక్కిరింతకోసం వివాహోద్దేశాలను వారి గ్రంథం నాల్గవపుటలో కొన్ని గుణించారు. ఎవరు ఎక్కడ ఆలాగు వివరించారో తెలియదు. వివాహము ఒక బంధం. కాబట్టి వివాహముగురించి ఒక్క మంచి మాటను పొరపాటునైనా చలంగారు అని యుండలేదు. వివాహబంధం అసలు సృష్టిలోది కాదనిన్నీ స్వేచ్ఛకోరే వ్యక్తులను బంధించడానికి కపటులు కల్పించారనిన్నీ, కాబట్టి స్వేచ్ఛాపరాయణులు ఈ బంధనాన్ని తెగగొట్టవలె ననీ వారి హెచ్చరిక.

మనుష్యుడు పశుస్థితినుండి నాగరకస్థితికి పరిణమిస్తూ వివాహసంస్థ అనే ఉత్కృష్టసోపానాన్ని అధిష్ఠించి నాగరికతాభివృద్ధిని సాధ్యపరచుకొన్నాడు. కాబట్టి వివాహసంస్థకు పూర్వముండే పశుస్థితికి స్త్రీ పురుషసంబంధము తిరిగీవెళ్ళదని దృఢముగా జ్యోతిషము చెప్పవచ్చును. ఆరంభమునుండీ ఇప్పటివరకూ ఈ సంస్థ ఒకేతీరున ఉండలేదు. అన్ని నాగరకసంఘాలలో ఒక్కలాగే లేదు. కాని వివాహములేని సంఘములేదు. ఎన్నిమార్పులు వచ్చినా వివాహములేని సంఘము ఉండజాలదు. ఇప్పుడు జరుగుతూఉన్న వివాహసంబంధపు వ్యవహారా లన్నీ సమంజసము లని ఎవరూ వాదించరు. కాని జరిగియున్న వివాహాలన్నీ మలినబంధనయుక్తములే అని చెప్పుట చాలా సాహసము.

మోహపుస్వేచ్ఛపై ఆధారపడే స్త్రీపురుష సంబంధమువల్ల కలిగేలాభము ఒకస్త్రీ బహుపురుషులతోను ఒక పురుషుడు చాలామంది స్త్రీలతోను సంభోగసంబంధాలు కల్పించుకోవచ్చుననిగదా చలంగారి ఆశయము. ఈ కామస్వేచ్ఛ మనస్సు ఆత్మ అనే పదార్థము లేని వాటికి పరమధర్మమువలె భాసించవచ్చును. మనస్సుకు ఒక విశేషగుణము ఉన్నది. ఒకమారు కలిగిన అనుభవాన్ని ఎన్నటికీపోకుండా మనస్సు ఉంచుకొంటుంది. మైనపు ముద్దలో చిన్నచిన్న నొక్కులన్నీ ఎట్లు ఇమిడియుంటవో ఆలాగే మనస్సున ఈ అనుభవసంస్కారాలు ఉంటవి. సమయమువచ్చినప్పుడు అవి వ్యక్తమవుతవి. స్త్రీపురుష సంబంధము ఎంత కామోద్రేకమున అయినదైనా కేవల శారీరకమే అయి ఉండిపోదు. మనస్సుపై కలిగే ఆ అనుభవము మరొకప్పుడు మరొక స్త్రీ పురుషులతో సంబంధము కలిగినప్పుడు ఉత్తేజకమై స్మరణకు వస్తే, అప్పుడు ఆ రెండు అనుభవాలను సరిపోల్చుట సంభవిస్తుందిగదా. ఆ సరిపోల్చడమువల్ల హృదయములోఉద్భవించే సంరంభము మనస్సుయొక్క ఆరోగ్యభంగానికి కారణ మవుతుంది. ఇట్టి స్మరణసంరంభ నిరోధములేకదా హిస్టీరియా రోగానికి కారణము. కేవలము రోగరూపాన్ని దాల్చకుండా బాధించే హిస్టీరియా చాల

వ్యాప్తమైయున్నదని ఆధునిక విమర్శకుల శాస్త్రము. ఇట్లు మనస్సుయొక్క ఆరోగ్యము చెడితే, ఆవ్యక్తుల జీవితమంతా ఎట్లు అనర్థదాయక మవుతుందో గదా. అట్టి ఉపద్రవాన్ని చలంగారు ఆమోదిస్తారా అని అడగవలసి యున్నది.

ఈ ప్రమాదపు వాదానికి హేతువు కామమును మోహమును చలంగారు అంత అధిక ముగా * పరిగణించడము. చలంగారుకూడా అంగీకరించిన ప్రేమ తత్వాన్ని వివాహ సంబంధానికి పునాదుగా చేస్తే ఈ తప్పుదారినుండి తప్పించుకోవడానికి సాధనం దొరకు తుంది. ప్రేమ తత్వాన్ని ఏమాత్రమైనా సరే అనుభవములోనికి తేగలిగినవారికి వివాహం బంధంగా తోచదు. శరీరభోగమే కోరే బుద్ధిహీనులకు వివాహం బంధముకాక ఏమవు తుంది? చలంగారు మోహాన్ని విడిచిపెట్టి ప్రేమను హెచ్చరిస్తే వారు కోరిన స్వేచ్ఛ ఆత్మోన్నత్యము, సాధించ సుకర మవుతుంది. మోహాభక్తులకంటె ప్రేమపరాయణులు ఉన్నతులు కారా.

వివాహము, దాంపత్యము, పాతివ్రత్యము వీటిలో వారి మతప్రకారం చేయవలసిన మార్పు లను చలంగారు ప్రతిపాదించారు. ఎవరియందు ఎంతకాలము మోహముంటే అన్నాళ్ళే ఆ స్త్రీ పురుషులు సంభోగ సంబంధాన్ని ఉంచుకోవలెను. ఎప్పుడు లేనట్లు తెలిసినా, ఆ వివాహబంధాన్ని తెగదీయవలెను. వారికి పుట్టిన పిల్లలు ఉంటే వారిని పరిపాలకుల పోషణకు అప్పచెప్పాలి. స్త్రీ స్వతంత్రంగా ధనమును సంపాదించుకొంటూ ఉండాలి. పాతివ్రత్యమనేది ఎప్పుడు ఎక్కడా లేదు: ఉండకూడదు, కాబట్టి దంపతులని ఏ యిద్దరిని కట్టి పెట్టకూడదు. ఆకర్షణే ప్రధానం. ఆకర్షింపబడినవారే దంపతులు. ఇట్టి తీర్పులు ఇంకా ఉన్నవిగాని వాటి నన్నిటిని వివరముగా చర్చించడానికి అవకాశము చాలదు. ఇవి అన్నీ మంచివికావు. అన్నీ చెడ్డవికావు. ఈ మార్పులకు ఆధారాలు, ఆధారపరికరాలు, ఎక్కడివి అని ఆలోచిస్తే పాశ్చాత్య గ్రంథాలలోనివి అయి యుంటవి అని తోస్తున్నది. ఎందుచేతనంటే, కొన్నిచోట్ల కొన్ని తెలుగు వాక్యాలు ఆపుస్తకాలలోని వాక్యాలకు భాషాంతరీకరణాలా అని శంక కలుగుతుంది.

వివాహసంస్థపై పాశ్చాత్యగ్రంథాలలో తీవ్రఖండన ఉన్నది. నిజమే. కాని వారి తగాయిదాలకు బీజము కామస్వేచ్ఛావాదము కాదు, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యము. వారి దేశములలో ఈ పోరాటము సుమారు నూరుసంవత్సరాలనుండీ జరుగుతూనే ఉంది.

* వారి గ్రంథంలోని ప్రేమ యోగం ముగింపు అనే అధ్యాయాలలో ఈ తత్వాన్ని వారు ఉపపాదించారు,

చాలామార్పులు వచ్చినవి; కాని కుంకటి వ్రేళ్ళతో కదిలి ఆసంస్థ తిరగబడలేదు. వారి దేశాలలో జరిగిన చరిత్రను చక్కగా గమనించి మనదేశపు ఆచారాలలో మార్పులు హెచ్చరిస్తే చాలా శ్రేయస్కరము. వివాహముగురించి వ్రాసిన ధీమంతులు ఆ దేశాలలో ఉన్నారు. స్త్రీ అనే గ్రంథము తయారుకావడానికి ఉత్సాహము పుట్టించిన పండితులు కొందరు ఉన్నారని నా విశ్వాసము. ఆ గురువర్యుల గ్రంథాలనుండే కొన్ని వాక్యాలను ఇక్కడ పొందుపరచాలని నాకు తోచింది. "ప్రేమభావముయొక్క లోతును గాంభీర్యమును బాగా తెలుసుకోగలుగుటకు వివాహఖండన యెంత సహకారో అంతకంటె యెక్కువగా వివాహసంపదనుభవము సహాయపడుతున్నది." "ఈ సమస్యలగురించి ఎవరూకూడా ఇప్పటికి ఇదమిద్ధమనే తీర్పులకు రాలేదు. విషయము చాలా క్లిష్టమైనదిన్నీ, అనేక సందేహాలతో చిక్కుపడినదిన్నీ". "సెక్సువాసన (instinct) వంటి తీవ్రమైన బలము గలది మరొకటి లేదు. దానిని ఒక్కమారు తప్పుత్రోవలో పెట్టితే తీరని ప్రమాదాలు సంభవిస్తవి. కాబట్టి వివాహసంస్థలో మార్పులంటే భయపడడానికి కొంతకారణ మున్నది.'' ''యావజ్జీవమూ ఏకపత్నీవ్రతాన్ని పాలించడము అసంఖ్యాకులైన స్త్రీలకు సహజమైన యేర్పాటు.'' సహజమైనదని వారి అభిప్రాయం చిత్తగించండి. 'ఆరోగ్యవంతులందరికీ వివాహము సిద్ధించునట్లు సాధనాలను సమకూర్చకపోతే ఏర్పాటులన్నీ నిరుపయోగము.' 'ఏకపత్నీ వివాహసంస్థను మార్చడానికి ప్రయోజనము మానవకుటుంబముయొక్క పురోభివృద్ధిమాత్రమే కావలెనుగాని వ్యక్తుల కామోద్రేకాన్ని తీర్చుకోవడమై యుండకూడదు.' 'ప్రేమపరిణామ మంతా ఏకపత్నీ వివాహసంస్థవైపే నడుస్తూఉన్నది.' 'ప్రపంచమందున్న సంస్థలలోకెల్ల మూలమైనసంస్థ వివాహము; దానిని వివేకముతో ఉపయోగించుకోవడమువల్లనే మానవజాతిని ఉద్ధరించసాధ్యము. ఆ సంస్థలోఉన్న లోపాలను విమర్శిస్తే దానిని దూషించడంకాదు సరేగదా, దాని ప్రయోజనమందుగల విశ్వాసాన్ని ప్రతిపాదించడము అన్నమాట.' * 'నాకు వివాహసంస్థయందు దృఢసమ్మకము ఉంది. ఒక పురుషునికి ఒకే స్త్రీయందుగల ప్రేమగాను, నా భార్యయెడల నాకుగల సంబంధమువలె పరిణతి స్నేహభావముగాను వివాహము ఉండవలెను." "వివాహసంస్థ ఎంత లోపభూయిష్ఠమైయున్నా అదిలేకుండా మన ముండలేము." చలంగారి వ్రాతలలో అక్కడక్కడ ఇట్టి అభిప్రాయాలు లేకపోలేదు. 'ఒక స్త్రీకి ఒకే పురుషుడు, ఒక పురుషుడికి ఒకే స్త్రీ అనే ఆదర్శం చాలా వున్నతమయింది.' (59 పుట.)

---

x Monogamy అనే ఆంగ్లపదానికి సరియైనమాట దొరకలేదు. వ్యాకరణం ఒప్పదుగాని ఏకశేష సమాసం చేస్తే కుదుర్చుకోవచ్చును. xx Judge Lindsay.

"సాధారణ ప్రజ లందరికీ యీ వివాహబంధం అవసరం.అవసరమే. కనకనే ఆసంస్థ అమలు లోనికి వచ్చింది, నిలచివుంది." (87) అని చలంగారు వ్రాశారు. కాని ఇవి వారి మొత్తపు అభిప్రాయాలు కావు. సకృత్తుగా ఉంటవి. అందుచేత ఇట్లు ద్యోతకమైన స్వవిరోధము పుస్తకములోని అన్ని విషయాల గురించి కనిపిస్తుంది. ఈ స్వవిరోధముగురించి ముందు విమర్శిస్తాను. కాని ఈ మంచివనుకొన్న వాక్యాలలో కూడా వివాహము బంధమేగదా వారిమతములో.

చలంగారి అభిప్రాయములో స్త్రీ పురుష సంబంధము వ్యక్తిగతమైనదని. వ్యక్తి స్వేచ్ఛా వాదులైనవారు ఈ తప్పుసూత్రమును కల్పించుకొన్నారు. స్త్రీ పురుష సంబంధము కాను శాంతితో విరమిస్తే వారు ఉపపాదించిన తీర్పులను ఆమోదముతో ఆలోచించగలము. ఆలాగు కాదుగదా. "వివాహము కుటుంబసంస్థపై సాక్షాత్తుగా ఆధారపడి యున్నది." * కాబట్టి వివాహసంస్థకున్నూ సంఘమునకున్నూ అన్యోన్య సంబంధము గలదు. వ్యక్తుల సంబంధమును బట్టి వారి పిల్లల అభివృద్ధి ఉంటుంది. పిల్లలద్వారా మానవజాతియొక్క పురోభివృద్ధి నిర్ణీతమవుతుంది. అంత ప్రాముఖ్యమైన వివాహసంస్థను మోహాముపై ఆధారపెట్టుతామా లేక ప్రేమపై నిలుపుతామా చలంగారు చెప్పవలెను. చలంగారి తీర్పులన్నీ * * సంస్కారము పొందాలిగదా.

స్త్రీపురుష సంబంధ ప్రధానమైన వస్తువును మూడుపేర్లతో చలంగారు వర్ణించారు. అందులో ప్రేమ అని వారు చెప్పినదానితో సంపూర్ణమైన ఆమోదము అందరికీ ఉంటుంది. కామ మోహాము లని మరి రెండు ఉన్నవి. కామం క్షణికమనిన్నీ, మోహాం ఆలాగుగాక కామసంబంధం తరువాతకూడా ఉండి స్త్రీ పురుషులు ఒకరినొకరు ఆక్రమించుకోవాలనే పట్టుదల పుట్టిస్తుంది. గ్రంథారంభమందు ఈ భేదాన్ని చేసినా, చర్చలో మాత్రం ఆ భేదాన్ని అంతగా పాటించినట్లు కానరాదు. ఈ మాటలకు ఆ అర్థం వారు ఎక్కడనుండి సంగ్రహించారో నేను పోల్చుకోలేక పోయినాను. కామానికి వీరు ఇచ్చిన లక్షణము ఋజువు కాకపోయినా, కామాన్ని స్త్రీ పురుష సంబంధమును వ్యక్తపరచే అర్థంలో ప్రయోగించారు పండితులందరూ. ధర్మార్థ కామమోక్షములు పురుషార్థములు. కామసూత్రాదులు కామశాస్త్రం అని ప్రయోగం. కాముడు ప్రబోధచంద్రోదయములో నాయకుడు. కాముకీ, కామినీ, కాముక అని వాడుక. మన్మథునికి అందుచేతనే కామ అనిపేరు.కాని మోహాము అనే పదానికి చలంగారు కల్పించిన అర్థానికి ప్రమాణము కానరాలేదు. మూర్ఛాతు కశ్మలం మోహః అని అమరం. Fainting, Delusion,

* Herbert * * ప్రేమ యోగము ముగింపు లోనివి తప్పు.

Infatuation, Illusion of love అని ఆప్టేడిక్షనరీ. వ్యభిచారిభావాలలోని మోహము అన్ని రసాలకు సాధారణము. చిత్తవిభ్రమ అనే అర్థంలో రూఢిచేశారు. వాస్తవముగా కామము, ప్రేమ ఈరెండే వాడవలసిన పదాలు. "వీరు ప్రేమ అనుకునేదంతా కామమే" అని చలం గారే వాడారు. మోహమనే పదాన్ని చలంగారు ఒకచోట కామంతోను, ఒకచోట ప్రేమతోను సరిపెట్టి వారి ఇష్టము వచ్చినట్లు వాడారు. పదముల అర్థకల్పనకు కూడా సూత్రం నా ఇష్టమేనా ?

ఏదైతేనేమి. కామమోహములతో పుస్తకమంతా నింపేరు. వారి మామూలు ప్రకారం మధ్య మధ్య ప్రేమతత్వాన్ని చాలా గౌరవంతో నిరూపించి స్వవిరోధం చిక్కు తెచ్చిపెట్టారు. ఇట్టి స్వవిరోధపు వాదము విషయమై ప్రత్యేకంగా ఆలోచించుదాము. చలంగారే ఈ ప్రేమతత్వాన్ని ఆధారంచేసుకొని దాంపత్యసుఖం, వివాహబంధాలు, స్త్రీనీతి, మోహంకామం అనే అధ్యాయాలు వ్రాసియుంటే ఎంతో బాగాయుండి ఉండును. అలాగే చేస్తే కామం అనే క్షణిక స్వభావోద్రేకాన్ని, మోహ మనే అధమ వ్యాపారాన్ని బలపరచే తీర్పులు పుస్తకాన్ని నింపివేయకపోయియుండును. కామోద్రేక శక్తిని కవిత్వం మొదలైన ఉత్కృష్టవ్యాపారాలలోకి మార్చగలమనిన్నీ, మార్చుకోవడం మానవౌన్నత్యమనిన్నీ చలంగారే ప్రతిపాదించియున్నారు. ఈలా గున్నా మోహంకోసం అంత అట్టహాస మెందుకు చేశారో వారినే అడగాలి.

ఇట్టి తప్పుత్రోవలో పడడముచేతనే, సంఘ మనే సమస్యగురించి చాలా అపసిద్ధాంతాలు వ్రాయడము సంభవించింది. వ్యక్తి సంఘముల సంబంధం, వ్యక్తిస్వేచ్ఛ సంఘనిరోధము అనే సమస్యగురించి ఇదివరకు వ్రాసియున్నాను. సంఘం అనే వస్తువుపై వారు చాలా ద్వేషాన్ని వ్యక్తపరిచారు. వాస్తవముగా సంఘమని ఒక ప్రత్యేకవస్తువు లేదు, వ్యక్తుల అన్యోన్య సంబంధముల నిర్మాణమే సంఘం; కొందరు వ్యక్తులు కొందరి వ్యక్తుల అభిప్రాయాలతో ఏకీభవించరు. అంతే. కాని ప్రతీవ్యక్తికి మనోగతమై ఒక చిత్రమైన భావము ఉన్నది. తాను అందరితోను అత్తి ఉన్నట్లున్నా తనతో అందరూ అత్తియున్నట్లున్నా ఒక భావము ప్రతీవ్యక్తిలోను లీనంగా తాండవమాడుతూ ఉంటుంది. ఇదే సాంఘిక భావము వాసన, (instinct.) దీనిని ఎంత తీవ్రవ్యక్తి వాదియైనా నిర్మూలించ లేడు. సంఘనిరోధము సంఘబహిష్కారము అనేవన్నీ వ్యక్తిలో ఉన్న ఈ భావము యొక్క ఆవిర్భావములు కాని, వ్యక్తికి బహిర్గతమైన దేదీ లేదు. ఎవరో కొందరు వ్యక్తులు ఆపని చేయడానికి చేయించడానికి ప్రయత్నించ వచ్చును. కాబట్టి సంఘాన్ని దూషించడమంటే, ఆవ్యక్తులను తిట్టడమన్న మాట. వ్యక్తియైన తనకి ఎంత స్వేచ్ఛ కావాలన్న

చలంగారి వాదనో, అంత స్వేచ్ఛ ఆ ప్రతిపక్ష వ్యక్తులకు అక్కరలేదా అని తర్కించాలి. సంఘనిరోధము వాస్తవముగా వ్యక్తిగతమే కాబట్టి సంఘము వ్యక్తిని నిరోధిస్తున్నదని చెప్పడము తప్పువాదన. వ్యక్తిని నిరోధించగలిగే దేదీ లేదు - అంత వ్యక్తిత్వము వ్యక్తి లేకపోతే తప్ప. కాబట్టి ఆ లోపము వ్యక్తిదే పూర్తిగా. తన వ్యక్తిత్వమును సాధించు కొనుటకు కావలసిన శక్తి - ఉత్సాహములు లేక, తన దుర్బలమైన కోరికను తాను నిర్వ హించుకోలేక, తన లోపాన్ని కప్పిపుచ్చి, తన ఆత్మగౌరవాన్ని ఇతరుల దృష్టిలో నిలపాలని, వ్యక్తి ఈ సంఘనిరోధ వాదాన్ని ప్రారంభిస్తాడు. తాను చేసుకోలేని దానిని ఇతరులు చెయ్యాలని నిర్బంధించడం అన్నమాట. ఎంత సరసంగా ఉంది ఈవాదన. చిన్న పిల్లలకు వివాహం చెయ్యకూడదని ఉపన్యాసాలిచ్చిన ప్రముఖులు, వ్యక్తిత్వ శక్తిహీనులై ముసలమ్మ ఒప్పలేదని సమాధానం చెప్పినట్లే, తన ఉద్దేశ నిర్వాహణమునకు సంఘబాధ అడ్డువచ్చిందని గోలపెత్తడం. ఉన్న రహస్యమేమిటంటే, తనపనికి ఇతరుల ఆమోదం కావాలని వ్యక్తిని కోరుతున్నాడు. అట్టి ఆమోదాన్ని కోరకపోతే సరిగదా. సంఘమూ లేదు; నిరోధమూ లేదు; అది ఒక పెద్దభ్రమ. ఈ భ్రమ మోహితులకు సంఘము ఒక రాక్షసి! మనుష్యుని స్వభావం బాగానలిగిన పాత మార్గాన్ని పోవడం. క్రొత్తమార్గమంటే చాలా కష్టం. ఆ కష్టానికి ఇష్టంలేదు. శక్తి చాలదు. ఈ సమన్వయమును గత శతాబ్దములో శాస్త్రజ్ఞులు కనుక్కొని యుండలేదు. అప్పటికి మన శాస్త్రము ఇప్పటంత వృద్ధిజెంద లేదు. చలంగారికి ఇది తెలిసి యుండు నని నావిశ్వాసము.

పూర్వము వెలి అన్న భయము ఎక్కువగా ఉండేది. ఇతరుల ఆమోదాన్ని కోరియుండ డమువల్ల కొంతవరకున్నూ, అశాస్త్రీయమైన పిచ్చినమ్మకాలు, నరకము, వెడిసి కొట్టడము, అదృష్టము, పుణ్యము, పునర్జన్మ, కర్మలు - ఈ మొదలైన నమ్మకాలు వ్యక్తులను ఎక్కువగా బాధిస్తూఉండేవి. ఆంగ్లవిద్య వ్యాపించడముచేత, పరిస్థితులు బాగా మారడముచేత చాలా వ్యత్యాసాలుగల వ్యక్తుల సమ్మేళనములచేత ఈ నమ్మకాలు శిథిల ములైపోయినవి. ఆర్థికదుస్థితి ప్రబలమై విస్తారముగా వ్యాపించనందునకూడా ఈ పౌరా ణిక మతసంబంధమైన నమ్మకాలు చింకివి అయిపోయినాయి. కారాగృహము, అస్పృ శ్యత, ఇతర వర్ణములతో సంవ్యవహారత్వము, ఆహ్లాదకరములైన ఈ రోజులలో వెలి యెక్కడ ఉన్నది. గ్రామాలలోనే లేదు. పూర్వము గ్రామాలు ఎక్కువ చిక్కనివిగా ఉండేవి. కుటుంబశిక్షణ కఠినముగాఉండేది. అప్పుడు అందరూ ఒకేవిధమైన ఆచారవ్యవ హారాలు కలిగియుండేవారు. అప్పుడు వెలిబాధ సుకరము. ఇప్పుడు వెలిపెట్టేవారూ లేరు. వెలి పడేవారూ లేరు. ఒక్క కుటుంబములోనే భిన్నరుచులు, భిన్న ఆచారాలు

గల వ్యక్తులు ఉంటున్నారు. ఇట్టి స్థితిలో సంఘబాధ అని విజృంభించడం దూదితో కత్తి సాము వంటిది. ఈ సంగతికూడా చలంగారికి తెలుసును. 'ప్రతిదినము మారిపోతున్న సంఘాన్ని బూజుపట్టి, పుచ్చి, రాలిపోతున్న యీ పాత నియమాలనే ఆధారం చేసుకుంటే దొంగతనమూ కపటమూ తప్ప యేమీ మిగలదు.* (10) అనివారే వ్రాశారు. ఇంకా ఇట్టి వాక్యాలు పుస్తకములో అక్కడక్కడ ఉన్నాయి. ఇదంతా యెరిగిన్నీ సంఘము రాక్షసియని, పుస్తకములో సగం ఈ సంఘ బాధా తిరస్కారంతో నింపేరే. ఎందుచేత, వారినే అడగాలి.

సాంఘిక భావి నిర్మాణమే సంఘము. దాని ఆవిర్భావము వ్యక్తుల అన్యోన్య సంబంధ నిర్మాణము. ఇట్టి సంఘములేని వ్యక్తిలేదు. ఉండదు. ఉండలేదు. వీరి సంబంధాలే నీతి. తత్వతః వ్యక్తిత్వ ప్రాబల్యాన్ని అంగీకరించవలసినదే. కాని ఈసంఘము, ఈ సాంఘిక నీతి తప్పవు. కాబట్టి ప్రతీవ్యక్తి తన వ్యక్తిత్వాన్ని తన సాంఘికత్వాన్ని తన కింపైన పాళ్ళలో మేళవింపు చేసుకోవాలి. ఆ బాధ్యత పూర్తిగా వ్యక్తిదే. "సంఘవ్యక్తిమీద తన నిబంధనలను విధించకుండా జరగదు" అని చలంగారు వ్రాశారు. వ్యక్తుల జీవితాన్ని ఉన్నత పదవికి నడపడానికి ఈ సంఘము అత్యావశ్యకము. సాంఘిక నీతికూడా అవసరమే. ఇది పండితుల అభిప్రాయం. గ్రంథవిస్తృతి భీతిచే వారి వాక్యాలను ఇక్కడ పొందుపరచలేదు.

చలంగారి వాదతమకం వారిచేత చాలా తప్పు సూత్రాలను చెప్పించడమే కాకుండా, వారి పుస్తకము నిండా స్వవిరోధాలను వేయి నిండించింది. తప్పు సూత్రాలకు ఒక చక్కని ఉదాహరణ ఇచ్చి స్వరోవిధాలగురించి మనవిచేస్తాను. అలవాటు కూడదనేఒకసిద్ధాంతాన్ని వారుబయలుదీశారు. అలవాటువల్ల క్రొత్తదనము పోతుంది. కాబట్టి రొమాన్సు ఉండదు. ఏరోజుకు ఆరోజు ఏ నిమిషానికి ఆ నిమిషం క్రొత్తగా ఉండాలట. క్రొత్తయిల్లు, క్రొత్త బట్ట, క్రొత్త శృంగారం, క్రొత్తభార్య, అన్నీ ఈ విధంగా క్రొత్తవి ఉండాలి. ఇందుకోసం వేశ్యా వ్యభిచారాలని వారు కొనియాడారు. చూచారా, క్షణికమైన కామ స్వేచ్ఛా వాదం ఎంతవరకూ తీసుకొని పోయిందో. ఇది యెక్కడైనా సాధ్యమా? చలంగారి జీవితములో అలవాటు పాతదనం లేనేలేదా? అలవాటులేని జీవి ఉందా? (Habit is second nature) అలవాటు రెండో స్వభావం అని శాస్త్రము. తీవ్రస్వభావ వాదులైనవారు ఈ స్వభావాన్ని ఎందుకు ఇంతగా నిరసించారో కామస్వేచ్ఛ నిలపాలని కదా. అలవాటు చైతన్యముయొక్క స్వభావం. చైతన్య మున్నచోట అలవాటు తప్పదు. అలవాటు అయి తీరుతుంది. అలవాటు వద్దంటే చైతన్యాన్ని లేకుండా చెయ్యాలి. ఒక

---

* Herbert, Elen Key, Justice Lindsay ల గ్రంథాలలోనుంచి ప్రమాణాలు చూపవచ్చును.

మారు చేసిన వ్యాపారాన్ని రెండోమారు చేస్తే అలవాటు అయిందన్నమాటే. ఇది మనస్సుయొక్క స్వభావ సూత్రం. అలవాటుద్వారా మనస్సు తన శక్తిని వృధా కాకుండా కాపాడుకొంటుంది. అలవాటులు మంచివని చెడ్డవని ఉన్నవి. చెడ్డవాటిని మార్చుకోవాలి. మంచివాటిని పెంచాలి. ఏ అలవాటునైనా మార్చడం చాలా కష్టదాయకము. అందు చేతనే పరిజ్ఞానం కలవాడు అలవాటు కాకముందే తెలుసుకొని, ఆ వ్యాపారాన్ని మొదటిమారే చెయ్యడమా లేదా అని పరిష్కరించుకోవాలి. ఒకమారు చేస్తే మన శ్శక్తి ఆ దారినే పరుగెత్తడానికి తయారవుతుంది. కాబట్టి బుద్ధియుక్తమైన అలవాటులను సంపాదించుకోవాలి. "అలవాటువల్ల చెడ్డ ఏమీ లేదు. మనుష్యు లందరూ దానిని ఆధారం చేసుకొనే జీవనయాత్రను నడుపుతున్నారు. అది లేనిది ఎవరూ ఉండలేరు. "అని పండితాభిప్రాయం. ఈ నేను వ్రాసినది చలంగారికి తెలియనిది కాదు. అయినా ఎందుకు అలాగు వాదించేరు అని అడుగుతారు విమర్శకులు చలంగారిని

అయితే ఇంతకంటె ఎక్కువగా బాధించేది గదా స్వవిరోధం చిత్తగించండి. నిగ్రహం గురించి స్తుతీ నిందాకూడా పుస్తకంలో వెదజల్లియున్నవి. "అసలు శక్తిలేనివాడు గొప్ప నిగ్రహిక్రింద చెలామణి అవుతున్నాడు కురూపి పతివ్రత ఐనట్టు. కొందరు నిజంగా సెక్సును ఉన్నతరూపం దాల్చేటట్టు (Sublimate) చేసుకోగల వారున్నారు? "యువకులలో సహజమైన నిగ్రహశక్తి (Controlling) ఉంది." "వెంటనే యీ కామశక్తికి దోవ చూపకపోతే అది అపాయకరమైన మార్గాలలో పడుతోంది'' "ఏమితీర్పు!" "నిగ్రహం అవసరముకాదు. సాధ్యముకాదు. నిగ్రహంలో ఏమీ ఔన్నత్యంలేదు." "నిగ్రహం చాలా ఆరోగ్యవంతం" "అందుకోసం అమిత నిగ్రహం కలిగి ఆనందాన్ని కొంచెం కొంచెంగా గ్రహించాలి'' మనసునూ శరీరాన్ని స్వాధీనములో వుంచుకొని ఆనందాన్ని అనుభవించాలి." "కనక నిగ్రహము అత్యవసరం'' "నిగ్రహం పుణ్యకార్యమని దొంగ మాటలతో పూజిస్తారు.'' ఇక బాలు నిగ్రహం గురించి స్వవిరోధము. అలాగే త్యాగం గురించి. "స్వార్థత్యాగం కావాలి" "త్యాగం చెయ్యాని స్త్రీ పాలియ్యాని గొడ్డు." ఇట్టి చిన్నచిన్న సంగతులలోగల స్వవిరోధాన్నివిడిచి, పెద్ద సమస్యలగురించి సంక్రమించిన స్వవిరోధాన్ని ఇదివరకే సూచించి యున్నానని మనవి చేస్తాను.

ఇంత బుద్ధిమంతులు ఇట్టి పుస్తకాలు వ్రాయగలిగిన ధైర్యవంతులు, ఇన్ని గ్రంథాలు చదివినవారు చలంగారు ఇట్లు స్వవిరోధములతో నిండిన వాదాలను ఎందుకు చేశారని ప్రశ్న ఎవరికైనా పుట్టకమానదు. వారి పుస్తకములతో మాత్రమే పరిచయముగల నావంటి వారుకంటెఎక్కువబుజువుగాయీసందేహానికి సమాధానం చెప్పగలిగేవారు వారితో బాగా

ఉం౧

కలిసిమెలిసిన స్నేహితులు అట్టి స్నేహితులకు చలంగారిబుద్ధి ఎట్లు పరుగెత్తుతుందో తెలుస్తుంది. నేను ఊహించినంతవరకు నా సమాధానం ఇదివరకే సూచించియున్నాను. వారు కేవలం స్వభావప్రియులు. వ్యక్తిత్వమును సమర్థించాలనే దీక్ష వారి బుద్ధిని ఆక్రమించడం వల్ల ఈ స్వభావసమర్థన దృఢపడింది. ఎవరిఇష్టం వారిది అన్నవాదము బయలుదేరింది. ఈవాదములో ఉన్న లోపాన్ని గుర్తెరుగుటకు తగినసాధన దేనినుండి వారు పొందగలరో దానియెడల వారు ద్వేషాన్ని కల్పించుకొన్నారు. లోకములో స్థూలదృష్టికి గోచరమైయేది బహుత్వము అవి స్వభావాలు. వాటిని శాస్త్రపద్ధతులమీాద విశేషించి ఆ బహుత్వమును ఆశ్రయించుకొన్న ఏకత్వమును గ్రహిస్తేనేగాని, ఈ స్వభావవాదలోపము తెలియదు. అట్టిది ఫిలాసఫీ. ఫిలాసఫీఅంటే బి. ఏ., పరీక్షకు చదివే మూడుపుస్తకాలే కావు. అది ఒకవిధమైన విమర్శనదృష్టి, పరిశోధనపద్ధతి. ఆ ఫిలాసఫీ అంటే వారికి ద్వేషము. దానిని వెక్కిరించారు. కాబట్టి వారి వాదలోపాన్ని వారు కనుక్కొన్నారుకారు. ఆ లోపాన్ని వర్ణించడానికి ఒక లోకోక్తి ఉంది. తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం అని. కాబట్టి ఒకచోట స్తుతి, ఒకచోట నింద, ఒకచోట స్వభావం, ఒకచోట ఆదర్శం, ఒకచోట ప్రేమ, ఒకచోట కామం, ఒకచోట ఆధ్యాత్మికం, ఒకచోట కేవల పశుత్వయుక్తమైన శారీరకము, ఒకచోట ఈ సౌఖ్యం, ఒకచోట ఆ సౌఖ్యం, ఒకచోట హృదయం, ఒకచోట ఇంద్రియాలు, ఒకచోట సంఘక్షేమస్తుతి. ఒకచోట సంఘద్వేషము ఇట్లు భిన్న సోపానాలకు జెందినవాటిని కలగాపులగంగా కలిపివేసినారు చలంగారు.

తన చుట్టుప్రక్కల నున్న లోపాలను చూచి, మండిపడే స్వభావం చలంగారిదని నా ఊహ. మంచిదే అది. ఆ స్వభావాన్ని వారు ఆంగ్లభాషలో ఉన్న సెక్సువాఙ్మయంచేత పోషించేరు. సినిమాలో చూచిన నాయకి శృంగారం ఇంటి గృహిణివద్ద లేదని అలిగిన రోమాన్సు రసికుని వలె చలంగారి హృదయగ్రంధి శిథిలమై పోయింది. అట్టి పరిస్థితిలో వారిని గట్టిపరచేది సమీాకరణ తత్వం అది లేకపోయింది.

శారీరక స్వభావ వాంఛలను సమర్థించాలని పశుసంబంధమైన సామ్యములను ఉపయోగిం

---

* Man cannot live without an Absolute. If he cannot believe in a true absolute, he will believe in a partial and fictitious one. When once the hold of the absolute has relaxed and the Conclusion reached that all is relative. Men are ready to become slaves...In the absence of an ultimate philosophy, Men tend towards money or sex. Dr. W. R. Matthews.
No action canbe divorced from moral judgement, there is nothing in the world which can be deprived of the value that belongs to everything in its relation to moral ends. - Dr. Livingstone.

చేరు వారు. "పశువుల్లో, పక్షుల్లో పిల్లలిని కనడంవల్ల ఆడవాటికి ఆహారం సంపాదించుకో డానికి ఆటంకం కలుగుతోందా; అలాగే మానవస్త్రీకూడా చెయ్యాలి". పశువులలో సాధ్యమైనది మనుష్యులలో సాధ్యమనే ఉపమాన తర్కము తప్ప ఈలాగే వారి వాసనా వాదం (Instincts) తయారయింది. ఈ వాసనలే ఆత్మ అని చలంగారు వాదించారు. మంచి చెడ్డల పరిష్కారానికి వాసనలు (Instincts) ప్రమాణములని వారు వాదించారు. ఇష్టంలేని కూర మ్రింగలేమే అని భోజనం చెయ్యకుండా ఉంటారా? అనే పశువ్యాపార సూత్రాలను భర్తపరీక్షలో ఉపయోగించారు. అసలు సృష్టిలో లేనిది అని ఒక సిద్ధాంతం నిర్మించారు. ఇవన్నీ కూడా ఆ స్వభావ సమర్థన ప్రయత్నంవల్ల సంభవించిన అపసిద్ధాంతాలు. పరిణామములో భిన్న సోపానాలకు చెందిన పశుమానవ జాతులను ఉపమాన సూత్రాలద్వారా నిర్వచించడం చాలా తప్పువాద మని మనవి చేస్తున్నాను. ఈ పొరపాటుల వలన ఈ ప్రమాదం వచ్చింది. గ్రంథం ఎక్కువవుతున్నాదని ఒక పండితుని అభిప్రాయాన్ని తెలియజేసి చాలిస్తాను. గొప్ప పరిశీలన లేనిదీ గంభీరమైన బాధ్యత వహించనిదీ, శాస్త్రజ్ఞుని అనంసక్తత ఉండనిదీ, పరిజ్ఞానము * పరికరములు తర్కశిక్షణ సంపాదించనిదీ, ఏవో

---

* తల్లితండ్రుల మాట వినే కుర్రవాడికి గతులు లేవు.
ప్రజలకి ఎంత కోపం తెప్పిస్తే నాకు అంత సంతోషం.
వివాహముకంటె వేశ్య,వ్యభిచారం మంచివి.
వివాహమువల్లనే జెలసీ వచ్చింది.
వేశ్యావృత్తికి కారణం వితంతువులకు కామం తీర్చుకొనే హక్కు లేకపోవడం.
మార్పుకోసం యితరులు కావలిసివస్తే వారిని పొందడంలో తప్పువుండ కూడదు.
కామోద్రేకం ఒక భర్తతో తీరకపోతే నలుగురి నెందు కంగీకరించకూడదు.
కొందరు సమానమోహంతో యెక్కువమందిని మోహించగలరు [ఇది తప్పు, వాస్తవముగా]
వారివారి వాంఛలప్రకారం అనుభవింపవలసిందే.
సుఖరోగాలకోసం మందు ప్రతిమనిషివద్ద ఉండాలి; యే నిమిషాన యేబుద్ధిపుట్టి యెటువంటి స్థలానికి కదు తాడో [మనిషా, పశువా, అలాగు చేయడానికి]
కామం తీర్చుకోక ఎండిపోయిన స్త్రీ అంతరాత్మని ఇంకోరు ఉండరు.
భర్త కుష్ఠరోగీ, సుఖరోగీ, నీచుడూ నరహంతకుడూ ఐతే మరీ – మంచిది.
వేశ్య న్యాయంగా స్వేచ్ఛగా సౌఖ్యమిస్తుంది... ఈ పెళ్ళికూతుళ్ళు భోగంవాళ్ళలో శయ్యావంతు విలువ చెయ్యరు.
గొప్ప హృదయంగల స్త్రీని పదిమందితో పంచుకోడమే ఉత్తమం.
ఎందరు భార్యలకు నిజమైన భక్తివుంది భర్తలమీద.
పాతస్త్రీ కొత్తస్త్రీ కన్న చాలానయం.
వేశ్యనెరిగిన పురుషుడు తిరిగి భార్యముఖం చూసేవాడెంత నిర్భాగ్యుడై వుండాలి.
ఇట్టి సరసోక్తులు వేలకువేలు వెతకవచ్చు పుస్తకములో!

సదుద్దేశము ఉన్నాదని ఏవో వ్రాతలు వ్రాస్తే చేసే మేలుకంటె ఎక్కువ కీడు చేయడమవుతుంది.

ఇంత విపులంగా చలంగారి పుస్తకముపైని ఈ వ్యాసం వ్రాయడంవల్లనే నా అభిప్రాయంలో ఈ పుస్తకము ఎంత విలువగలదో వ్యక్తమవుతున్నది. పనికిమాలిన పుస్తకమని నేను తలంచేయుంటే నా తీరుబడిని వృధాపుచ్చి యుండను; కాబట్టి వేరే నా ఆమోదాన్ని వర్ణించ నక్కరలేదని నా విశ్వాసం. సెక్సు విషయము ఆధునిక జ్ఞాన ప్రపంచములో గొప్ప ప్రాముఖ్యాన్ని వహిస్తూ ఉన్నది. సెక్సు బూతుకాదు. * దాచవలసినది కాదు. చక్కగా తెలుసుకోవలసిన దే. కాని యువకులు చాలామంది దీని విషయమై కొంచెం కొంచెం భోగట్టా ఆంగ్ల భాషలో ఉన్న నాటకాలు, నవలలు, కథలు చదివి సంపాదిస్తున్నారు. కాని ఇంగ్లీషు రానివారికి ఉపచరించేటట్లు తెలుగులో మంచి గ్రంథాలు కావాలి. నేను ఎరిగినంతవరకు ఇప్పటికి రెండు గ్రంథాలే బయలు వెడలినవి. ఒకటి ఇది, రెండోది తాతా కృష్ణమూర్తిగారు వ్రాసిన "వలపు" ♦ ఇద్దరు గ్రంథకర్తలూ ఉపాధ్యాయులే, పాఠాలు చెప్పతగినవారే. "వలపు" కంటె "స్త్రీ" ఎక్కువ వుద్వేగం గలిగి, ప్రచారమునకై వ్రాయబడినది. ఈ కళంకము లేని కేవల శాస్త్రగ్రంథ మొకటి ఏ యువక సోదరులైనా శీఘ్రకాలంలో వ్రాయుదురని వేడుతున్నాను.

చలంగారు ఈ గ్రంథం వ్రాసి ఈ విషయమై విచారణలు బయలుదేరేటట్లు చేసినందుకు చలంగారికి ఆంధ్రులు కృతజ్ఞులు కావలెను. నా వందనములు అర్పిస్తున్నాను వారి వుత్సాహ ధైర్యములకు. వారు తమ గ్రంథాన్ని "స్త్రీ"కి కృతిగా ఇచ్చి, స్త్రీయెడల వారికి గల గౌరవాన్ని ప్రదర్శించారు. గర్భనివృత్తిమార్గాలు, సుఖరోగాలు, గర్భం, గర్భస్రావం, వంధ్యత్వం అనే అధ్యాయాలు, స్త్రీ స్వేచ్ఛ సాంఘికనీతి అనేవాటికంటె ఎన్నోరెట్లు స్త్రీ గౌరవాన్ని ప్రతిపాదిస్తున్నాయని నా అభిలాష. ఈ విషయముల గురించి నేను నా వ్యాసములో ఏమీ ఎత్తుకోలేదు. ఆ పూజ్యభావంతోనే విడాకులగురించి కూడా విడిచిపెట్టాను. నేను పండితుడనని గర్వించలేదు. చలంగారు మాత్రం—

'ఆపరితోషాద్విదుషాం న సాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్' అనే మహాకవి వచనమును ఆదరిస్తారని నమ్ముతున్నాను.

"ప్రేమమయ మీ జీవనము
త్యాగమయ మీ జగము."

---

* అలాగని పచ్చిగా వ్రాయ నక్కరలేదు.

♦ మొదట చలంగారు వ్రాసినట్లు జ్ఞాపకం.

# సంపాదకీయము

## అష్టమ పరిషత్సమావేశము :

హైదరాబాదులో జరుగుతుం దనుకొన్న అష్టమసమావేశము చెన్నపురి ఆంధ్రమహాసభవారి ఆహ్వానమున మదరాసులో 1941 సంవత్సరము డిసెంబరు 24, 25 తేదీలలో శ్రీ అడివి బాపిరాజుగారు అధ్యక్షులుగా జరిగినది. ఆంధ్రమహాసభవారి పక్షమున శ్రీ బి. యస్. మూర్తిగారు ఆహ్వానసంఘాధ్యక్షత వహించి పరిషత్తుకు స్వాగతము చెప్పినారు. శ్రీ కల్లూరి సుబ్బారావుగారు ఉపక్రమోపన్యాసము చేశారు. అధ్యక్షోపన్యాసముతో 24 తేదీ ఉదయకార్యక్రమము సమాప్త మయినది. ఆసాయంకాలమూ, మరునాటి ఉదయమూ ప్రసంగములూ, పఠనములూ జరిగినవి.

జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు "సాహిత్యసృష్టి", జమ్ములమడక మాధవరామ శర్మగారు "సాహిత్యదార్శనికత", మాచిరాజు దేవీప్రసాదుగారు "వికటరచన (Parody)," నోరి నరసింహశాస్త్రిగారు "సాహిత్యము: సనాతనత్వము," అనే విషయాలను గురించి ఉపన్యసించారు.

దేశిరాజు కృష్ణశర్మ, దేవీప్రసాదు, గంగాధరతిలక్, రజనీకాంతరావు, అనిసెట్టి సుబ్బారావు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, మొక్కపాటి కృష్ణమూర్తి, సింగరాచార్యులు, ఊటుకూరి సత్యనారాయణరావు, మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి ప్రభృతులు తమతమ నవ్యరచనలు చదివి వినిపించినారు.

26, 27 తేదీలలో పరిషత్సభ్య సాధారణసభలో ఎన్నికలు జరిగినవి. కొన్నితీర్మానములు ఆమోదించినారు. ఎన్నికలలో వచ్చినసభ్యుల పేర్లు స్థలాంతరమున ప్రకటించినాము.

### తీర్మానములు:

౧. ప్రతిభ పత్రికకు సంవత్సరపుచందా మూడురూపాయలు ఉండవలె నని ఈసభవారు ఏకగ్రీవముగా తీర్మానిస్తున్నారు.

౨. ధనసంపాదనకోసము "ఆర్థికోపసంఘము" ఒకటి ఉండవలె ననీ, జిల్లాకు కొందరు సభ్యుల చొప్పున ఉండా లనీ తీర్మానించడ మయినది.

౩. నవ్యసాహిత్య పరిషత్తు ప్రచారకశాఖ ఒకటి ఉండా లని తీర్మానిస్తున్నారు.

౪. నవ్యసాహిత్య పరిషత్తు నవమసమావేశము శ్రీ నండూరి సుబ్బారావుగారి ఆహ్వానముపైన ఏలూరులో జరపడానికి అంగీకరించడ మైనది.

### ఆదాయ వ్యయములు :

[౧—౨—౧౯౪౦ నుంచి]

ఆదాయము — వివరములు

| | |
|---|---|
| శ్రీ శ్రీ చిరుమామిళ్ళ విజయపార్థసారథిగారు | రూ ౧౦౦ |
| శ్రీ శ్రీ రాజా మాణిక్యరావు, హయగ్రీవరావు వారు | ౨౫ |

| | |
|---|---|
| శ్రీ కాళ్ళకూరి సూర్యనారాయణగారు | ౧౦ |
| శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారు | ౧౦ |
| శ్రీ శాస్త్రిగారు | ౫ |
| విడిపత్రికల అమ్మకమువల్ల | ౨౫ |
| పత్రికకు చందాలవల్ల | ౩౨౧ |
| మొత్తం | ౪౯౫ |

## వ్యయము :

| | |
|---|---|
| ఆంధ్ర గ్రంథాలయ ముద్రాశాలకు | ౭౫౦ |
| పోస్టేజీ వగైరా | ౧౧౧ |
| మొత్తం | ౮౭౧ |

## నవ రస గంగాధరము

ఆంధ్రుడయిన జగన్నాథ పండితరాజు సంస్కృతమున రచించిన రసగంగాధరము ప్రసన్నగంభీరమైన ప్రసిద్ధ అలంకారశాస్త్ర గ్రంథము. శ్రీ జమ్ములమడక మాధవరామ శర్మగారు దానిని తెలుగులోకి చక్కగా అనువదించినారు.

గ్రంథమంతా 'ఆననములు' అనే పేరుతో నాలుగు భాగాలు. రసభావ గుణవిశేషములకు సంబంధించిన సరస సమంజస విమర్శ ప్రథమాననంలో ఉన్నది. పండితరాజు పద్యాలలోని మార్మికత, మనోహరత్వము, కవితా రచనకు ముఖ్యవిశేషముల చర్చ, విశిష్ట పరిష్కారాలు, ఇందులో ఉన్నవి. సాహిత్యాభిలాషు లందరూ చూడవలసిన ఉత్తమగ్రంథము. ఈ అనువాదము మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, వైయాకరణ, సార్వభౌమ, బ్రహ్మశ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిలవారికి అంకితము. ప్రథమాననము 300 పుటలలో అందముగా అచ్చుపడినది. జూలై నెలలో పరిషత్తువారు ప్రకటిస్తారు.

## త్రివేణి

ఇంగ్లీషులో త్రైమాసిన పత్రిక. శ్రీ కోలవెన్ను రామకోటీశ్వర రావుగారు బహుకాలము నుంచీ చిక్కులకు ఓర్చి సమర్థతతో నిర్వహిస్తున్నారు. కొన్ని ఇబ్బందులవల్ల జనవరిలో మదరాసునుంచి బెంగుళూరుకు మార్చి ప్రకటిస్తున్నారు. యావద్భారత దేశములోకీ ఉత్తమ మయిన ఈ పత్రిక ఇక ముందు అక్రమముగా వస్తుం దని నమ్ముతాము.

# నామ"——"రహితం

## వేదుల సత్యనారాయణ శాస్త్రి

కర్త పిఠాపురము యువరాజా శ్రీ రావు వేంకట మహీపతి గంగాధర రామారావుగారు. 'అతి వాస్తవికకవిత' అనేపేర ఒక క్రొత్త పాయ బయలుదేరి నవ్యసాహితీ ప్రవాహములో కలుస్తున్నది. సాహితీవాహిని నీరసించి రస పిపాసువులకు విసుగుపుట్టించిన కాలములో, ఏదో నవజీవము ప్రసాదించ డమునకు ప్రతీచిని ఈ పాయ బయలుదేరింది. ఎక్కడ పుట్టినా ఎలా పెరిగినా తెలుగు సారస్వతక్షేత్రా లకు దీనిచలవ నేటికి లభించింది. దీనిపాలిటి తెలుగు భగీరథుడు శ్రీ శ్రీనివాసరావు. తెలుగుయువ కవులు ఎందరో ఆ పాయలో మునిగి ఓలలాడుతున్నారు. వారిలో శ్రీ యువరాజాగారు "గంగాజలై ర్భువి భగీరథయత్నలబ్ధైః తృప్తిం కరోమి కథమ ప్యధునా బుధానాం" అన్నట్లు సహృదయ లోకాన్ని సంతృప్తిపరచడానికి ఈ గ్రంథాన్ని పైకి విసరినారు.

ఈ గ్రంథానికి పేరు పెట్టలేదు. దేనికైనా వ్యవహారముకోసమే పేరుపెడతాము మనము. కవ్యుద్దిష్టము స్పష్టముగా అవగాహన కావడమునకు గ్రంథమునకు నామకరణము అవసర మంటారు కొందరు. కావ లసినవారు పేర్కొనడమునకు అయినా గ్రంథానికి పేరుపెట్టడము వ్యవహారధర్మము అంటారు మరి కొందరు. అయితే నామరహిత మనేదే ఈ గ్రంథానికి పేరు అని చెప్పవచ్చును. వివిధావస్థలలో కవికి కలిగిన భావాల సంపుటము ఈ గ్రంథము. వస్త్వైక్యము లేనప్పుడు పేరు పెట్టడమువలన వచ్చే ఫలము లేదు. పద్యము మొదట చ॥ మ॥ కం॥ అని ఉంటేనే కాని పద్యములాగు చదవడము సాధ్యము కాదు అనే ఆచారపరులకు నామరహిత మనేపేరు కొంచెము కంటగింపుగానే ఉంటుంది. గ్రంథ విషయానికి సంబంధించని కవికర్ణరసాయనమూ, శ్రవణానందమూ, కవిచకోరచంద్రోదయమూ అనే పేర్లకు ఏవిధ ముగాను తీసిపోని నామరహితం అనే పేరే ఆ ఆచారపరులకు కొంతసంతృప్తి కలిగిస్తుంది. బొమ్మవేసి దానికింద 'ఫలానా' అని వ్రాయడము ఎదుటివారి బుద్ధిని, ఊహను, కించపరచడ మని కొంద రంటారు. వారికే సమాధానము అక్కరలేదు.

ఏవిషయములోనైనా సరే మార్పును ఒప్పుకోనిపెద్దలు ఈ గ్రంథముద్రణాన్ని చూడడముతోనే కళ్లు పెద్దవి చేసి ముఖము చిట్లిస్తారు.

ఇది పిఠాపురము యువరాజావారి రచన అని తెలియడముతోనే చిరునవ్వు తెచ్చిపెట్టుకొనే ధైర్య వంతులు వారు. గ్రంథము వ్రాతప్రతిగా కాకుండా అచ్చుప్రతిగా కావడమే వారికి ముఖ్యము. అచ్చు విషయములో అందమూ చందమూ ఆకర్షణా ఉండవలసినపని లేదు వారికి. బరూరివారి అచ్చుకూ, పంచాంగపు ముద్రణానికీ అలవాటు పడినకళ్లు వారివి. అటువంటివారికి ఈ గ్రంథముద్రణము వికారముగా కనిపించడములో ఆశ్చర్యము లేదు. కక్కుర్తి, లోభత్వమూ, చిక్కిరిబిక్కిరితనమూ పోయి గ్రంథముద్రణవిషయములో తెలుగువారికి క్రొత్తగా ఏర్పడిన అభిరుచికి ఈ గ్రంథముద్రణము ఒకానొక

కొత్తరూపము. బాహ్యాకృతి హృదయాకర్షణకు ప్రధానముగదా! గోడ సొగసుగా లేకపోతే చిత్రము కూడా కట్టవలసినంత రక్తి కట్టదు.

ఈగ్రంథము అతివాస్తవికకవితకు చెందినదని మొదటనే చెప్పాము. ఏరచనకైనా భావమూ, భాషా, ఈరెండూ ప్రధానాలు. కవి భాషలో చూపించే పలుకుబడివల్లా, అలంకారాలు మొదలైనసొగసులవల్లా, భావానికి ఒకవిధమైన హృదయంగమత్వము ఏర్పడుతుంది. భాష ఆకర్షణీయముగా లేకుంటే హృదయము భావోన్ముఖము కాలేదు. అట్లా కాకుండా ఉన్నదున్నట్లు నగ్నముగా భావాన్ని వెల్లడించడమే ఈమాదిరిరచనకు లక్షణ మంటారు తద్రచయితలు. యతిప్రాసలు లేకుంటేనే పద్యాలకు గాంభీర్యమూ, విదగ్ధతా తగ్గిపోతుం దని భయపడేవారికి ఈరచన పచ్చివెలగకాయ గొంతున పడ్డట్లు ఉంటుంది. పదబంధపుసొగసులూ, అలంకారాలూ, ధ్వనులూ వగైరా లేకుండా కట్ట భావావిష్కృతి తోనే సహృదయులకు రసానుభూతి కలిగించడానికి ఎంతో అలౌకికశక్తి ఉండాలి. మామూలు రచనలో అసలు భావము గంభీరముగా లేకపోయినా భాషావైఖరి చివరవరకు పాఠకుణ్ణి లాగుకొని పోతుంది. కాని అతివాస్తవికకవిత ఎంతనగ్నముగా ఉంటే అంతసొగసట. అసలు మానవునికి కలిగే భావా లన్నిటికీ స్వప్నావస్థ ఆలవాల మని, అక్కడ స్ఫురించినభావము వెల్లడికి రానురాను స్వచ్ఛతనూ, స్వారస్యమునూ ప్రత్యేకతనూ కోల్పోతుం దని, అందువల్ల స్వాప్నికస్థితిలోని భావ ప్రపంచాన్ని బాహ్యాలంకారాలకు పాలు గాకుండా యథాతథముగా చిత్రించడమే అతివాస్తవికత అని ఆసంప్రదాయవాదులు అంటారు. కాని వాస్తవికత హెచ్చినకొద్దీ కవితాలక్షణాలు దూరమై మనోజ్ఞత చప్పబడిపోవచ్చు. అల్లా కాకుండా చెప్పగలగడమే ఆ రచనలోని శిల్పము. అదే కళాప్రపంచానికి జీవగఱ్ఱ. నిజము చెప్పవలసివస్తే అతివాస్తవిక కవిత సూత్రరచనవంటి దని చెప్పవచ్చు. ఎంత కొద్దిమాటలతో ఎంత గొప్ప భావాన్ని ఎంత సులువుగా చెప్పగలిగితే రచన అంత గొప్ప దవుతుంది. శబ్దార్థాలంకారాదులకు అందులో ప్రాధాన్యము లేదు గాని అవకాశము లేకపోలేదు. కాని ఇప్పటికిది అనుకరణము. అందులోను ప్రథమావస్థ. వేయేండ్లనుంచి వస్తున్న సాహిత్యములో ఈ కొలతబద్దకు చాలిన రచన దొరకడము కష్టమనుకుంటున్నప్పుడు ప్రథమావస్థలో ఉన్న ఈ అతివాస్తవిక కావ్యాలను ఆ కొలతబద్దతో కొలవడము అన్యాయ మనక తప్పదు. కాబట్టి సహృదయులకు కొంత తాలిమి అవసరము.

ఈ గ్రంథమును రచించిన శ్రీ గంగాధరమారావుగారి సాహితీసంసదా, రచనాకుశలతా, రసజ్ఞతా సహృదయులకు తెలియనివి కావు. కొన్ని నాటకాలూ, కొన్ని కావ్యసంపుటాలూ వీ రిదివరకే ప్రకటించి ఉన్నారు. వీరి కావ్యాలలో చినుకుల చిందులు అనే కావ్యసంపుటమును శ్రీ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు ఆంగ్లభాషలోకి అనువదించారు. వీరి నాటకముల ప్రదర్శనములను రసజ్ఞులగుప్రేక్షకులు చూచే ఉన్నారు. అటువంటివారి రచన అయినప్పుడు ఈ గ్రంథములో ఏమీ లేకుండా ఉంటుందా? శ్రీవారు గ్రంథాదిని ఉపోద్ఘాతరూపముగా 'తొలిజాము' అనే పేర ఈ రచ గూర్చి అభిప్రాయము వెల్లడించా.. అందులో "పద్యం గద్యం కాకుండా, వింతయైన సంగీతంతో

క్రొత్తభావాలు పెంచి మూడుమాటల్లో ముప్పది తళుకులూ, మూడువందల హృద్భావాలూ చూపించాలని యత్నించాను. కాని తృప్తికలుగలేదు'' అని వ్రాశారు. తమకే తృప్తిలేని రచన లోకానికి సంతృప్తి ఇస్తుందా? అని వారికే సంశయము కలిగి "మంచిది నిలుస్తుంది. చెడ్డది నశిస్తుంది. కాలమే చేస్తుంది ఆ పని'' అని భారమంతా కాలపురుషుడి తలమీద పడవేశారు. అది ఒకవిధముగా గ్రంథకర్తకు సహజముగా ఉండవలసిన వినయభావాన్ని సూచిస్తున్నది. అయినా మనము దానిని సత్యమని కూడా ఒప్పుకోవాలి. క్రొత్తత్రోవ త్రొక్కిన మహాకవు లందరూ లోకములో బాధపడలేక ఈ విధముగానే "కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ'' అని నిర్లక్ష్యముగా భవిష్యత్తుపైన భారము వేసి తమరచనలను సాగించారు. వారిలాగే యువరాజావారుకూడా తమ సరికొత్తరచనను కాలపురుషుడి చేతిలోని త్రాసులో పడవేశారు. ఒకవేళ అది పైకి రాకపోవచ్చును. కాని అదే సారవంతమని లోకము ఎప్పటికైనా రెండు చేతులూ చాపి దానిని అందుకొంటుంది. తూనికలో పైకి వచ్చినదే నిరర్థకమైనదని గ్రహించగల రసజ్ఞత లోకానికి ఉన్నది. యువరాజావారు చెప్పిన మాటలకు తోడుగా మేము పూర్వకవి ఒకడు అన్న "ఏగతి రచియించిరేని సమకాలికు లెవ్వరు మెచ్చరే గదా'' అనే మాటలనుకూడా సహృదయులకు మనవి చేస్తున్నాము.

ప్రతివానికీ ప్రతివిషయములోను ఒక నిర్ణయమూ, ఒక అభిరుచీ ఏర్పడి ఉంటవి. ముఖ్యముగా సారస్వత విషయములో ఆ ఏర్పాటు తప్పదు. ఏ ఏర్పాటు లేనివాడు మరేదైనా చేస్తాడు గాని సారస్వతముజోలికి రాడు. ఆ ఏర్పాటు సహజమైనా ఎదటివాని భావమూ, అభిరుచీ, పద్ధతీ తెలుసుకోవలెనంటే మన ఏర్పాట్లను దూరముగా పెట్టితీరాలి. ఇది ఇలాఉండి తీరాలి అని బయలుదేరడముకన్నా, మరోవిధముగా ఉన్నదానిని అనుభవించవలెననే ఓపికతో కావ్యపాఠకులు ఉండకుంటే కవిత్వము అసలు అర్థము కాదు. సహృదయ హృదయాహ్లాదకత్వమే కవిత్వమునకు లక్షణముగా చెప్పారు పెద్దలు. సహృదయు డంటే సమానానుభూతి కల హృదయము కలవాడని అర్థము. కావ్యము కవి స్వానుభవము కాని పాఠకుని అనుభవము కాదు. పరానుభూతి మనకు ఆస్వాద్యము కావలెనంటే మొదట అహంభావమును వదలుకోవలె. మనది సర్వమూ వదలుకొంటేనేగాని మనకు పరానుభూతితో సానుభూతి కలగదు. ఏదో ఒక నిర్ణయమును ముందుగానే చేసి, ఉన్న పరికరాల నన్నిటినీ దానికి సమన్వయ పరచడమునకు ప్రయత్నించే చరిత్రకారుడు సత్యమును గ్రహించలేడు. పరికరాల నన్నిటిని బట్టి సత్యాన్ని నిర్ణయించవలె. అట్లే ఇటువంటిదానినే నే నంగీకరిస్తాను అని బయలుదేరేవాడికి ఉన్నదానిని గ్రహించే ఓపిక నశిస్తుంది. అప్పుడు అతడు రచనలోని మంచి చెడ్డలను గ్రహించలేడు. కాబట్టి కావ్యపఠయిత అహంభావమును వదిలితేనేగాని కావ్యరసము అనుభూతము కాదు. అటువంటి పాఠకులకు ఈ గ్రంథములోని సంతృప్తి కలుగుతుం దని చెప్పవచ్చును.

కవిరచన భావప్రపంచానికి సాంకేతికము. సాంకేతికమైన భావము బోధపడడమునకు కొంత శ్రమపడవలెను. శ్రమపడకుండా ప్రతిదీ అనుభవమునకు రావాలని అందరూ అనుకుంటారు. దేనికై మనము శ్రమపడమో అది మనహృదయముదాకా రానేరాదు. ఆ అనుభవములో మమతఉండనే ఉండదు. కవిత్వముతో

బుద్ధికన్నా హృదయానికి ఎక్కువ సంబంధము ఉన్నది. ఆ సంబంధమును నీదిగా చేసుకోవలెనంటే దానికై నీవు శ్రమపడక తప్పదు. కాబట్టి కవిభావములకు సాంకేతికమైన కావ్యమును సావధానముగా మననము చేయవలెను. ఒకసారి కిందినుంచి పైకి చూచినమాత్రాన సత్యము అవగాహన కాదు. ఎంత పండైనా పిండకుండా రసము లభిస్తుందా! ఇటువంటి గ్రంథాలను ఒకసారి చదివి ఇందులో ఏమీ లేదని చెప్పడము తప్పు. కొన్నిసార్లయినా చదివితేనే గాని కవి ఏర్పరచిన సాంకేతిక జాలము విడిపోయి భావము బయటపడదు.

ఈ గ్రంథము మొదటినుంచీ చివరవరకు చదివితే ఈ కవిజీవితములో ఏదో ఒక ఆవేదన ఉన్నట్లు పొడ గట్టుతుంది. ఆ ఆవేదనే కవి సృష్టిపై మనకు సానుభూతిని కలిగిస్తున్నది. తన ఆశయాలకూ ఆదర్శాలకూ తన పరిసరాలు సరిపడనప్పుడు జీవితములో ఆవేదన బయలుదేరుతుంది. పరిసరాలకు లొంగిపోయిన వానికి నిజమైన జీవితము లేనేలేదు. లొంగినప్పుడే పోరాటము. ఆ పోరాటములోని జయాపజయాలను, కష్టసుఖాలనూ సాధకబాధకాలనూ పిండి అసిగ్గును కావ్యరూపముగా కవి సృష్టిస్తాడు. ఇంద్రధనుస్సువంటి ఆ సృష్టినే అనుభవిస్తూ మనము మనలను మరచిపోతాము. అదే తన్మయత్వము. అదే రసానుభూతి. ఆ అనుభవము మనకు కలగాలంటే మన సంస్కారములోనో, అంతరంగంలోనో లోపమున్నదన్నమాట. సర్వాంగశోభితమైనదైనా సర్వాంగీణమైన సంస్కారమూ, ఈ రెండూ కలిస్తేనేగాని కావ్యరసము అనుభవమునకు రాదు. ఈ గ్రంథములోని 7, 9, 10, 11 కావ్యములను చదివిన వారికి కవిజీవితములోని ఆవేదన స్పష్టముగా అవగాహిత మవుతుంది. ప్రస్తుతము మనజీవితము సంధిలో క్షోభిస్తున్నది. పాతమీది అభిమానమూ, క్రొత్తమీది కోరికా జీవితాన్ని తారుమారు చేస్తు న్నవి. అయితే మన కర్తవ్య మేమిటి! ఈ గ్రంథకర్త ఈ విషయమును ఎంతచిన్నమాటలతో ఎంత గంభీరముగా చెప్పినాడో 11-వ కావ్యము చదివి చూడండి. “నాడు కాదు నేడు. నేడు కాదు రేపు. పొంగిపోవు కాలవాహిని. దాని నడ్డుపెట్ట గలరె!” అని మార్పును అంగీకరిస్తూ ఏమంత బాగోడు గుకు అంతే-అంతే-అదైన శక్తిదీ!—”అని మానవుని శక్తిహీనతను చాటుతూ, అట్టివారని ఆక్షే పించవద్దని లోకానికి బోధిస్తున్నాడీ కవి.

ఈ కవి పద్మనాయక వంశీయుడు. పేరు పొందిన ఒక సంస్థానానికి భావి పరిపాలకుడు. పూర్వరాజుల పాలనపై ఈయనకు అభిమానమున్నది, ఇప్పటి రాజుల పద్ధతులూ, పాలనా ఈయనకు నచ్చలేదు. ప్రజలు కృతజ్ఞతాదూరులై రాజులపై తిరగబడుతున్నారు. కారణ మేమిటి? ఇప్పటి రాజులు చేతగాని వారు. అందుచేతనే శక్తి, కృతజ్ఞత, సత్యం– స్వస్తి చెప్పాయి అని కవి యభిప్రాయము. ఆ అభిప్రా యమును ఉద్రేకపూరితమైన భాషలో అతి గంభీరముగా, 11 వ కావ్యములో ఎలా వెల్లడించినారో చూడండి. తాను పూర్వరాజులవారసునని అనుకొని, దేశానికి దాస్యాన్ని రాకుండా రక్షించిన ఆనాటి వీరుల శౌర్యమును, ఆనాటి వీరాంగనల ఆత్మత్యాగమునూ, ఆనాటి శాంతి భద్రతలనూ స్మరిస్తూ కవి పాడిన ఆ కావ్యమును పాలకులూ ప్రజలూకూడా చదివి ఆనందింప తగ్గది.

ఈ గ్రంథములోని కొన్ని కావ్యములు పాఠకుని హృదయములో క్రొత్తక్రొత్త సమస్యలను రేకెత్తిస్తు న్నవి. మచ్చుకు 15 వ కావ్యము చూడండి. సిద్ధార్థుడు సర్వసంగపరిత్యాగము చేసి లోకకల్యాణాన్ని

సాధించి భగవంతుడైనాడు. అంతవరకే మన మెరుగుదుము. కాని తనకోసము సర్వమూ అర్పించిన యశోధరగతి ఏమి చేశాడు! ఆమె తన అర్ధశరీరము గదా? ఈ కావ్యము చదివినప్పుడు నాకు రవీంద్ర మహాకవి లక్ష్మణుని భార్య అయిన ఊర్మిళాదేవిని గూర్చి వ్రాసిన మాటలు జ్ఞప్తికి వచ్చినవి. భార్యను త్యజించిన రాముడు భగవంతుడు. భార్యను స్మరించని లక్ష్మణుడు ఆదర్శ సోదరుడు. కాని ఆ భార్యల విషయములో వారి కర్తవ్యము ఏమయింది? అది ధర్మమో, అధర్మమో మనకు వద్దు. కాని ఆ విషయమే మన మనస్సును తట్టలేదు. అట్టి విషయమును జ్ఞప్తికి తెచ్చి ఆ భర్తలు చేసిన లోకకల్యాణ ధర్మము కన్న ఆ భార్యల త్యాగము తక్కువది కాదని చాటిన యీ కవి ధన్యుడు. ఈ కావ్యములోని భావము ఎంత సున్నితమో అంత గంభీరము, ఎంత పవిత్రమో అంత ఉదాత్తము.

ఈ గ్రంథములోని కావ్యములను గద్యం పద్యం కాకుండా రచిస్తానని కవి మొదటనే చెప్పాడు. కాని కొన్నిటికి పద్యగతి తప్పలేదు. చదవడానికి వీలుగా తాండవము కోసము అనుకుంటాను. కొన్నిటిని తుంపులు తుంపులు చేసి అచ్చువేశాడు గాని వాటికి ఏదో ఒక నడక తప్పలేదు.

"పాడినా నొక పాట ఆడినా నొక యాట
ఆటకు పాటకు ఆగిపోయే దెందుకు
ఎవ రెవరో ఏమేమో ఎగిరిపడ్డారు
ఎందుకు కోపము ఏమిటా తాపము
ఆటకేనా ఇంత ఆలజడైపోయింది
పాటకేనా ఇంత మండిపోయారు."

పైపాదాలు ఏమంజరీ ద్విపదకిందికో వస్తవి. కాని కావాలని కవి కొన్ని కావ్యాలకు కాళ్లు విరుగ గొట్టినట్లు తోస్తుంది. అయినా నడక లేనిలోటును భావగాంభీర్యము కప్పిపుచ్చితే చాలును. ఈ కవి భాషలో కూడా కొన్ని విచిత్రాలు చేయక విడిచిపెట్టలేదు. "పాట లన్నీనండి" అంటే పాట లన్నీ అనండి అని అర్థము. ఇటువంటి స్వాతంత్ర్యాలు ఈ కావ్యములోని భాషలో చాలా ఉన్నవి. అవి లేకుంటే ఈ కావ్యము మామూలు పద్ధతిగానే ఉండేదేమో! అలా ఉండాలనే కవి ఒకదారీ తెన్నూ లేకుండా భాషను అధ్వానముగా వాడినట్లు తోస్తుంది. "అమ్మలక్క లందరింతే!" అని వ్రాసి ఆ కిందనే మనసునకు దూరి మేమి? అని వ్రాస్తాడీ కవి. పాతపద్ధతులమీది అభిమానమూ, కొత్తపద్ధతులమీది మోజూ ఈ రచనలలోని భాషలో స్పష్టముగా గోచరిస్తున్నవి. ఈ సాంకర్యము లేకుండా ఉంటే రచన ఇంకా శోభించేది అనక తప్పదు.

కొన్నిచోట్ల పులుముడు ఎక్కువగా ఉన్నది. అంటే ఒకవాక్యములో చెప్పతగ్గది నాలుగువాక్యాల దాకా పెంచడము. ఎంత కుదించి భావమును చెప్పగలిగితే అంత శోభిస్తుంది ఇట్టిరచన! "ముత్తాత చేసింది తాత చెయ్యగలేదు. తాత చేసింది తండ్రి యేమి చెయ్యడు. తండ్రి చేసింది కొడుకును చేయడే. కొడుకు చేసింది మనవ డెందుకు సేయు!" ఈ భావమును అంతకన్న గంభీరమైన మాటల్లో స్పష్టముగా చెప్పవచ్చు. "వాడు చేసే పనీ లేదు. నువ్వు చేసే పనీ లేదు. నేను చేసే పనీ లేదు. ఎవరు చేసే పనీ లేదు." ఇందులో భావము వెల్లడికావడానికి చివరవాక్యము చాలు ననుకుంటాను.

మొత్తముమీద ఈ గ్రంథము విచిత్రమయింది. రచన స్వచ్ఛందము. ముద్రణ అపూర్వము. ఇట్టి సరికొత్త కావ్యాన్ని తెనుగువారు చదివి ఆనందించడము సమంజసము.

# "చాలనీ"

## (పుస్తక సమీక్ష)

### పరతత్త్వరసాయనము
### ఈశ్వర ఫణిభట్ట ప్రణీతము
### మద్రాసు యూనివర్సిటీవారి పదవ ప్రచురణము

(32+112 పుటలు : రాయల్ సైజు : వెల 1-8-0) మదరాసు విశ్వవిద్యాలయములో ప్రాచ్యవిద్యా పరిషత్తు తెలుగుశాఖలో ఉద్యోగులుగా ఉన్న శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారున్ను శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రి గారున్ను కలిసి పరిష్కరించిన కావ్యము ఈ పరతత్త్వరసాయనము. ఆంగ్లభాషలో శ్రీ రామకృష్ణయ్యగారున్ను తెలుగులో శ్రీ లక్ష్మీపతిశాస్త్రి గారున్ను విపులమైన పీఠికలు వ్రాసి గ్రంథాదిని ప్రకటించారు.

ఇది వేదాంతాగమము బోధించే కావ్యము. సాంఖ్య యోగశాస్త్రవిషయములు తన గురు వగు సదానందావధూత తన కుపదేశించిన మార్గాన్ని అనుసరించి సవివరణముగా హృదయరంజకముగా బోధించవలె ననే ఉద్దేశముతో ఫణిభట్టు ఈ గ్రంథము రచించినాడు. భారతములోని హర సనత్కుమార సంవాదమును ప్రధానము చేసుకొని హరిభక్తి విజృంభితములైన సాంఖ్యయోగములవల్ల జ్ఞానసిద్ధి అవుతుందని దానివల్ల ముక్తి లభిస్తుందని బోధించినాడు.

ఈగ్రంథము ఐదాశ్వాసముల కావ్యము. మొదటి ఆశ్వాసముచివర కర్మయోగప్రకారమున్ను తక్కిన ఆశ్వాసములలో వరుసగా అనాత్మవివేకము, ఆత్మవివేకము, యోగత్రయలక్షణము, రాజయోగమున్ను ప్రశ్నోత్తరరూపముగా కవి వివరించినాడు.

మొదటి ఆశ్వాసములో పరతత్త్వవిషయము ఎత్తుకోకపూర్వము రచించినగ్రంథభాగము మాత్రము ప్రబంధఫక్కీలో ఉన్నది. ఇష్టదేవతా ప్రార్థనము, పూర్వకవిస్తుతి, కృతిపతి వర్ణనము అయిన తరువాత నైమిశారణ్యము వర్ణించి సూతుడు శౌనకాది మహామునులకు ముక్తి సాధనముగూర్చి ముచ్చటిస్తూ ధర్మరాజుకు భీష్ము డుపదేశించిన హరసనత్కుమార సంవాదము బోధించినట్లు తెలిపి, ఆసంవాదమే చెప్పడానికి ఉపక్రమిస్తున్నట్లు వ్రాసినాడు. ఆ సంవాదానికి భూమికగా కైలాసగిరివర్ణనము, కైలాస పురవర్ణనము, చాతుర్వర్ణ్యవర్ణనము, చతురంగ బల వర్ణనము, పురస్త్రీలు, పుష్పలావికలు, వారకాంతలు, మొదలయినవారి వర్ణనము, శివభక్తుల వర్ణనము, శివుడు కొలు వుండుట మొదలయినవి అర్వాచీన ప్రబంధ కవుల పద్ధతిని వ్రాసినాడు. ప్రసక్తి ఎట్లో కల్పించుకొని వసంతర్తు సూర్యాస్తమయాంధకార చంద్రోదయవర్ణనములు చొప్పించినాడు. పార్వతీ పరమేశ్వరుల అభ్యంతరవినోదములు, వారి సుఖనిద్ర, వంది మాగధుల స్తుతులతో వారు మేల్కొనుట, జలక మాడుట, అలంకరించుకొనుట. వనకేళి, సపరివారముగా వారు వనముల కేగుట - ఇవన్నీ వర్ణించి బదరికావనములో శివుడు సనత్కుమారుని చూచి కైవల్యప్రాప్తిసాధనము తెలుపుమని కోరినట్లు వ్రాసినాడు. శివసనత్కుమారు లొకరి నొకరు పొగడుకొన్నారు. తన గురు వగు సదానందావధూతను "హరిమూర్తి యైన సదానంద పరబ్రహ్మము" గా సనత్కుమారుడు పదిపద్యములలో స్తోత్రము చేసినట్లు స్తవదశకము రచించి దాని ఫలశ్రుతికూడా చేర్కొన్నాడు.

ఇంతవరకూ ప్రబంధఫక్కీ కనబడుతుంది. మనుచరిత్రాదిధోరణి ఇందులో లేదని పీఠికా కారు లన్నారు. కాని ఈరచన అంతా పిల్లమనుచరిత్రల అనుకరణముగా కనబడుతుంది. పూర్వాంధ్రకవుల రచనలలో కనబడని ఉత్తరాంధ్రకవుల పదప్రయోగము లీగ్రంథములో ఎన్నో ఉన్నవి. తరువాతిగ్రంథమంతా

సుగమముగా ఉన్నా, రచనాచాతుర్యము కనబడుతూ ఉన్నా ధర్మశాస్త్ర గ్రంథపద్ధతినే నడిచినది. సుబోధముగా హృదయరంజకముగా సంవాదము నడిపినాడని మాత్రమే చెప్పవలెను కాని గ్రంథ మంతా ప్రబంధఫక్కీలో ఉన్నదనడానికి అంతగా అవకాశము కనబడదు.

భారతములోని మూలగ్రంథము నెట్లు ఈకవి అనుకరించినాడో భాగవతాది గ్రంథముల అనుకరణ మెక్కడెక్కడ కనబడుతున్నదో శ్రీ లక్ష్మీపతిశాస్త్రి గారు నిరూపించినారు.

సదానందావధూత ఏ కాలపువాడో కవికాలమేదో నిర్ణయించడానికి తగిన ఆధారములు గ్రంథములో లేవు. ప్రబోధచంద్రోదయము నంధ్ర ప్రబంధముగా రచించి ఈ కావ్యకర్తకు మార్గదర్శకు లయిన నంది మల్లయ్యా, ఘంట సింగయ్యాలకూ, పోతనామాత్యునికీ ఈ కవి తరువాతివాడనీ, అనగా పదునేనవ శతాబ్దిచివరి భాగమున నున్నవాడని శ్రీలక్ష్మీపతిశాస్త్రి గారన్నారు. మనుచరిత్రాది ధోరణి దీనిలో లేదు గాన యీతడంతకంటె క్రిందికి దిగడని కూడా నిశ్చయించినారు.

గ్రంథస్థము లైన కొన్ని అపభ్రంశరూపము లెత్తి చూపినారు పీఠికాకారులు. అవి వాడుకనుబట్టిపడినవో, ప్రక్షిప్తములో నిర్ణయించ వీలుపడ దన్నారు. ప్రక్షిపము లని సమర్థించడానికి ఎంతమాత్రమూ అవకాశము కనబడదు. వాడుకను బట్టి అవి పడి ఉండవలెను. “వకవేళ సంసారివలెను దావర్తించు” “వొక్కొక్క రాత్రియందు శశి వోవుచు” “వో దయామృత సాగరా నిను బోలు” “యేం జేసి” మొదలయిన రూపములు ఏ కాలములో వ్యవహారములోనికి వచ్చినవో తెలుగు శాసనములను బట్టి నిర్ణయించి తన్మూలకముగా కవికాలము నిరూపించడము సమంజస మని తోస్తుంది.

శృంగార రస ప్రధానము లైన ప్రబంధములే కాని పరతత్త్వ బోధకములైన సత్కావ్యములు మన వాఙ్మయములో అంతగా లేవని భావించేవారికి ఈ కావ్యమూ, శ్రీ రామకృష్ణయ్యగారు తమ ఆంగ్ల పీఠికలో పేర్కొన్న అముద్రిత గ్రంథముల పేరున్నూ ఈ అపోహ తొలగిస్తవి. ఇట్టి గ్రంథము లీ తెలుగు శాఖవారు ఇంకా ఇంకా ప్రకటింతురు గాక.

“సం”

## కాశీయాత్ర చరిత్ర

### ఏనుగుల వీరాస్వామయ్య

(౨౦+౩౭౮+౧౦ పుటలు : వెల రూ ౨.)

సంపాదకుడు : దిగవల్లి వేంకట శివరావు, బి. ఏ., బి. ఎల్., గవర్నరుపేట, బెజవాడ.

శ్రీ శివరావుగారు న్యాయవాది వృత్తిలో వుండి కూడా వీలుచేసుకొని వివిధ విషయాలమీద దేశానికి ఉపకరించే గ్రంథాలు వ్రాస్తున్నవారు. ఆంధ్రములో రాజనీతి విషయమై వీరు వ్రాసినన్ని గ్రంథములు ఇంకెవరూ వ్రాయలేదు. మన Publicists లో ప్రముఖులు. ఇప్పుడు ఈ గ్రంథాన్ని సంపాదించి సర్వాంగ సుందరము చేసి ప్రకటించారు. ఇది తృతీయముద్రణము.

ఏనుగుల వీరాస్వామయ్య చెన్నపట్టణములోని ‘సుప్రీముకోర్టులో’ ‘హెడ్ ఇంటర్ప్రెటర్ గా’ తెల్లదొరల మన్ననలు పొందినవాడు. నిరతాన్న ప్రదాత అని, గవర్నమెంటువారు కరువురోజుల్లో పెట్టించిన ‘గంజిదొడ్డి’ అనే సంస్థను బాగా నిర్వహించాడనీ, తెలుస్తున్నది. చాలా దేవాలయాలలో ధర్మకార్యాలు చేసి రథాలు కట్టించాడనీ, పండిత మహాసభలో క్షయమాస విషయమై ప్రమాణపూర్వకంగా స్థాపన చేస్తే అయనకు రత్నహారము పెద్దలు బహుమతి చేశారనీ, చెన్నపట్నంలో ‘హిందూ లిటరరీ సొసయిటీ’ అనే విద్వత్సభ సంస్థాపించాడనీ, ఉద్యోగానంతరం వానప్రస్థాశ్రమము స్వీకరించి వేదాంత విచారణ చేస్తూ చివరరోజుల్లో ఆపత్సన్యాసం పుచ్చుకొని వివేకంతో ౧౮౩౬ అక్టోబరు ౩ తేదీన దేహం చాలించాడనీ, ఆయన మిత్రుడూ కాశీయాత్రా

చరిత్ర ప్రథమ ముద్రణము వేయించిన కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళె వ్రాశాడు.

వీరాస్వామయ్య సకుటుంబంగాను, సపరివారంగాను, కాశీయాత్రకు పోయినప్పుడు తాను చూచిన దేశాలు, నగరాలు, పల్లెలు. అందుండే నానాజాతుల మనుష్యులు వారి చర్యలను గురించి సవిస్తరముగా వర్ణిస్తూ దినచర్యగ్రంథంగా మిత్రుల కోరికమీద వ్రాయించాడు. వీటిలో ఆయన అక్కడక్కడా చేసిన ప్రసంగాలుకూడా ఉన్నవి. కలకత్తా కంపెనీ వారి కొలువులో ప్రధాన క్రైస్తవ మతాధికారిగా ఉండిన హెబ్బర్ దొర ౧౮౨౪ - ౨౬ మధ్య, భారత దేశ పర్యటనం చేసి తాను చూచిన సంగతులను దినచర్య గ్రంథముగా, ఇతరఉత్తరాలుగా వ్రాసినాడు, వీరాస్వామయ్యగారి గ్రంథం దీనికి ఏవిధంగానూ తీసిపోదు. ఈ గ్రంథానికి క్రీ. శ. ౧౮౩౭ వీరాస్వామయ్యగారే సి. పి. బ్రౌన్ దొరకు ఒక కాపీ వ్రాసి పంపినారు. దీనిద్వితీయముద్రణ క్రీ. శ. ౧౮౬౯ సంవత్సరము ఏప్రియలు నెలలో గవర్న మెంటువారి ఉత్తర్వు ప్రకారము పువ్వాడ వెంకటరావుగారివల్ల జరిగింది. తృతీయ ముద్రణము శ్రీశివరావు గారిది.

వీరాస్వామయ్య కాశీయాత్ర చేయడంలో కడప, హైదరాబాదు, నాగపూరు, జబల్‌పూరు, అలహాబాదుల మీదుగా పోయినాడు. తిరిగి వచ్చేటప్పుడు ఘాజీపూరు, చప్రా, పట్నా, గయ, కలకత్తా, పూరీ, గంజాం మీదుగా ఉత్తర జిల్లాలగుండా వచ్చాడు. ఈ యాత్రా విషయంలో తన కష్టనిష్టూరాలు, ప్రసంగాలు, దేశాచారవ్యవహారాలు, మొదలైన వాటిని గురించి దినచర్య వ్రాశాడు. దానిలో కొన్నిచోట్ల స్థలమాహాత్మ్యాలు,పుణ్యక్షేత్ర కథలు విపులంగా ఉన్నవి. మహానదుల పుష్కరలు పురాణాల్లో వాటికి సంబంధించిన గాథలు సందర్భోచితంగా ఉట్టంకింపబడ్డవి. హిందూమతము, క్రైస్తవమతము, ఇస్లాంమతాలనుగురించి కొన్ని చర్చలున్నవి. హిందువుల విగ్రహారాధనానికీ, బాల్య వివాహాలకు, స్త్రీ పునర్వివాహ రాహిత్యానికీ కారణాలను సూచించేప్రసంగాలు కొన్ని సందర్భపురస్సరంగా గ్రంథస్థము చెయ్యడమైనది. అనాటి హిందూ దేశ పరిస్థితులను అవగతం చేసుకోదలచుకున్న వారికి వీరాస్వామయ్యగారిదినచర్యకంటేవిషయ ప్రాధాన్యమైన గ్రంథం మరొక్కటి లేదని చెప్పవచ్చును. అందువల్లనే ఇది ప్రమాణగ్రంథంగా కూడా ఎంచుతారు.

పాతకూప్పల్లోని పద్ధక్రమాన్ని మార్చి శ్రీ శివరావు గారు సక్రమమైన పద్ధతిలో దీన్ని ప్రకటించారు. ఈపనిలో ఉన్నకష్టం క్రింది మాదిరి వాక్యాలు చూస్తే తెలుస్తుంది.

'యిక్కడి పరమాత్ముడు సంపూర్ణ కటాక్షంతో ప్రతిఫలించ్చి యిష్టసిద్ధి చేస్తూ వున్నాడు. వుండే శ్రీనివాస ప్రతిమే దివ్యమంగళ విగ్రహంగా వున్నది. దేవతులలో ల్యాక దేవతులకు సమానమైనవాడై గత కాలంలో అమూర్తిని ఆరాధించ్చినట్టు తోస్తున్నది. ఇక్కడ గోసాయి బయిరాగులకు గురుపీఠంగా వుండ్డే మహాంతుమఠం పకట్టి అతివిశాలంగ్గా కట్టి వున్నది. ఆమహాంతుకు శిష్యార్జన విస్తారం కలదు. యిండ్లు. సంకుచితం చైత్రమాసం మొదలు జ్యేష్ఠమాసం పర్యంత ఉదయ కాలముద్దు ఫల్లని ఘాలి కొట్టుతున్నది. అది శిలించ్చి కొండబూన వుండే వారికి ఎండ్డారోగ్యప్రద మవుతున్నది.

గ్రంథానికి శ్రీనివాస పిళ్ళెగారి పీఠిక, 'వీరాసామయ్యాగారు వారి మిత్రులు' అని శివరావుగారి వ్యాసము అత్యవసరమైనవి. అవి ఉండటంవల్ల చదివేవాళ్ళకు అనాటి పరిస్థితులు బాగా అవగాహనకు వస్తవి. దీనికి తోడు క్రీ.శ. ౧౮౩౦-౩౧ మధ్య వీరాసామయ్యగారు చేసిన కాశీయాత్రను సూచించే పటము, హిందూదేశపటము పాఠకుల సౌలభ్యము కోసం ఏర్పాటైనవి. ఈ ముద్రణానికి ౧౯౯౨ ముద్రణంలో ఉన్న యేనుగుల వీరాస్వామిగారి చిత్రంతోపాటు పచ్చయప్ప కళాశాలలోని డార్జి నార్టన్, కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళె, శంబాకం రాఘవాచార్యులు, ఏనుగుల వీరస్వామయ్య కలిసి తీయించుకొన్న చిత్రం మరొక అలంకారం - అత్యవసరమూ.

ఈ ముద్రణంలో మరొక ప్రత్యేకత అనుబంధం. ఆ నాటి సాంఘిక రాజకీయ పరిజ్ఞానానికి అవసరమైన కొన్ని గ్రంథనామాలు, సౌరమాన చాంద్రమానములు అధిక క్షయ మాసాలను గణించిన పద్ధతి – సవరణ పట్టిక, వ్రాత ప్రతి మచ్చుపుటలు, కొన్ని పదాలకు అర్థాలు, అకారాది విషయసూచిక అనుబంధంలోని అంశాలు. ఇటువంటి పుస్తకాలను ఏవిధంగా సంస్కరించి సంపాదిస్తే ప్రశస్తంగా ఉంటుందో ఆదర్శంగా శ్రీ శివరావు గారు తమ కృత్యాన్ని నిర్వహించారు. ఇది ప్రతిపుస్తక భాండాగారంలోనూ ఉండవలసిన గ్రంథము.

వాకిలాల సోమయాజులు

## హిందూ మతము

(పుటలు ౨౮ + ౧౬౮ : వెల రూ ౧—౧౨—౦)

శ్రీ జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.,

ప్రిన్సిపాల్, సంస్కృత కళాశాల, కొవ్వూరు.

ఈ పుస్తకానికి జగద్గురు శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారి 'తొలిపలుకు' అనుగ్రహించినారు. విద్వాంసులు, ఆర్యధర్మవేత్తలు అయిన శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రి గారు, ఉప్పులూరి గణపతిశాస్త్రి గారు, పుల్య ఉమామహేశ్వర శాస్త్రి గారు, కాశీ కృష్ణాచార్యులుగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు మొదలైన ప్రముఖులు సదభిప్రాయము ఇచ్చినారు. ప్రథమ ముద్రణము అయిన మూడుమాసములకే ద్వితీయ ముద్రణము కావడము ఈ పుస్తక ప్రాశస్త్యమును తెలియజేస్తున్నది.

హిందూమతమన్నప్పుడు హిందూశబ్దము పరులు వాడిన దన్న భావము బహుళముగా ఉన్నది. హిందూ శబ్దము సప్తసింధునుంచి వచ్చిందనీ, సప్తసింధువు ఆర్యుల నివాసమనీ, సకారము హకారముగా మారడము ప్రాకృత సంప్రదాయమని, ఇది పరదేశపదము కాదనీ శ్రీ వినాయక సావర్కరు మొదలగు ప్రముఖులు వ్రాసినారు. మహామేరు తంత్రము అనే ప్రాచీన గ్రంథములో హిందూశబ్దము ఉన్నది.

"హీనం చ దూషయత్యేవ హిందు రిత్యుచ్యతే ప్రియే. హిందూధర్మ ప్రలోప్తారో భవేయుశ్చక్రవర్తినః". ఈ శ్లోకము ప్రక్షిప్తము కాకపోతే, మేరుతంత్రము సంప్రదాయ సిద్ధమైన వైదిక మతానికి చెందినదే కావడంచేత హిందూధర్మము సనాతన వర్ణాశ్రమ ధర్మానికి పర్యాయపదము. మతశబ్దము వాడుకలో ఉండడంచేత హిందూ మతమని ఈ పుస్తకానికి పేరు పెట్టినారు.

సనాతన ధర్మమని కాని, ఆర్య ధర్మమని కాని పేర్లు వాడుతూ ఉంటారు.

సనాతనధర్మానికి కొన్ని ముఖ్య మూలసూత్రాలు ఉన్నవి. శ్రుతి స్మృతి ఇతిహాస పురాణ సదాచార ప్రామాణ్యము, వర్ణవ్యవస్థ, పునర్జన్మ, దైవప్రత్యేక కర్మలు కార్యాల పుణ్యక్షేత్ర మహాత్మ్య విశ్వాసము, అవతారములు, లోకాంతరములు, విగ్రహారాధనాది అధికార్యానుగుణ ఆరాధన ఉపాసన విధానాలు, స్త్రీల ప్రత్యేక ధర్మాలు మొదలైనవి.

ఈ పుస్తకములో ప్రమాణములు, నవయుగము, వర్ణవ్యవస్థ, ఆశ్రమధర్మములు, కర్మకాండ, శీలము, స్త్రీధర్మము, భగవద్విషయము అని ఎనిమిది అధ్యాయములు ఉన్నవి. వీటివల్ల సనాతనధర్మస్వరూపము చాలావరకు పాఠకులకు కరతలామలకము అవుతున్నది.

శ్రీ పురుషోత్తముగారు వేదాధ్యయన సంపన్నుల కుటుంబములో జన్మించి, సంప్రదాయసిద్ధముగా విద్యాభ్యాసము చేసి, శ్రుతి స్మృతి పురాణాది గ్రంథాలను సవిమర్శముగా పఠించి, గ్రంథములు వ్రాస్తున్నవారు. వీరు చూపిన ప్రమాణవాక్యములు, చేసిన వ్యాఖ్యానములు నిర్దుష్టములు. సనాతనధర్మాన్ని విరుద్ధ భావంతో విమర్శించేవారికి వీరు కొన్ని సమాధానాలు ఇందులో చెప్పినారు.

ఆస్తికులకు 'హిందూమతము' అనే శబ్దముకన్న సనాతనధర్మము, ఆర్యధర్మము, వైదికధర్మము అనే పదములే ఇష్టము. ఈ పర్యాయము గ్రంథమును ప్రకటించేటప్పుడు పురుషోత్తముగారు నామపరివర్తనము చేస్తారని నమ్ముతాను. వాదగ్రంథముగా

కాకుండా కేవలప్రస్థానరూపముగా సనాతనధర్మమునుగురించి సమగ్రమైనగ్రంథము సరళమైన వ్యావహారిక భాషలో వీరు విరచించవలె నని నాకోరిక.

త. శి. శా.

## శత రాగ రత్నమాలిక

(౩౦+౧౯౫ పుటలు: వెల రూ ౪.)

శ్రీమదాచార్య తిరుమల నల్లాన్ చక్రవర్తి,

వేంకట నారాయణాచార్యులు,

శ్రీనివాస నిలయం, బ్రాడీపేట, గుంటూరు.

ఆచార్యులుగారు వైణికులుగా చాలా కాలము నుంచీ ప్రసిద్ధి చెందినవారు శిష్యులనేకులు వీరివద్ద సంగీత మభ్యసించి పైకి వచ్చినారు.

భక్తిపరులు కావడంచేత ఆచార్యులుగారు వేంకటేశ్వరస్వామి పైన కొన్ని కీర్తనలు స్వరసాహిత్యములతో రచించినారు. ఒకరాత్రి స్వప్నములో శ్రీనివాసులు (వేంకటేశ్వరస్వామి) యోగివేషముతో దర్శన మిచ్చి "విజయీ భవ" అని దీవించి అంతర్ధానము చెందినాడట. అప్పటినుంచి ఈ గ్రంథకర్త ద్విగుణీతోత్సాహముతో నూరు కీర్తనలు చెప్పినారు.

ఈ గ్రంథము కల్యాణిరాగములో ఆదితాళమున "శ్రీహృదయ శ్రీనివాసా శ్రితజనపోషక" అనే కీర్తనతో ప్రారంభమై, సౌరాష్ట్రరాగ ఆదితాళమున "నీసమానమైన మేము కానరా శ్రీశ" అనే కీర్తనతో సమాప్త మాతున్నది. ప్రతికీర్తన పల్లవి అనుపల్లవి, చరణము అనే పద్ధతిమీద నడిచింది. భగవన్నుతి ప్రతిదానిలోనూ ప్రస్ఫుటముగా ఉన్నది. ఆచార్యులుగారు ఆర్ద్రహృదయముతో చెప్పినకృతులు కాబట్టి భాషలోనూ, భావములోనూ సారళ్యము ఉన్నది. జాతిభేద సప్తతాళ సహిత శతరాగ రత్నమాలిక అని గ్రంథ సంపూర్ణనామము. ప్రతి కీర్తన రాగతాళాదుల లక్షణంతో కూడిన స్వర రచనాపద్ధతి కల వర్ణముల మెట్టులతోనూ, దశప్రాణానుసారమైన తాళాంగక్రియాది విభజనలు కల వివేచనా పద్ధతులతోనూ విపులీకృతమైనది. సప్తతాళములలో సూళాదితాళముల వరుసన నూరు కీర్తనలు నిర్మితమైనవి. వీరి కీర్తనలలో రాగవిన్యాస పూర్వక స్వరమూర్ఛనలు వీరి వీణావాదన తత్వజ్ఞతను విశదీకరిస్తున్నవి. సూళాది తాళము లన్నింటిలో కీర్తనలు వాగ్గేయ కారకులు విశేషముగా రచించినట్లు కనపడదు. ఈ గ్రంథము సంగీత విద్యార్థులకు చాలా ఉపయోగకరము.

దీనికి సంగీత విద్వాన్, గాయకరత్న, శ్రీ పిరాట్ల శంకర శాస్త్రిగారు పీఠిక వ్రాసినారు. సుప్రసిద్ధులైన సంగీత విద్వాన్ మైగను శరదాచారిగారు ఈ పుస్తకమును పరిశోధించినారు. సంగీత విద్వాంసు లనేకులు దీనిమీద సదభిప్రాయము ఇచ్చినారు. సంగీత ప్రియులకు ఈ పుస్తకము సంతోషదాయకము కాగలదు.

త. శి. శా.

## నీ కో సం

(పెద్దకథ: ౧౦౫ పుటలు: 0-౬-0)

పన్యాల రంగనాథ రావు,

కవితా కుటీరం – అనకాపల్లి

ఈ కథ శుభాంతము. ప్రారంభించినది మొదలు చివరవరకూ అడ్డకుండా చదువరిని లాగుకుపోతుంది. అయితే మధ్యమధ్య అనవసరంగా ఇంగ్లీషుమాటలు తగులుతూ ఉంటవి. విధి లేకపోతేనే ఇంగ్లీషుపదం వాడవచ్చు. సంస్కృతం,హిందుస్తాని, ఇంగ్లీషు, ఈ క్రమంలో పదాలు వాడితే బాగు.

ఇందులో పాత్రలు, స్త్రీ పురుషులు అందరూ యోగ్యులే. నీరస జుగుప్సాకర శృంగారము కాకుండా ముగ్ధ ప్రణయము, సంస్కార సరణిలో వివాహమూ ఇందులో వర్ణితాలు. కథా విధానములో కొంచెం పరదేశ వస్తుస్ఫుర్తి ఉన్న దేమో అనిపిస్తుంది. స్వతంత్రరచన అయినా కావచ్చు. ఈరచయితకు పద్య గేయ రచనకన్న వచనరచన పట్టు పడినట్టు కనిపిస్తుంది.